# ఎదురుగాలి

(నవల)



రచన:

తాళ్ళూరు నాగేశ్వరరావు

శ్రీగోపాలకృష్ణ పబ్లికేషన్స్
చుట్టుగుంట :: విజయవాడ-4

శ్రీ గోపాలకృష్ణ ప్రచురణ

ద్వితీయ ముద్రణ

సెప్టెంబరు - 1965

వెల : 5-00

ముద్రణ :

సర్వోదయ ప్రెస్

విజయవాడ-6

కని పెంచిన తల్లిదండ్రు
లకు భక్తి శ్రద్ధ
లతో ....

౧

గుంటూరునుంచి ఉదయం ఎనిమిది గంటలకు బయలు దేరిన హైద్రాబాద్ డీలక్స్ ఎక్స్‌ప్రెస్ బస్సు నాగార్జున సాగర్ పైలాన్ కాలనీకి మధ్యాహ్నం ఒంటిగంటకు చేరింది.

ఎండ మిటమిట లాడుతోంది.

బస్సులోంచి దిగుతూ, ఉమాశశి ఎదురుగ్గా ఉన్న షెడ్డులోకి చూచింది – తనని ఆప్యాయంగా ఆహ్వానించడానికి అక్కయ్య వచ్చిందేమోనని.

మబ్బురంగు మైసూరు శిల్కు చీరెమీద గులాబి రంగు పాప్లిన్ బ్లౌజు ధరించి, ఒంటి పేట గొలుసు గల లాకెట్ మెడలో వ్రేలాడుతుండగా, హ్యాండు బాగ్‌తో చెల్లెలు బస్సు దిగుతూండడాన్ని షెడ్డు చూరుక్రింద నీడలో నిలబడ్డ అమరేశ్వరి చూచి, మనస్సులో సరికొత్త సంతోషం చిందులువేయగా, ఆ సంతోషాన్ని చిరునవ్వుద్వారా ప్రకటిస్తూ గబగబా బస్సు దగ్గరకు వచ్చింది.

అక్కయ్యను చూచిన ఉమాశశి హృదయం ఆనంద ప్రపూర్ణమైంది.

"అక్కా! నువ్వు బస్సుస్టాండుకు వస్తావో, రావో! మా యింటికోసం ఈ ఎండలో నురుగులు కక్కుతూ వెతకాలేమోనని మాచెర్లనుంచి ఆలోచిస్తున్నాను" అన్నది ఉమాశశి అక్కయ్య ప్రక్కన నడుస్తూ.

"ఓస్! ఇంతేనా? అసలు నువ్వు యీ బస్సుకి వస్తావో, రావో; ఎన్ని బస్సులకోసం ఎదురు చూడాలోనని నేను ప్రొద్దుటినుంచీ ఆలోచిస్తున్నాను" అన్నది అమరేశ్వరి.

ఇద్దరూ పక్కన నవ్వాస.

"భావగారు వర్క్సుమీదకు వెళ్ళారా?"

"ఊఁ, రెండు గంటలకుగాని భోజనానికి రారు. మన ఇల్లు ఇక్కడికి చాల దగ్గర. ఓ ఫర్లాంగు దూరం వుంటుంది. అమ్మా, నాన్నా – అంతా కులాసాయే గదూ!"

"ఆఁ!"

"ఎన్నాళ్ళు మీకు సెలవులు?"

"ఈనెల ఆఖరిదాకా"

ఇద్దరూ క్వార్టర్సు దగ్గరకు వచ్చారు. అన్నీ ఒకే రకమైన అందమైన క్వార్టర్సు. రోడ్లన్నీ తీర్చిదిద్ది వున్నాయి. ప్రతి క్వార్టరు ముందూ ఖాళీస్థలంలో అపేక్షగా పెంచుకున్న సుందరమైన పూలతోట, చుట్టూ ఫెన్సింగ్, ముందు గేటుపై సన్నజాజి చెట్టు ఆర్చిగా అమర్చబడ్డ ఓ క్వార్టరులోకి అమరేశ్వరి ముందుగా నడచింది. ముఖానికి పట్టిన చిరు చెమటను చేతిరుమాలుతో అద్దుకుంటూ ఉమాశశి అక్కయ్యను అనుసరించింది.

"అక్కా? అంతదూరంలో వుండే యీ క్వార్టరు మీదై వుంటుందని గ్రహించాను. ఎందుచేతనంటే, నీకు ప్రియమైన సన్నజాజిచెట్టు ఇంటి ముందుండి నీ ఉనికిని చాటుతోంది" అన్నది ఉమాశశి డ్రాయింగు రూంలోకి ప్రవేశించి.

అమరేశ్వరి ముద్దబంతి పువ్వులా నిండుగా చిరునవ్వు నవ్వుతుంది.

ఉమాశశి ముందుగా ఇల్లంతా పరిశీలించి తన అభిప్రాయాన్ని వ్యక్తపర్చింది. "అక్కా? క్వార్టరు చాలా చిన్నది. అసిస్టెంటు ఇంజనీర్సుకు ఇచ్చేవి యీపాటి క్వార్టర్సేనా? లేక సూపర్‌వైజర్లకోసం కట్టించినవా! అయినా భార్యాభర్త లిద్దరే గనుక - ఇబ్బందిగా లేకపోవచ్చు. చిన్నదైనా నీటుగా ఉంది."

ఆ ఇల్లు ఒక విధంగా చెల్లెలికి నచ్చినందుకు అమరేశ్వరి అజ్ఞాతంగా సంతోషించింది.

"ప్రయాణ బడలికతో ఆకలిగా వున్నట్టున్నావు. భోంచేస్తావా! లేక బావగారు వచ్చేవరకూ ఆగుతావా? ముగ్గురమూ భోంచేద్దాం."

"నాకు ఆకలిగా ఏంలేదు. ఉదయం అమ్మ అరడజను ఇడ్లీ తినేవరకూ ఇంటినుంచి బయలుదేరనివ్వలేదు. రోడ్లు అధ్వాన్నస్థితిలో ఉండబట్టి, బస్సు కుదుపుళ్ళకు తిన్న ఇడ్లీ జీర్ణించుకోవడం జరిగిందిగాని - లేకపోతే, ఈవేళ భోజనమే మాని వెయ్యాల్సింది కాదూ!"

చెల్లెలి మాటలకు అమరేశ్వరికి నవ్వు వొచ్చింది.

మధ్యాహ్నం రెండుగంటలకు మోహన్‌కుమార్ లెఫ్ట్ బ్యాంక్ కెనాల్ నుంచి కారులో భోజనానికి ఇంటికి వొచ్చాడు. డ్రాయింగ్ రూమ్‌లో కూర్చొని 'ఇల్‌స్ట్రేటెడ్ వీక్లీ' లో బొమ్మలు చూస్తోన్న ఉమాశశిని చూచి - మరదలు పిల్ల ఎప్పుడో మూర్ఖారు వొచ్చిందే" అన్నాడు.

"ఒక గంటక్రితమే వొచ్చాను - బావగారు ఎట్లా ఉన్నారో చూచిపోదామని"

'ఓహో' అన్నట్టు ఆశ్చర్యంగా కనుబొమలు సాగదీశాడు, మోహన్‌కుమార్.

"ఇంత చిన్న విషయానికే అంత పెద్ద అబద్ధమాడడం దేనికి? అక్కగారు ఎట్లా ఉన్నారో చూచి పోదామని వొచ్చానన రాదూ!"

"ఆ మాటంటే - 'ఏం! నన్ను చూడకూడదా? చూస్తే పాపమా?' అని దెప్పి పొడుస్తారు. ఎందుకొచ్చిన బెడదని అట్లా అన్నాను. అసలు నేనిక్కడికి రావడంతో రెండు ముఖ్యోద్దేశాలున్నాయి. ఒకటి - మీ ఇంగువుర్కి చూడటం, రెండోది - నాగార్జునసాగర్ ప్రాజెక్టు చూడడం"

"ముఖ్యం కాని ఉద్దేశాల్ని తెల్సికోవచ్చా?"

"ఏమున్నాయి? కులాసాగా శెలవలన్నిరోజులూ ఇక్కడ కాలక్షేపం చేద్దామని"

"పెద్ద ప్రోగ్రామే పెట్టుకున్నావన్నమాట."

అంతలోనే ముఖంలో రంగుల్ని కరుగ్గా మార్చుకొని "ఏం? నేను రావడం మీకిష్టంలేదా?" అన్నది ఉమాశశి నిర్మొహమాటంగా.

"ఎంతమాట? అక్కయ్య కాపురాన్ని చూడాలని ఇంత అభిమానంగా నువ్వు రావటమేమిటి, నాకిష్టం లేక పోవటమేమిటి? ఈ కొండల్లో కోనల్లో కాలం మరీ నిద్ర పోతోన్నట్టుంటూ న్నది. నీలాంటి చలాకీయైన మరదంపిల్ల సమక్షంలోనైనా కొన్నిరోజులు కదిలికను చూడొచ్చు

నువ్వు ఇక్కడికి రావటం మీ అక్కయ్యకు ఎంత సంతోషమో నాకూ అంత సంతోషం. మొత్తానికి గులాబీ పువ్వుకు ముళ్ళుంటాయని జ్ఞాపకం చేస్తూ మాట్లాడుతున్నావు" అన్నాడు మోహన్ కుమార్ తెచ్చిపెట్టుకున్న గంభీరతతో.

టేబిల్ పైన భోజనం వడ్డిస్తూ అమరేశ్వరి బావా మరదళ్ళ సంభాషణ వింటూన్నది. వడ్డించడం కాగానే ఇద్దర్నీ పిలిచింది గాలిపటపు దారంలాంటి సంభాషణ వాళ్ళిద్దరిమధ్యా నడుస్తూనే వుంది. భోజనానికి కూర్చొన్నా మాట్లాడుకుంటూనే ఉన్నారు.

"ఇంత భారీమొత్తున, బృహత్తరమైన పథకాల క్రింద చురుగ్గా నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణం సాగుతూంటే, కొన్ని వేలమంది నిర్విరామంగా పనిచేస్తూంటే, కోట్లకొలది డబ్బు ఖర్చు అవుతూంటె – ఇక్కడి మీకు కాలం నిద్ర బోతున్నట్టు వుండటం నాకు ఆశ్చర్యంగావుంది బావగారూ! ఇట్లాంటి ప్రాజెక్టుల పునాదులతో నవభారత నిర్మాణం శర వేగంతో జరుగుతూన్న తరుణంలో – ఎంతో బాధ్యతగల మీలాంటి ఇంజనీర్లు యింత బద్ధకంగా మాట్లాడటం బావుండ లేదు. 1955 డిసెంబరు 10 వ తేదీన ప్రాజెక్టుకు శంకుస్థాపన చేస్తూ, మన ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ఏమన్నాడో గుర్తున్నదా! 'ఈరోజు పవిత్రమైన సుదినం. ఇది భారతీ యుల వికాసపు దేవాలయానికి శంకుస్థాపన; అభ్యుదయ పథంలో దేశమంతటా నిర్మించబడే దేవాలయాలకు ఇది చిహ్నం. మూడున్నరకోట్ల ఆంధ్రుల కలల పంట చిరకాల వాంఛ. ప్రగతి పథంలో దేశం ముందంజ వేస్తూన్నదనడానికి,

ప్రణాళికలద్వారా దేశాభివృద్ధి జరుగుతూన్నదనడానికి, అధికోత్పత్తులతో ఆర్థికస్తోమతను పటిష్టంచేసుకొనే ప్రయత్నాలు నిరంతరం జరుగుతున్నాయనడానికి – ఇట్లాంటి పెద్ద పెద్ద నిర్మాణాలు నిదర్శనాలేగదా! ఎన్నో సంవత్సరాలు కష్టనష్టాలకోర్చి సంపాదించిన స్వాతంత్ర్యాన్ని ప్రజాస్వామ్య పద్ధతులద్వారా అనుభవించాలంటే, ప్రతివ్యక్తి తన ధర్మాన్ని కర్తవ్యాన్నీ గుర్తెరిగి, నీతినిజాయితీలతో, దృఢమైన దీక్షతో కృషిచేయాలి" అన్నది ఉమాశశి పళ్ళెంలో అన్నమూ, కూరా కలుపుకుంటూ.

ఆమె మాటలకు మోహన్‌కుమార్ దిగ్భ్రాంతిని చెందినట్లు ముఖంలో స్పష్టంగా ప్రకటించాడు

"ఓహో! ఏమిటో అనుకున్నాను. మరదలుపిల్ల మాంచి గడుసు పిల్లయేనే! నా ఊహప్రకారం ఈమాధ్యనే నువ్వు కాలేజీ డిబేట్సులో 'భారతదేశపు ప్రణాళికలు – ప్రాజెక్టులు' అన్నవిషయంపై అనర్గళంగా మాట్లాడివుంటావు. ఆ ప్రభావమే ఇంకా నీలో కనబడుతూంది. ఏం? నా ఊహ కరక్టేనంటావా?" అన్నాడు మోహన్‌కుమార్ కనుబొమలు కదిలిస్తూ.

చిరునవ్వు నవ్వింది ఉమాశశి, ఆ చిరునవ్వులో దొర్లిన నిర్లక్ష్యభావం అతనిచే గుర్తింపబడలేదు.

"కాలేజీ డిబేట్సుకోసం నేను కొన్ని ఆదర్శాల్ని, భావాల్ని, మాటల్ని ప్రాక్టీసు చేస్తున్నాననే ఊహను బావగారు కలిగివుండటం శోచనీయం. నాకు నేనుగా ఆలోచించుకొనేశక్తి, నాకు నేనుగా మాట్లాడే సమర్థతా వున్నాయి.

జీవితాన్ని గురించీ, సాంఘిక పరిణామాల్ని గురించీ, దేశకాల పరిస్థితులను గురించీ నీతి నిజాయితీలను గురించీ-నాకు ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. వాటిని ఆదర్శంగా ఎంచుకొని, జీవితంలో శాంతినీ, సుఖాన్నీ, సంతృప్తినీ, పొందడం నా లక్ష్యం"

"ముందు భోజనం చేయవే! ఉపన్యాసాలు తీరిగ్గా చేయవచ్చు" అన్నది అమరేశ్వరి, కొంచెం విసుగుదలను కనబరుస్తూ.

అత్యాత్మీయులిద్దరూ నిశ్శబ్దంగా భోజనం ముగించారు.

మోహన్‌కుమార్ కారు వేసుకుని లెఫ్ట్‌బ్యాంక్ హాల్‌కు వర్క్స్‌పోదకు వెళ్ళాడు.

అమరేశ్వరి చెల్లెల్ని కొంచెంసేపు మేను వాల్చి విశ్రాంతి తీసికోమని చెప్పింది

ఉమాశశి క్యాంపుకాట్ మీద పడుకొని శరత్ బాబు నవల 'చరిత్రహీనులు' చదువ నారంభించింది.

మధ్యాహ్నపు ఎండ తన తీక్షణత్వాన్ని తగ్గించుకొని సాయంత్రపు చల్లదనం కోసం దరఖాస్తు పెట్టుకుంది.

* * *

పుస్తకం చదువుతూనే ఉమాశశి అప్రయత్నంగా నిద్రపోయింది. ఆమెకు మెలకువ వచ్చేప్పటికి సాయంత్రపు నీడలు పొడుగా జరిగిపోయాయి.

అమరేశ్వరి రవ్వకేసరి, జీడిపప్పు, పకోడీ తయారు చేసి

చెల్లెలు నిద్రనుంచి లేవడంకోసం నిరీక్షిస్తూన్నది. నిద్రలేవగానే కాఫీ కలిపింది.

బాత్ రూంలో సబ్బుతో ముఖంకడుక్కొచ్చి, వంటగది మెట్లమీద టర్కీటవల్ తో తుడ్చుకుంటూ– "అక్కా! గాఢంగా నిద్రపోయాను. లేపలేదేం?" అన్నది ఉమాశశి.

"బస్సులో ప్రయాణం చేశావు తొంభై మైళ్ళు. బడలిక తీరేవరకూ నిద్రపోవాల్సిందే! నిన్ను నిద్రలేపాల్సిన అగత్యమేముంది? ఈ సాయంత్రం అంత హడావుడిగా చూడాల్సిన విశేషాలేమున్నాయి? ప్రాజెక్టూ, ఎత్తిపోతల జలపాతమూ, నాగార్జునకొండ మ్యూజియమూ–రేపు తీరిగ్గా చూడొచ్చు. పదిరోజులపాటు వుంటావుగా. ముందు ఈ టిఫిన్ తీసికొని కాఫీ త్రాగు. అలా షికారుగా పైలాన్ కు వెళ్ళి వద్దాం" అన్నది అమరేశ్వరి టిఫిన్ ప్లేటును అందిస్తూ.

"నేనేమైనా కొత్తచుట్టాన్నా అక్కా! నాకోసం ప్రత్యేకంగా టిఫిన్ తయారుచేశావు" అన్నది ఉమాశశి బుంగమూతి పెట్టి.

అమరేశ్వరి మనస్సులో మృదువుగా నవ్వుకుంది.

ఆ సాయంత్రం ఇద్దరూ పైలాన్ కూ, పార్కుకూ, పవర్ హౌసు దగ్గరకూ, క్లబ్బుకూ వెళ్ళారు. దూరంగా కృష్ణానదిలో కొండలమధ్య అస్తమిస్తోన్న సూర్యబింబాన్ని కొంచెంసేపు నిలబడి చూసింది. ఉమాశశి ముగ్ధురాలైంది. ఆమెకు ప్రకృతి దృశ్యాల్ని చూడడమంటే మహా ఇష్టం. రెండు కొండలమధ్య నిశ్చలంగా ప్రవహించేనది వాన వెలిశాక పడే

కొల్లని కొండా, నీటి నీలం వెనుక ఉదయించే చంద్రుడూ, సముద్రపు అలలపై మెరిసే వెన్నెలా, రంగుల్ని మార్చుకొనే ఆకాశమూ, ఎండమావుల సొగసూ, పువ్వుల అందమూ, శిల్పాల సౌందర్యమూ-మొదలైనవి ఆమె మనస్సులో ఫొటో ముద్రల్లా నిలిచిపోతాయి. అట్లాంటి దృశ్యాలకోసం ఆమె తహతహలాడుతూ వుంటుంది గుంటూరులో ప్రభుత్వ స్త్రీల కళాశాలలో బి. ఏ. చదువుతూన్నా-ఉమాశశి మనస్సెప్పుడూ సుందరమైన ప్రదేశాల్ని తిలకించాలనీ, విహార యాత్రలు చేయాలనీ వుంటుంది. కాలేజీలో నెలకూ, రెండు నెలలకూ ఏర్పాటు చేయబడే ప్రతి పిక్నిక్కుకూ, ఎక్స్కర్షనుకూ తప్పకుండా వెళుతుంది ఒకేరకమైన పరిసరాలకు బ్రతుకును బంధించేకంటే-రకరకాలైన ప్రదేశాల్ని చూస్తూ విభిన్న పరిసరాలతో పరిచయాలను పెంచుకుంటే మనస్సూ, విజ్ఞానమూ విశాల మవుతాయనేదే ఆమె ఉద్దేశ్యం

మునిమాపు చిక్కబడగానే-విద్యుద్దీపాలు వెలిగాయి. నాగార్జునసాగర్ ప్రాజెక్టుసైడూ, ఉత్తర దక్షిణ విజయపురీ మనోహరంగా ఉన్నాయి. ఆకాశాన మెరిసే తారలు క్రిందికి దిగివచ్చాయా అన్నభావం దూరాన్నుంచిచూస్తే కలుగుతుంది దిగివచ్చినే తారల్లా వెలిగే విద్యుద్దీపాలతో ఉన్న ప్రాజెక్టునూ, చుట్టుప్రక్కల ప్రదేశాన్ని ఉమాశశి ఎత్తైన చోటునుంచి నిలబడి మనసారా చూసింది.

"చీకటి బడింది, ఇంటికి వెళదామా! బావగారు వొచ్చేవేళయింది" అన్నది అమరేశ్వరి.

"అక్కా! విద్యుద్దీపాలతో ప్రాజెక్టు సైటు ఎంత మనోజ్ఞంగా వుందో చూడు. ఎంత సేపైనా నిలబడి చూడ మనసు వేస్తూ వున్నది" అంటూ అక్కయ్యతో ఇంటికి బయలు దేరింది.

చెల్లెలికి కొత్త కొత్త స్థలాలు చూడాలనే అభిలాష జాస్తి అని అమరేశ్వరికి తెలుసు. ఆయనగారికి నాగార్జున సాగర్ ప్రాజెక్టుకు బదిలీ అయినప్పటినుంచీ రెండు మూడు లేఖలు చెల్లెలికి వ్రాసింది-తప్పకుండా రమ్మనమని. ఉమా శశి సెలవులకోసం ఎదురు చూసి చూసి-సెలవులివ్వగానే వొచ్చింది. చెల్లెలికి ఇక్కడ బాగా కాలక్షేపం కావాలనీ, ఇక్కడున్నంతకాలమూ ఆమె ఎట్లాంటి విసుగుదలకు గురి కాకుండా వుండాలనీ, ఆమె మనస్సు కులాసాగా వుండాలనీ అమరేశ్వరి అనుకొన్నది. చెల్లెలి మనస్తత్వం ఆమెకు బాగా తెలుసు. పాలపొంగులాంటి పిల్ల ఉమాశశి. ఆవేశం ఎక్కువ. దానికితోడు పట్టుదల జాస్తి తను విశ్వసించిన సత్యాలకూ, విలువలకూ, ఆశయాలకూ జీవితంలో గౌరవాన్ని యిచ్చి, సార్థకతనూ, సంతృప్తినీ పొందాలనే తహతహ మెండు. ఆచరణలో సాహసాన్ని ప్రదర్శించే వ్యక్తి. గుండెధైర్యమూ పరిస్థితుల్ని ఎదుర్కొనే ధీమా, భవిష్యత్తులోని మంచిని గురించి ఆశా, తన జీవితంలోని సుఖదుఃఖాలకు తనే కారణ మన్న అభిప్రాయమూ-ఆమె మనస్తత్వానికి పునాది రాళ్ళు.

రాత్రి తొమ్మిది గంటలైనా అసిస్టెంటు ఇంజనీరు

మోహన్‌కుమార్ ఇంటికి రాలేదు. అతని రాకకోసం అక్క చెల్లెళ్ళిద్దరూ భోజనం చేయకుండా ఎదురుచూడసాగారు.

"ఉద్యోగ నిర్వహణలో బావగారు వేళల్ని పాటించరా అక్కా!" అన్నది ఉమాశశి.

ఆ ప్రశ్నలో ఇమిడివున్న అర్థానికి అమరేశ్వరి తొట్రుపాటు చెందింది.

"రోజూ సాయంత్రం ఆరు గంటలకే ఇంటికి వొచ్చే వారు. స్నేహితులతో కలిసి క్లబ్బుకు వెళ్ళారేమో! టెన్నిస్ ఆడుతూంటే వారికి కాలం తెలీదు" అన్నది అమరేశ్వరి.

"క్లబ్బులకు అలవాటైన మగవాళ్ళకు ఇంటి దగ్గర కుటుంబానికి కరుచుకొని నిరీక్షించే భార్యలు గుర్తుకు రారు. అక్కా! భర్తలు క్లబ్బుల్లో టెన్నిస్ ఆడుతున్నారో, క్యారమ్స్ ఆడుతున్నారో, చీట్లపేక ఆడుతున్నారో - ఏ భార్యకు మటుకు ఎట్లా తెలుసు? రాత్రి పదిదాటాక ఇంటికొచ్చి, చికాకుతో, చిందర వందరగావున్న ముఖాన్ని చిటుక్కునమార్చి, చిరునవ్వు నటింపుతో 'ఇప్పటికిగాని పట్టింది చెస్‌లో ఓ గేమ్ గెల్వటానికి' అని భర్త అనగానే-భార్య 'నిజమే కామోసు' అని నమ్ముతుంది వక్కగింజలో బియ్యపు గింజంత సులభంగా. కాని ఆ భర్త అంతరాత్రివరకూ క్లబ్బులో పేకాట ఆడి కొన్ని వందలరూపాయలు పోగొట్టుకున్నాడనీ, భార్య ముందు ప్రదర్శించిన చిరునవ్వులో నటనేగానీ సహజత్వం లేదనీ, ధర్మపత్ని అమాయకత్వాన్ని ఆసరాగా తీసికొని అన్యాయమూ చేసి మోసగించ వెరవటంలేదనీ - భార్య గ్రహించగలదా!

అన్యోన్యంగానూ, ఆదర్శంగానూ కనబడే దాంపత్యాల్లో నే-భర్తలు అట్లాంటి దుర్వ్యసనాలకులోనై, భార్యల్ని వంచిస్తు న్నారు; తమ అక్రమ వర్తనను 'రహస్య' ముసుగులో బంధించి, అజ్ఞాతంగా అనురాగాల్ని దూరం చేసుకుంటు న్నారు" అన్నది ఉమాశశి.

ఆ మాటలు అమరేశ్వరి హృదయంలో తుపాకీ తూట్లల్లా గుచ్చుకున్నాయి.

తన మాటలవల్ల అక్కయ్య ముఖంలో కలిగిన మార్పుకు ఉమాశశి ఆశ్చర్యపోయింది.

తన భర్తను దృష్టిలో పెట్టుకొని చెల్లెలు అట్లా మాట్లాడుతున్నదా ? అన్న అనుమానం - అమరేశ్వరిలో జనించటమే ఆమె ముఖంలో మార్పుకు హేతువు తను. సాధారణంగా జరుగుతూన్న వ్యవహారంపై మాట్లాడితే అక్కయ్య మనస్సు అంతగా ఎందుకు కల్లోల పడింది? అను కుంది ఉమాశశి.

"మామూలుగా చాల టవున్సులో అట్లా జరుగు తూన్నది అక్కా. గుంటూరులో నాకో సేహితురాలున్నది. వాళ్ళనాన్న చాల మంచివాడు ఒకప్పుడు మంచి ప్రాక్టీసు గల లాయరు. కాని క్లబ్బులో పేకాటకు అలవాటుపడి, రేబవళ్ళూ ఆ దుర్వ్యసనానికి బానిసయ్యె, కోర్టుకు వెళ్ళకా. క్లయింట్సుతో సరిగ్గా వ్యవహరించకా - ప్రాక్టీసునంతా పాడుచేసుకొని, ఇప్పుడు ఆర్థికంగా బాగా చితికిపోయి, తను పతనమైందికాక కుటుంబాన్నికూడా నానా కష్టాలపాలు చేస్తు

న్నాడు. కుటుంబాలు ఆర్థికంగా, సాంఘికంగా దెబ్బతినటానికి ఎక్కువభాగం, యజమాని ప్రవర్తనపైనే ఆధారపడి ఉంటుంది."

"మీ బావగారు క్లబ్బులకు కేవలం కాలక్షేపంకోసమే సాయంత్రాలు వెళుతుంటారు. రోజూ ఈపాటికి వచ్చేవారే ఎందుకో ఇవాళ ఆలస్యమైంది. పోనీ నువ్వు భోంచేసి పడుకో రాదూ! ఆయనగారికోసం ఇద్దరం వెయిట్ చేయడం దేనికి?" అన్నది అమరేశ్వరి.

"నాకూ ఆకలిగా లేదిలే అక్కా. ఇంకో గంటసేపు ఎదురు చూద్దాం" అన్నది ఉమాశశి శరత్ బాబు నవలను టేబుల్ మీదనుంచి తీసికుంటూ చదివేందుకు

"ఈమధ్య నవలలు జోరుగా చదువుతున్నట్టున్నావు"

"అవునక్కా! నవలల పిచ్చిపట్టింది. క్లాసు పుస్తకాల మీదకంటె నవలమీదే మోజు ఎక్కువవుతూన్నది. ఈ పిచ్చిలో ఓ సుగుణంవుంది. డిటెక్టివ్ నవలలూ, చవుకబారు నవలలూ చదవాలనివుండదు. అవంటేతలనొప్పి. శరత్ బాబు నవలలంటే ప్రాణం. ఆ నవలలు చదవటమూ, శరత్ బాబు సృష్టించిన పాత్రలను గురించీ, పరిస్థితులను గురించీ గంటల తరబడి ఆలోచించటమూ. నిజంగా ఆ పాత్రలు సజీవంగా కళ్ళముందు తిరుగుతూవుంటాయి; సంఘటనలు రసపుష్టితో హృదయానికి గాఢంగా హత్తుకొని చక్కని అనుభూతిని కలిగిస్తాయి స్త్రీని, స్త్రీ బ్రతుకులోని లోతుల్నీ, విలువల్నీ, సహనశక్తిని, తనకు తానే సమాజానికి భయపడి కష్టాల్ని

అభివృద్ధిపరుచుకోనే. తత్త్వాన్ని, మనోధైర్యంతో ఎంతటి గడ్డు పరిస్థితులనైనా ఎదుర్కోవటమూ, ఆత్మబలం తక్కువైనవాళ్ళు జీవితాలనుంచి పారిపోవటమూ, ప్రేమలూ త్యాగాలూ, అనురాగాలూ, సంఘంలో జరిగే అన్యాయాలూ అక్రమాలూ, స్త్రీ ఏవిధంగా వాటికి బలి అవుతున్నదీ-బాగా అర్థంచేసికొని, సానుభూతితో పరిష్కార మార్గాలు చూపి, పాఠకులను తనలో విలీనం చేసుకొన్న గొప్ప నవలా కర్త శరత్ బాబు. ఆయన నవలలు చదువుతూంటే ఒక్కొక్కప్పుడు నువ్వు గుర్తుకు వస్తూంటావు అక్కా."

"అంటే నేను ఆ కాలానికి చెందినదాన్నా?"

"అదికాదు శరత్ బాబు స్త్రీలో దర్శించిన కొన్ని ఉత్తమగుణాలు నీలో ఉన్నాయి"

"నన్ను నువ్వేమీ పొగడక్కర్లేదులేవే! ప్రొద్దు పోతోంది. ముందు నువ్వు భోజనంచేయి. బావగారు ఎప్పుడొస్తారో, ఏమో! లేక ఏ స్నేహితుల ఇళ్ళల్లోనో భోంచేసి వస్తారో. రా, భోంచేద్దువుగాని" అంటూ అమరేశ్వరి వంట గదిలోకి దారితీసింది

ఉమాశశి అక్కయ్యను అనుసరించింది

ఉమాశశి భోంచేసి, శరత్ బాబు నవల చదువుతూ ఏ పదకొండు గంటలకో నిద్రపోయింది. అప్పటివరకూ మోహన్ కుమార్ ఇంటికి రాలేదు. అమరేశ్వరి మేల్కొనే వుంది.

బావగారు ఏ అర్ధరాత్రి, ఎట్లాంటి స్థితిలో ఇంటి

కొచ్చాడో, అప్పటివరకూ అక్కయ్య భోంచేయకుండా కళ్ళల్లో వొత్తులేసికొని కూర్చుందో - ఉమాశశికి తెలీదు. తెల్లవారగానే, నిద్రమంచంమీద వుండే - "అక్కా! బావగారు రాత్రి ఇంటికి వచ్చారా?" అని అడిగింది

"ఆఁ! నువ్వట్లా నిద్రబోగానే వచ్చారు. ఎక్కడో డిన్నర్ జరిగిందట. అందుచాత ఆలస్యమైందంట" జవాబు చెప్పింది అమరేశ్వరి.

ఉదయం తొమ్మిది గంటలైనా మోహన్‌కుమార్ నిద్రమంచం మీదనుంచి లేవలేదు. అంత మొద్దు నిద్ర ఏమిటో - అనికుంది ఉమాశశి.

"ఇవాళ బావగారికి సెలవురోజు. మనం కారును ఉపయోగించుకోవచ్చు. చూడవల్సిన స్థలాల నన్నింటినీ చూడ వచ్చు" అన్నది అమరేశ్వరి తొమ్మిదిన్నర గంటలకు వంట గదిలో.

"అయితే బావగారు మనవెంట రారా!"

"ఆయనగారికి ఆఫీసు వర్కు ఉన్నదట; ఏవో ఎస్టిమేట్సు చూడాలిట. తీరదట! డ్రైవరు వున్నాడుగా. మన కేమీ ఇబ్బంది వుండదు."

ఉమాశశి చల్లగా నిట్టూర్చింది.

మోహన్‌కుమార్ పదకొండు గంటలకు నిద్ర లేచి, స్నానంచేసి, భోజనంచేసి మళ్ళీ నిద్రకొరిగాడు. బావగారి వాలకం ఉమాశశికి నచ్చలేదు.

మధ్యాహ్నం మూడు గంటలకు కాఫీ త్రాగాక అక్క

చెల్లెళ్ళిద్దరూ కారులో ప్రాజెక్టు సైడు చూడటానికి బయలు దేరారు. మోహన్‌కుమార్ ఇంట్లోనే ఉన్నాడు

నదులు ప్రవహించే గడ్డ ఆంధ్రప్రదేశ్. కాని ప్రవహించే నీటినంతా మనం ఉపయోగించుకోలేక పోతున్నాం. అందుకు అనేక కారణాలున్నా, నదీలోయ ప్రాజెక్టులకు, నీటి పారుదల పథకాలకు ప్రభుత్వం పంచవర్ష ప్రణాళికల్లో తగిన ప్రాధాన్యత నిచ్చి వ్యవసాయోత్పత్తుల అభివృద్ధికి కృషి చేస్తూన్నది. కోట్లకొలది ధనాన్ని ఖర్చుచేస్తున్నది. తద్వారా సత్వర దేశాభ్యుదయానికి పాటుపడుతూన్నది. మొదటి పంచవర్ష ప్రణాళిక చివరి భాగంలో ప్రభుత్వం చేపట్టిన ప్రాజెక్టుల్లో నాగార్జునసాగర్ మల్టీపర్పస్ ప్రాజెక్టు ప్రధానమైనదీ పెద్దదీ కూడాను. జాతీయ ప్రాజెక్టుగా పరిగణించ దగ్గది. ఈ ప్రాజెక్టు ద్వారా దిగువ కృష్ణానది నీటిని 4·4 T. M. cft. వరకూ ఆంధ్రప్రదేశ్ భూముల సాగుబడికి వినియోగించవచ్చు. ప్రాజెక్టు నిర్మాణానికి నందికొండవద్ద సహజమైన పరిస్థితులు చాల అనుకూలంగా ఉన్నాయి. కృష్ణానదిమీద రవాణా సౌకర్యాలకు ఓ బ్రిడ్జి నిర్మించబడింది. ప్రధానమైన ఆనకట్ట ఎత్తు లోతైన నదీ గర్భం మట్టానికి 404 అడుగులు. ఆనకట్ట వద్ద 110 చదరపు మైళ్ళ మేరకు నీరు నిల్వయుండే అవకాశం వుంది. ఆ విషయంలో ఈ ప్రాజెక్టు యొక్క రిజర్వాయరు భారతదేశంలో కెల్ల పెద్దది. ఆనకట్ట నిర్మాణం దశలవారీగా జరుగుతున్నది. రెండు బ్యాంక్ కెనాల్సు ఉన్నాయి. రైట్ బ్యాంక్ కెనాల్ 276 మైళ్ళ పొడవుగలిగి గుంటూరు,

నెల్లూరు జిల్లాలలో 20 లక్షల ఎకరాలకు నీటి సౌకర్యాలను కల్పిస్తుంది. లెఫ్ట్‌బ్యాంక్ కెనాల్ 140 మైళ్ళు పొడవుగలిగి నల్లగొండ, కృష్ణాజిల్లాలో 10 లక్షల ఎకరాలకు నీటి వసతులను కల్పిస్తుంది. ఆనకట్ట నిర్మాణమూ, కాలువల త్రవ్వకమూ వడిగా జరుగుతూన్నవి. సమర్థులైన ఇంజనీర్ల పర్యవేక్షణక్రింద ఎన్నో వేలమంది కూలీలు రేబవళ్ళు పనిచేస్తున్నారు. 50 వేలమంది జనాభాగల అందమైన నగరం 'విజయపురి' ఏర్పడింది. ఎలిమెంటరీస్కూళ్ళూ, హైస్కూలూ, హాస్పటల్, రెస్టు హౌసులూ, సర్క్యూట్ హౌసూ మొదలైనవి ఆ నగరంలో ప్రజల సౌకర్యాలకోసం, ప్రయాణికుల నిమిత్తమూ ఉన్నాయి. నిజంగా నాగార్జున సాగర్ ప్రాజెక్టు చరిత్ర ప్రసిద్ధులైన మహాపురుషుడు మన పండిత జవహర్ లాల్ వెలిగించిన దీపమే.

— ఆ ప్రాజెక్టునూ, త్రవ్వకాలనూ, టనెల్సునూ, కెనాల్సునూ, పనిచేసే కూలీలనూ, పర్యవేక్షించే ఇంజనీర్లనూ చూశారు ఉమాశశీ, అమరేశ్వరీనూ. నవభారత నిర్మాణానికి జరుగుతూన్న తీవ్ర కృషిని చూసి వాళ్ళిద్దరూ సంతృప్తిని పొందారు.

తర్వాత వాళ్ళిద్దరూ కారులో నాగార్జున కొండకు వెళ్ళారు.

నాగార్జునకొండ చారిత్రక ప్రాధాన్యము గల స్థలము. 1930 ప్రాంతంలో ఒక ఆంగ్లేయుడు అక్కడ త్రవ్వకాలను మొదలెట్టి మహాస్తూపను, విశ్వవిద్యాలయం అని చెప్పదగు

నున్న మహావిహారము, కొన్ని బౌద్ధారామముల శిథిలాలను బయలుపర్చాడట తర్వాత ప్రభుత్వ పురాతత్వపరిశోధకులు త్రవ్వకాలను సాగించి ఇక్ష్వాకులనాటి కట్టడాల శిథిలావశేషాలతోబాటు శాసనా రూపంలో ఉన్న చారిత్రకాంశాల్ని బయల్పర్చారు. నాగార్జునకొండ చారిత్రక యుగము క్రీస్తు శకం 3వ శతాబ్దంలో ఇక్ష్వాకురాజుల పరిపాలనతో ప్రారంభమైనదని చెప్పవచ్చు. కాని అక్కడ దొరికిన పాతరాతి యుగపు పనిముట్లనుబట్టి, షుమారు కొన్ని వేల సంవత్సరాల క్రిందట నాగార్జునకొండ మానవుల నివాస స్థానంగా వుండేదని గ్రహించవచ్చు. మధ్యరాతి యుగము, కొత్తరాతి యుగములనాటి పరికరాలు కూడా త్రవ్వకాలవల్ల లభ్యమైనాయి. విజయపురి అను పేరుతో నాగార్జునకొండయే ఇక్ష్వాకుల రాజధానిగా విశ్వసింపబడుతూ వున్నది. మధ్య యుగంలో కొండవీటిరెడ్లు ఈ ప్రాంతాలలో సైనికదుర్గం నిర్మించిన చిహ్నాలు ఇప్పటికీ కనబడుతున్నాయి. రెడ్డిరాజుల కాలంలోనే "నాగార్జునకొండ" అను పేరు వాడుకలోకి వొచ్చిందని ప్రతీతి. 16 వ శతాబ్దాన శ్రీకృష్ణదేవరాయలు నాగార్జునకొండను వశపర్చుకొన్న చారిత్రక ఆధారాలున్నాయి.

నాగార్జునకొండ మ్యూజియమ్‌ను ప్రభుత్వం ఏర్పాటు చేసి, త్రవ్వకాలవల్ల అక్కడ లభ్యమైన శిల్పాలను, శాసనాలను, పనిముట్లను భద్రపరిచింది. పురాతత్వశాఖవారిచే క్రింది లోయలో బయల్పడిన ప్రాచీనావశేషాలలో ప్రధానమైన మహాస్తూపము, స్నానఘట్టము, సింహళ విహారము, అశ్వ

మేధ యజ్ఞవాటిక మొదలైనవి నాగార్జునకొండపై పునర్నిర్మింపబడ్డాయి.

అమరేశ్వరీ, ఉమాశశీ నాగార్జునకొండ మ్యూజియమ్‌నూ, ప్రాచీనావశేషాలను చూసి ముగ్ధులయ్యారు. అక్కడే ప్రొద్దుగుంకింది. ఇంటికి వచ్చేటప్పటికి చీకటిపడింది.

మోహన్‌కుమార్ ఇంట్లో లేడు. "అయ్యగారు సాయంత్రం నాలుగు గంటలకే బయటికెళ్ళారు" అని పనిమనిషి చెప్పింది

రాత్రి తొమ్మిదిగంటలైనా మోహన్‌కుమార్ ఇంటికి రాలేదు.

"అక్కా! బావగారికోసం రోజూ ఇట్లా ప్రొద్దుపోయేదాకా ఎదురుచూస్తూనే వుంటావా? వేళకు ఇంటికిరాకుండా బయట ఆయనగారు చేసే కాలక్షేప మేమిటో" అన్నది. ఉమాశశి బావగారి ప్రవర్తనపై కొంచెం జుగుప్సను వ్యక్తం చేస్తూ.

అమరేశ్వరి గతుక్కుమన్నది. చెల్లెలికేసి ముఖం సూటిగాపెట్టి చూడలేకపోయింది.

"సాయంత్రాలు క్లబ్బుకు వెళ్ళనిదే వారికితోచదు." చేదు మాత్రను బలవంతాన మింగుతూన్నట్టుగా అన్నది అమరేశ్వరి.

అసంతృప్తిగా పెదాలు చప్పరించింది ఉమాశశి.

హృదయంలో అగ్నిపర్వతాలు భగభగమంటూన్నా, మనస్సు నిర్వేదంతో 'లావా'వు మల్లే కుతకుతలాడుతున్నా-

నిర్మలకాసారం పగిదినిండైన వర్చస్సుతో నిశ్చలంగా ఉండ గలను కొంతమంది. మనోనిబ్బరం కానివ్వండి; జీవితంలో ఎదురయ్యే ఎల్లాంటి కష్టాలనైనా ఎదుర్కోగలమనే ధీమాను కలిగి వుండడంవల్ల కానివ్వండి; రాబోయే మంచికాలంపై విశ్వాసాన్ని కుదుర్చుకోవడంవల్ల కానీయండి - ఆ రకానికి చెందిన వ్యక్తులు అంత నిర్మలంగా కనబడతారు. అమరేశ్వరి ఆ కోవకు చెందినమనిషి. హృదయంలో రగిలే అగ్ని పర్వతా లను, మనస్సులో పురివిప్పిన దారంవలె మెలిదిరిగే దుఃఖాన్ని తన జీవిత పథంలో చీకటినీడలు తారట్లాడుతున్నాయన్న ఆవేదననూ - ఆమె ముఖ కవళికల ద్వారా ఎప్పుడూ ప్రదర్శించదు. 'పెళ్ళికిముందు తమకు పరిచయం లేకపోయినా, వైవాహికబంధానికి కట్టుబడి, ప్రేమానురాగాల్ని అభివృద్ధి చేసుకుంటూ దాంపత్య జీవితాన్ని సాక్షిగా అనుభ విస్తున్నాము' అన్న భావం ఆమె ముఖంలో ద్యోతకమవుతూ వుంటుంది. మనిషిచే తయారుచేయబడి మనిషి అదుపు ఆజ్ఞల్లో వుండే యంత్రంకాదు జీవితం. మన ఆదర్శాల ప్రకారం కోర్కెల ననుసరించి, నిర్దేశించిన మార్గాలవేజీవితం ముందుకు సాగిపోదు. అట్లా సాగిపోయే పక్షంలో ఏ వ్యక్తీ జీవితంలో దుఃఖాన్ని, బాధలనూ. సమస్యలనూ వాంఛించడు. ప్రతివ్యక్తీ తన బ్రతుకు తామరాకుపై నీటిబిందువు జారినట్టు సుఖంగా, కులాసాగా, హాయిగా జరిగిపోవాలనీ, ఆనందాను భూతుల నిలయం కావాలనీ, శాంతీ సంతృప్తులతో పరి పూర్ణం కావాలనీ కోరుకుంటాము. శాస్త్రవిజ్ఞానం ద్వారా

ప్రకృతిని సైతం జయిస్తున్న మానవుడు జీవితాన్ని సుఖప్రదంగా నడుపుకొనటంలో కృతకృత్యుడు కాలేకపోతున్నాడు. తన బ్రతుకు దగ్గరకు వొచ్చేసరికి, విధి విధానానికి అజ్ఞాతశక్తుల బలీయతకూ, కొన్ని బలహీనతలకూ లోబడుతున్నాడు. తద్వారా భయం, నిస్పృహ, అసంతృప్తిని పొందుతున్నాడు. యంత్రాన్ని హస్తగతం చేసుకున్నట్లు జీవితాన్ని హస్తగతం చేసికోవాలని మానవుడు ప్రయత్నిస్తున్నాడుగానీ – సత్ఫలితాన్ని సాధించుటలేదు. మృగతృష్ణలో సంచరిస్తూన్నట్లు సతమత మవుతున్నాడు. అజ్ఞాతశక్తుల ప్రేరేపణతో కూడుకున్న పరిస్థితులు జీవితాన్ని ఆక్రమించుకున్నప్పుడు – ఆ పద్మవ్యూహంనుంచి బయటపడటం గొప్పసాహసంతో కూడినపని. అందరి విషయంలో సాధ్యంకాదు. గాలివాటుకు రెల్లుగడ్డి వొంగినట్లు పరిస్థితుల ఉధృతానికి తలలు వొంచటం సమాజలో ఎక్కువమంది అనుసరిస్తూన్న విధానం మోహన్‌కుమార్‌తో అమరేశ్వరి వివాహం ఆ పరిస్థితులలోనే జరిగింది. పెళ్ళికిముందు వాళ్ళిద్దరూ ప్రేమించుకోలేదు. ఒకళ్ళ మనః ప్రవృత్తుల్ని ఒకళ్ళు ఎరుకపర్చుకోలేదు. జీవితాన్ని ఒక బాటకుచేర్చి సుఖశాంతులతో ప్రయాణం చేసేందుకు ఏర్పర్చుకున్న ఆశయాలను, అభిలాషలను, దృక్పథాలను – ఒకళ్ళకొకళ్ళు వివరించుకోలేదు. పెళ్ళికి ముందు ఒకరికొకరు తెలియనే తెలియదు. తల్లిదండ్రుల ప్రోద్బలాల వల్లనూ పట్టుదలల వల్లనూ, తమధర్మాన్ని నెరవేర్చుకుందామనే తొందరపాటు

వల్లనూ జరిగే బాల వివాహాల మాదిరిగానే అమరేశ్వరీ మోహన్ కుమారుల వివాహం జరిగింది. ఆ పెళ్ళి ఆమెకు ఇష్టంలేదు. కాని ఆమె ఇష్టాయిష్టాలను ఆమె పెళ్ళివిషయంలో తల్లిదండ్రులు గమనించలేదు; ప్రాముఖ్యత నివ్వలేదు. తమ అధికారాన్నీ, అజమాయిషీని, పట్టుదలనూ ఉపయోగించి అమరేశ్వరికి పెళ్ళిచేశారు ఆమె అదృష్టంకొద్దీ మంచి భర్త దొరికాడని పెళ్ళి పందిట్లోని పెద్దలూ, అమ్మలక్కలూ అనుకున్నారు. మోహన్‌కుమార్ బి. ఇ. ఫస్టుక్లాసులో ప్యాసైనాడు. సాంప్రదాయ సిద్ధమైన కుటుంబంలోనివాడు ఆస్తి కూడా బాగానే వుంది. అందచందాల్లో వొంకపెట్టాల్సిన అగత్యంలేదు. సరిపడ్డ ఒడ్డూపొడుగుతో' చామన చాయ దేహావర్ణంతో, ముచ్చటగొల్పే ముఖవర్చస్సుతో మనోహరంగా ఉన్నాడు. ఇరువురికీ 'మంచి జోడు' అనుకున్నారు అప్పటికి అమరేశ్వరి మెడిసిన్ మూడో సంవత్సరం చదువుతూన్నది. పెళ్ళికిముందు "ఏం ఫర్వాలేదు, పెళ్ళి జరిగిం తర్వాతకూడా చదువుకోవచ్చు" అన్నారు పెళ్ళికొడుకు తల్లిదండ్రులు. కాని పెళ్ళి జరిగాక వాళ్ళే "పెళ్ళి అయిన పిల్లకు ఇంకా చదువేమిటి ? అబ్బాయికి ఉద్యోగంకూడా వచ్చింది. చదువు మానిపించి,అమ్మాయిని కాపురానికి పంపిచాల్సిందే" అన్నారు. మోహన్‌కుమార్ కూడా భార్య చదువు సాగించడం విషయంలో నిర్మొహమాటంగా తన అభిప్రాయాన్ని వ్యక్తపర్చాడు. "నేను ఉద్యోగం చెయ్యడమూనూ, ఆమె కాలేజీలో చదువు వెలిగించడమూనా? అట్లా వీలుపడదు

పెద్ద చదువులు చదివి ఉద్యోగాలు జేసే ఆడవాళ్ళంటె నాకు తలనొప్పి".

అనాగరికంగావున్న భర్త అభిప్రాయానికి అమరేశ్వరి మనస్సులో కుళ్ళి కుళ్ళి యేడ్చింది. పెళ్ళి కావడంతోనే- తన బ్రతుకుపై విషాదమేఘాలు గుమికూడాయని భావించింది. స్వేచ్ఛగా విహారించే పక్షిని బలవంతాన పంజరంలోకి నెట్టి - 'ఇక నీ బ్రతుకింతేను' అన్నట్టుగా తోచింది. చదువు మానుకొని, అమరేశ్వరి భర్తతో- కాపురానికి వొచ్చింది. మెడిసిన్ చదవే రోజుల్లో ఆమెకు ఎన్నో ఆశయాలు, జీవితాన్ని గురించి ఆశలు, తను సాధించదల్చుకున్న పనుల్ని గురించి ఊహలు వుండేవి. పెళ్ళికావడంతో అవి నిష్క్రమించాయి. వాటిస్థానే అమరేశ్వరి సహనాన్ని, స్తబ్ధతనూ, చేదులో తీపిని గ్రహించే నైజాన్ని, 'జరిగేది ఎట్లాగూజరక్క మానదు' అన్న తత్వాన్ని అలవర్చుకుంది చిన్నతనంనుంచీ ఆమెలో ఒకరకమైన మూగ ప్రవృత్తి అభివృద్ధి చెందుతూ - వివాహమైనాక కరుడుగట్టినంత గట్టిపడింది తనని యెదుర్కొనే సమస్యలు, మనస్సును బాధించే కష్టాలు, హృదయాన్ని కత్తులతో గెలికే పరిస్థితులు- ఇతర్లముందు బహిరంగపర్చడంవల్ల, పరిష్కారంకోసం అర్థించడంవల్ల ప్రయోజనాలు కలుగవు. కాలంతోటే అవి మారాలి. అంతవరకూ తనలోనే వాటిని ఇముడ్చుకొని, తనకు తనే వ్యథలు చెందుతూ - ఓర్పుతో, ధైర్యంతో, నిబ్బరంతో పరిష్కారాల్ని వెతుక్కోవాలి. కాలంకల్సిరాక, పరిష్కారమార్గాలు

దొరక్కపోతే-ఈజన్మదుఃఖానికి హేతువని భావించాలి. అట్లాంటి మనస్తత్వాన్ని అమరేశ్వరి కాపురానికొచ్చాక పెంచుకోవడానికి చాల కారణాలున్నాయి. ముఖ్యంగా భర్త ప్రవర్తన, జీవితాన్ని గురించి ఆయనకున్న ఉద్దేశ్యాలు, సుఖశాంతుల్ని గురించి ఆయనకున్న అభిప్రాయాలు, నీతి నిజాయితీలపట్ల నిర్లక్ష్యం, ఉద్యోగ నిర్వహణలో ఆయన అనుసరిస్తూన్న అపసవ్యాలు - ఆమెకు నచ్చలేదు. జీవితాన్ని గురించీ, సుఖశాంతుల్ని గురించీ, నీతినిజాయితీలను గురించీ, ఉద్యోగ నిర్వహణను గురించీ - ఆమెకుగల ఉద్దేశ్యాలు భర్త ఉద్దేశ్యాలకు పూర్తి విరుద్ధం. గట్లులేని ప్రవాహంలాంటి భర్త ప్రవర్తనను తనలో ఇముడ్చుకొనేందుకు - ఆమె యెంతో ఓర్పునూ, నిగ్రహాన్నీ అవలంబిస్తోంది.

అక్కయ్య, బావగార్ల సంసారాన్ని గురించి అక్కడికొచ్చిన రెండురోజుల్లోనే ఉమాశశి కొన్ని అనుమానాలను ఏర్పర్చుకుంది. వాళ్ళ దాంపత్యం తను ఊహించినంత ఆదర్శంగా లేదనీ, జీవితంలో సుఖశాంతుల్ని పొందటాన్ని గురించి వాళ్ళ ఆశయాల్లో భేదాలున్నాయనీ, ఇరువురూ ఒకళ్ళ నొకళ్ళు సక్రమంగా అర్థంచేసికోలేక - తమ మధ్య అగాధంలాంటి దూరాన్ని సృష్టించుకొంటున్నారనీ భావించ సాగింది. ఆమె భావనకు బావగారి ప్రవర్తన దోహదమిచ్చింది.

ఆ రోజు రాత్రి ఏదో పుస్తకంకోసం ఉమాశశి బీరువా వెతుకుతూండగా, పుస్తకాల వెనుక ఓమూలన 'బీహైవ్ బ్రాండీ సీసా' ఇరవైనాలుగు ఔన్సులుగలది కనబడింది.

అది చూడగానే ఆశ్చర్యపోయింది బ్రాందీతో బావగారి కేంపని? ఆయనకు రోజూ తాగే అలవాటున్నదా? అంత రహస్యంగా యెందుకు దాచాలి? ఈ సీసా సంగతి అక్కయ్యకు తెలియదా? అక్కయ్యకు తెలియకుండానే బావగారికీ దురభ్యాసం ఉన్నదా? - ఉమాశశి మనస్సులో పలు రకాలైన ప్రశ్నలు ఉదయించాయి. మనస్సులో ఉదయించిన ఆ ప్రశ్నలకు సమాధానాలను 'బావగారు బ్రాందీ తాగితేనేం? కాపుసారా తాగితేనేం? తనకెందుకు? అనవసరమైన విషయాల్లో తను తలదూర్చడ మెందుకు? భర్త ధర్మపథహీనుడైతే - సన్మార్గానికి తెచ్చుకోవాల్సిన బాధ్యత భార్యదిగాని మధ్యలో తన ప్రమేయం దేనికి?' అనుకొని ఉమాశశి మిన్నకుండలేదు. అది ఆమెనైజపు తీరుకాదు. ఎవ్వారికి సంబంధించినదైనా చెడునీ, అక్రమాన్నీ, దుర్వ్యసనాలనూ సిరసించి, నిర్మొహమాటంగా ఖండించటమే ఆమె మనస్తత్వపు పదును. కలుగబోయే పరిణామాలపై ఆమెకు దృష్టిఉండదు.

అక్కయ్యను కేకవేసింది ఉమాశశి, చీకట్లో పాము కాళ్ళకు చుట్టవేసికున్నంత భయాన్ని ప్రకటిస్తూ.

బయట వరండాలో భర్తరాకకోసం ఎదురుచూస్తూ నిలబడ్డ అమరేశ్వరి చెల్లెలికేకకు ఆదుర్దాగా వొచ్చింది.

"అక్కా! ఈ బీరువాలో బ్రాందీబాటిల్ ఉన్నది. ఎక్కడిది? బావగారు దాచుకున్నారా!"

అమరేశ్వరి గుండెల్లో కత్తెర రాయి గుచ్చుకున్నట్లు

య్యింది. తన నేరం బయటపడ్డట్టు వళ్ళంతా అప్పటికప్పుడే స్వేదం కమ్ముకొచ్చింది. కొన్నిక్షణాలపాటు నిలువునా నిశ్చేష్టురాలై చెల్లెలికేసి గుడ్లప్పగించి చూసింది.

అక్కయ్య ముఖంలోని అస్వస్థతను ఉమాశశి గ్రహించింది.

అమరేశ్వరి అంతలోనే సహజమైన నిశ్చేష్టతనుంచి తేరుకొని, తెచ్చిపెట్టుకొన్న చిరునవ్వుతో—

"ఓహూ! అదా! బీరువాలో వుందా! మొన్న ఆయన ఆయనగారి స్నేహితుడొకాయన హైద్రాబాద్‌నుంచి వొస్తే తెప్పించినట్టున్నారు. ఆ స్నేహితునికి అలవాటున్నదట. అతనికోసం ఎక్కణ్నుంచో తెప్పించారు" అన్నది. కానీ, ఆమాటల వెనుక నిజాన్ని బలవంతాన నొక్కి పెడుతూన్న ధ్వని వినిపిస్తోంది.

అక్కయ్య మాటల్ని ఉమాశశి నమ్మలేదు. చెల్లెల్ని నమ్మించడానికి అమరేశ్వరి పడ్డ ప్రయాసంతా వృథాయైంది. తనని నమ్మించటానికి అక్కయ్య శ్రమపడుతూన్నదని ఉమాశశి స్పష్టంగా గ్రహించింది. తనేమైనా అతిగా మాట్లాడితే అక్కయ్య బాధపడుతుందనే ఉద్దేశ్యంతో - ముభావంగా నిట్టూర్చి వూరుకుంది.

ఆ రాత్రి మోహన్‌కుమార్ ఎప్పుడొచ్చాడో, ఏ స్థితిలో వొచ్చాడో; అప్పటివరకూ అక్కయ్య కన్ను రెప్పలు వాల్చకుండా ఎదురుచూస్తూవున్నదో, ఆలోచించి ఆలోచించి అలసిపోయి అన్నంతినకుండానే నిద్రపోయిందో-

ఉమాశశికి తెలియదు. ఆమె పదకొండు గంటలకు నిద్ర పోయింది-ఏదో పుస్తకం చదువుతూ.

మర్నాడు మోహన్‌కుమార్ వర్కుసుమీదకు వెళ్ళగానే, ఉమాశశి తన మనస్సులోని సందేహాలను గురించి అక్కయ్యతో ప్రస్తావించింది.

"అక్కా! నేనొక్క విషయం అడుగుతాను. దాపరికం లేకుండా ఖచ్చితంగా చెబుతావా?"

చెల్లెలికేసి తలెత్తిచూసింది అమరేశ్వరి. ఆ చూపులో నిజాన్ని బయటపెట్టాల్సిన అగత్యం ఏర్పడుతుందేమోనన్న భయం ద్యోతకమైంది.

"అడుగు!"

"ఇక్కడ నువ్వు సుఖపడటంలేదు. ఏమంటావు?"

అమరేశ్వరి విచలితమైనా, తాత్కాలికంగా మౌనం వహించింది.

"ఇరువురూ బాగా చదువుకున్నారు. అందచందాలకూ, ఆస్తికీ లోటులేదు సుఖానికి చక్కని రాస్తా ఏర్పర్చే వయస్సులో ఉన్నారు. జీవితరీతుల్ని సక్రమంగా అర్థంచేసికొని, సంసారాన్ని తేనెసోనగా సాగించగల అన్నిహంగులూ కలిగియున్నారు. మీ దాంపత్యం ఆదర్శపూరితమనీ, సుఖశాంతులతో పవిత్ర దేవాలయంవలె విలసిల్లుతూన్నదనీ, వివాహం నీ జీవితంలో వెలుగుబాటకు దారి చూపిందనీ- ఇంతకాలంనుంచీ అనుకుంటున్నాను. కాని అట్లా అనుకోవడం కేవలం 'భ్రమ' అని గ్రహించాల్సివస్తూన్నది. బావ

గారి పోకడలు తెగిన గాలిపటంవలె వుంటున్నాయి. చదువూ సంస్కారముగల యువకుడూ, ఉద్యోగధర్మాలను న్యాయంగా కట్టుబడాల్సినవ్యక్తీ, దేశాభివృద్ధికి శక్తివంచనలేకుండా పాటు పడాల్సిన ఉద్యోగీ, భార్యపట్ల నిర్మలమైన ప్రేమాభిమానా లను కలిగివుండాల్సిన గృహస్థూ - అట్లా బాధ్యతారహితంగా నిర్లక్ష్యంగా, కొన్ని దుర్వ్యసనాలకు లోనై ప్రవర్తించడం ఏం సబబు? బావగారి బరితెగిన పోకడలకు నువ్వు అంత రాత్మలో తీవ్రమైన ఆవేదన పొందుతున్నావనీ, బయటకు సుఖంగా వుంటూన్నట్లు బలవంతాన నటిస్తున్నావనీ నాకు తెలుసక్కా! భగవంతుడు నీలాంటి స్త్రీలకు ప్రత్యేకంగా ఓర్పునూ, సహనాన్నీ, క్షమనూ దృఢంగా పదిలపర్చుకోగల శక్తిని ప్రసాదిస్తాడు. ఆయాగుణాలు జీర్ణించుకున్న మనస్త త్వంతో మానసికంగా ఎట్లాంటి ఇబ్బందులనైనా భరించ గలరు; ఎంతటి దుఃఖాన్నయినా దిగమింగుకోగలరు.

"మీలాంటి వారికి జీవితాన్ని గురించి కొన్ని భయా లుంటాయి. జీవితాన్ని చూసి భయపడేవాళ్ళి - జీవితం మరీ భయపెడుతుంది తమ విధివ్రాత వక్రించడంవల్ల, తమ దుర దృష్టాలు అధికారంలోకి రావడంవల్ల, పరిస్థితులు బ్రతుకులో కష్టాల్ని కలిగిస్తాయి. వాటికి తల యొగ్గడంకంటె చేసేదేమీ లేదు. జీవితంలో చీకటి తట్టును గురించే ఆలోచిస్తారు. దుఃఖాన్ని పొందని బ్రతుక్కు సార్థకత లేదనుకుంటారు. కాని పైకిమాత్రం సంతోషంగా జీవిస్తోన్నట్లు కనబడతారు. తమ బాధలు, సమస్యలు, దుఃఖం, పరిస్థితులు ఇతర్లకు తెలియడం

ఇష్టంలేదు. సంఘంచుంచి సానుభూతీ, సహాయమూ అక్కర్లేదు. ఎంతటి దుఃఖాన్నయినా తమలో ఇముడ్చుకోగల ఓర్పును గట్టి పర్చుకుంటారు.

"ఆ రకపు మన స్తత్వంతో అక్కా, నువ్వు బావగారి దుష్ప్రవర్తనవల్ల మానసిక వ్యథల్ని పొందుతూ పైకి సంతోషంగా బ్రతుకుతూన్నట్టు కనబడుతున్నావు. ఏం అంతేనా? నిజం చెప్పు. ఇందులో దాపరికం దేనికి? అందువల్ల ప్రయోజన మేముంది? ఒక గమ్యస్థానంపై దృష్టిని కేంద్రీకరించి భార్యాభర్తలు సంసారంలో ప్రయాణిస్తారు. ఆ ప్రయాణంలో ఎవ్వరు అనారోగ్యానికి గురైనా ప్రయాణం సుకరంగా కొనసాగాదు. అనారోగ్యానికి గురైనవాళ్ళు సరైన చికిత్స చేయించుకొని – ప్రయాణాన్ని దీక్షగా కొనసాగించడం ధర్మం. గమ్యస్థానంపై కేంద్రీకరణ దృష్టిలేనివాళ్ళూ, మనో నిగ్రహంలేక మాటిమాటికీ అనారోగ్యాలకు గురయ్యేవాళ్ళూ సంసార సాగరంలో చివరికంటా ప్రయాణం చేయలేరు. సుడి గుండాల్లో ఇరుక్కుంటారు. పెనుతుఫానులకు బలిఅవుతారు. అప్పుడు వెనక్కు తిరిగి చూసుకున్నందువల్ల లాభం వుండదు.

"అక్కా! నువ్వు చెప్పకపోయినా బావగారి ప్రవర్తనను నేను అంచనా వేసుకున్నాను. నిన్ను తృణీకరించి, నీపై చూపాల్సిన ప్రేమాభిమానాల్ని నిర్లక్ష్యపర్చి. నీతినిజాయితీల పట్ల శ్రద్ధవహిస్తూ–మృగతృష్ణలాంటి సుఖంకోసం మాయ మబ్బు వేసిన మన స్తత్వంతో బావగారు స్వేచ్ఛగా విహరిస్తున్నారు. కోర్కెల గుర్రాల పగ్గాలు సడలించి – వయస్సు

పరుగెత్తించినట్లు పరుగెత్తుతున్నారు. ఎప్పుడో అగాధంలో పడక తప్పదు. అంతకు ముందే ఆయనగారి పరుగుల్ని అరికట్టి పరివర్తనకు మార్గాలు చూపడం మంచిది. ఆయన గారికి చెప్పడం చేతకాకపోతే, నీకు భయమైతే నేను మాట్లాడతాను. నిర్మొహమాటంగా కళ్ళునంతా బయటపెడతాను. తనకు తను తెల్సుకొనేట్టు చేస్తాను" అన్నది ఉమాశశి పాల పొంగులాంటి ఆవేశంతో.

"వొద్దు, వొద్దు ఉమా! మా కాపురంలో నువ్వు జోక్యం కలిగించుకుంటే పరిస్థితులు మరీ గడ్డురూపాన్ని ధరిస్తాయి. ఏవేవో ఊహించుకొని ఆవేశంకొద్దీ మాట్లాడుతున్నావుగానీ మా సంసారంలో పెద్ద కల్లోలమేమీ లేదు. నాలోగానీ, ఆయనగారిలోగానీ చిన్నచిన్న పొరపాట్లూ, అభిప్రాయభేదాలూ, బ్రతుకుతీరును గురించి ఉద్దేశాల తేడాలూ వుంటే _ కాలక్రమాన సర్దుబాటు చేసికోగలంగానీ మూడో వ్యక్తి సహాయాన్ని కోరాల్సినంత అగత్యం ఏర్పడలేదు. అయినా నీకు అనుభవం తక్కువ. పుస్తకాలద్వారా వంటబట్టించుకున్న ఆశయాల్నీ, సూత్రాల్నీ, తీరుతెన్నులనూ ఏకరువుపెట్టడం చేతనవునుకానీ _ జీవితంలో వాస్తవంగా సమస్యలూ, ఇబ్బందులూ. పరిస్థితులూ ఎదురైనప్పుడు ఓర్పునూ, నిబ్బరాన్నీ వహించి ఎంత సున్నితంగా పరిష్కారం చేసుకోవాలో తెలీదు. ఆవేశాలూ, అధికారాలూ, పట్టుదలలూ. పోరాటాలూ పెట్టుకుంటే - సంబంధ బాంధవ్యాలు దూరంకావడం మినహాయించి, పరిణామాలు

సంతృప్తికరంగా వుండవు. చిక్కుబడ్డ దారపుబంతిని నెమ్మదిగా, సహనంతో, జాగ్రత్తగా విడదీయాలిగానీ - కోపావేశాలతో బలవంతాన లాగితేఏమౌతుంది? ఎక్కడికక్కడ తుంపులే మిగులుతాయి? వాటిని అతికించడం సాధ్యంకాదు. సాధ్యమైనా ఆ దారం గట్టిగా వుండదు. సంసారంలోని చిక్కులు కూడా అట్లాంటివే ఉమా!" అన్నది అమరేశ్వరి. ఆ మాటల వెనుక బలమైన అర్థాలు పొంచి ఉన్నప్పటికీ, చెల్లెలి మనస్సుకు నొప్పి కలక్కుండా ఆమె చాల సాధారణంగా అన్నది.

పొంగిపోయే పాలపై చన్నీళ్ళు చల్లినట్లయింది ఉమాశశి పరిస్థితి ఆ పైన ఏం మాట్లాడలేకపోయింది. తను నిజంగా 'తనకు మాలిన ధర్మం'గా జోక్యం కలుగజేస్కోబోయింది. తను అక్కయ్యకు పాఠాలు బోధించేపాటిదా? తనకంటె అక్కయ్య ఎక్కువ చదువుకుంది. సభ్యతా, సంస్కారమూ లేక పరిజ్ఞానమూ, మన స్తత్వపు లోతుల పరిశీలనా, సాంఘిక దృక్పథాలూ - తనకంటే అక్కయ్యకే ఎక్కువ తెలుసు తను ఒడ్డునున్న మనిషి. అక్కయ్య నీటి ప్రవాహంలో ప్రయాణించే మనిషి. తను ఆమె జీవిత గమనాన్ని వ్యాఖ్యానించడ మేమిటి? అనుకుంది ఉమాశశి.

అక్కయ్యకేసి వెంటనే తలెత్తి చూడలేకపోయింది.

౨

ఆ రోజు మోహన్‌కుమార్ శిరోభారంచేత సెలవు పెట్టి ఇంటిపద్దనే ఉన్నాడు. వర్క్సుమీదికు వెళ్ళలేదు.

సాయంత్రంవేళ ఉమాశశి ఒక్కతే కారుడ్రైవ్ చేస్తూ షికారుకు బయలుదేరింది. ఆమెను కారు నడపడమంటే మహా సరదా. తన సరదాల్ని తీర్చుకోవటంలో ఎంత సాహసానికైనా వెనుదీయదు గుంటూరులో నాన్నగారు కొన్నప్పటినుంచి రాగానే సాయంత్రాలు ఒక్కతే కారు వేసికొని – చల్లగాలి కోసం అటూ ఇటూ సిటీలో పదిబజార్లు తిరిగి వస్తూంటుంది. లాయరు సుందరరామయ్యగారు చిన్నకూతురి సరదాను గమనించి అభ్యంతరం చెప్పకుండా – తోడుగా డ్రైవర్ను పంపుతూ వుంటాడు. ఆ మధ్యనే టెంపరరీ డ్రైవింగు లైసెన్సునుకూడా ఆమె సంపాదించింది; డ్రైవింగు బాగా నేర్చుకోనేందుకు ప్రయత్నిస్తూన్నది.

దూరంగా నది మీదుగా కొండ వెనుక సూర్యుడు అందంగా నిష్క్రమిస్తున్నాడు.

మనస్సును కులాసాపర్చే మృదువైన గాలివీస్తోంది. ఆ గాలిలో ఒకే ఆలోచనలు సాఫీగా దొర్లుతూండగా – ఉమాశశి హాస్పటల్ రోడ్డునే ఇరవై మైళ్ళ వేగంతో కారు నడుపుతూన్నది.

హాస్పటల్ రోడ్డు ప్రక్కన కాళీ స్థలంలో కూలి పని చేసే వడ్డేవాళ్ళ గుడిసె లున్నాయి. ఆ గుడిసెల ముందు పిల్లలు స్వేచ్ఛగా ఆడుకున్నారు. ఆడుకుంటూ ఆడు కుంటూ ఇద్దరు పిల్లలు రోడ్డుమీదకు వచ్చారు పర ధ్యానంగా కారు నడుపుతున్న ఉమాశశి అకస్మాత్తుగాపిల్లలు రోడ్డుపైకి రావటాన్ని గమనించలేదు. తీరా ఇరవై గజాల

దూరంలో వాళ్ళనుచూసి గాబరాపడి-ఎక్సిలేటరు మీదున్న కాలూ, క్లచ్ ప్రక్కనున్న కాలూ గజగజలాడగా, బ్రేకు మీదకు కాలు వెంటనే పడక వొళ్ళంతా చెమటపట్టి, గుండె కడ బట్టేంత భయంవేసి-ఎల్లాగో కొసకు కార్ను ఆపు చేసింది. ఒక పిల్లవాడు తెలివిగా తప్పించుకున్నాడు గానీ రెండో కుర్రవాడు బంపర్ తగిలి బిళ్ళబీటుగా పడ్డాడు. కారు ఆ కుర్రవాని మీదుగా వెళ్ళలేదుగానీ-రోడ్డుపైని వాళ్ళకు బలమైన గాయాలు తగిలాయి. ముఖం దోక్కుపోయింది. మోచేతులూ మోకాళ్ళూ చెక్కలూడాయి, శరీరమంతా నెత్తురుమయం. రోడ్డుపై నకూడా పడ్డాయి నెత్తురు చుక్కలు. ఆ దుర్ఘటన చూసి గుడిసెల్లో ఆడవాళ్ళూ మగవాళ్ళూ పరుగెత్తుకొంటూ వచ్చి కారుచుట్టూ గుమిగూడారు.

ఉమాశశి గుండెలో భయం గరగరలాడినా, పైకి గంభీరంగా వుంది.

ఆడవాళ్ళల్లో ఒక స్త్రీ ఆ కుర్రవానితల్లి కామోసు పెద్దగా ఏడ్పు సాగించింది-నెత్తురు మడుగులో ఉన్న కుర్ర వాడ్ని చూసి మిగతా స్త్రీలు ఉమాశశి కేసి కొరకొర చూశారు; ఆడమనిషి కారు నడిపితే ఇట్లాంటి ఘోరాలు జరగవా అన్నట్లు!

తలపాగా దిట్టంగా చుట్టి, మొండి చేతుల బనీను వేసికొని మోకాళ్ల వరకూ పంచ ధరించి, కండలు దేరిన నల్ల శరీరం నిగనిగలాడుతూండగా మధ్య వయస్కుడు గబ

గబా కుర్రవాని నాడి పట్టుకు చూశాడు. 'ఇంకా చావలేదు' అన్న భావాన్ని ముఖంలో సంతృప్తిగా కనబర్చి "ఆసుపత్రికి తీసుకుపోండ్రా!" అన్నాడు. ఆ ముతాకు మేస్త్రీ ఆ మధ్య వయస్కుడు.

ఇద్దరు మనుష్యులు కుర్రవాణ్ని ఎత్తుకొని నందగజాల దూరంలో వున్న హాస్పటల్‌కు ఆదుర్దాగా తీసికెళ్లారు. అక్కడ గుమిగూడిన జనమంతా కారునూ, కారును నడిపే ఆమెనూ వినీవినబడనట్లు తిట్టుకొంటూ హాస్పటల్ కేసి వెళ్లారు. ముఠా మేస్త్రీ ఆమె కేసి రెండుమూడుసార్లు తేరి పార జూశాడు. ఏం మాట్లాడలేదు. నెమలికంఠం రంగు పట్టు జాకెట్టూ, అదే రంగు షిఫాన్‌చీర ధరించి మెడలో రాళ్ళ నెక్‌లెస్ మెరుస్తూండగా, నిర్మలమైన వదనంతో కారు ప్రక్కన నిలబడ్డ ఉమాశశిని గురించి – ఏ పెద్ద దొర వారి కుటుంబానికి చెందిన ఆడబడుచో అనుకున్నాడు మేస్త్రీ. అంచేత మనస్సులో కోపావేశాలున్నప్పటికీ బలవంతాన అణుచుకున్నాడు. ఇద్దరు ముగ్గురు యువకులు నోరు జారగా వాళ్ళకేసి ఉరిమి చూశాడు. అతను కూడా హాస్పటల్‌కు వెళ్ళాడు.

సూర్యాస్తమయం కాగా – మునిమాపు నిశ్శబ్దంగా ప్రవేశించింది.

తప్పు తనది. తన అజాగ్రత్తవల్లనే పాపం ఆ కుర్ర వాడు కారు క్రింద పడ్డాడు. తను దూరాన్నుంచే హారన్ ప్రమోగిస్తూ, వేగం తగ్గించి, బ్రేకువిషయంలో జాగ్రత్తపడితే

ఆ యాక్సిడెంటు జరిగివుండేదికాదు. ఇవాళ తను లేచిన వేళ మంచిదికాదు. ట్లావుందో ఆ కుర్రవానికి! డాక్టరు అభిప్రాయమేమిటో! గాయాలు త్వరగా నయమౌతాయో లేదో! ఆ కుర్రవాని తల్లిదండ్రు లెంతగా తల్లడిల్లుతున్నారో ఏమో! తను కూడా హాస్పిటల్‌కు వెళ్ళి - ఆ పిల్లవాని పరిస్థితి తెలుసుకోవటంమంచిది. తాను పిరికివానిలాగా తప్పించుకొని వెళ్ళరాదు తాత్కాలికంగా తాను తప్పించుకొన్నా తన మనస్సుకు స్థిమితం చిక్కదు. నేరం చేసినవాళ్ళు ఎప్పుడూ తప్పించుకుందామనే ఆరాటంతో వుంటారు. తప్పించుకోడంలో కృతకృత్యులైనా, చట్టపూర్వకంగా శిక్షననుభవించకపోయినా - మానసికాందోళన, చికాకు, భగవద్భీతి, ఆత్మన్యూనతాభావం వాళ్ళను క్షణ క్షణం రంపపుకోత లాంటి బాధకు గురి చేస్తూనే వుంటాయి. ఆ బాధను అనుభవించటం కంటె - నేరాన్ని ఒప్పుకొని, శిక్షకు గురియై, ఆత్మమాలిన్యాన్ని ప్రక్షాళితం చేసుకోవడం మేలు అనుకుంటూ ఉమాశశి హాస్పిటల్ లోనికి వెళ్ళింది.

బెడ్‌మీద పడుకోబెట్టి డాక్టరు కుర్రవానికి కట్లు కడుతున్నాడు. కుర్రవాని తల్లిదండ్రులూ, మునామేస్త్రీ ప్రక్కనే నిలబడ్డారు. మిగతా వాళ్ళంతా బయట నిలబడ్డారు.

ఉమాశశి నేరుగా లోపలికి వెళ్ళింది.

"డాక్టరు గారూ! కుర్రవానికి ఏం ప్రమాదం లేదు గదా" అన్నది ఉమాశశి ఆందోళనను వ్యక్తపరుస్తూ

కట్లు కట్టటం ముగించిన డాక్టరు కరుణానిధి ఆమెకేసి

తలెత్తి చూచాడు. ఆ చూపులు కొన్ని క్షణాలపాటు ఆమెపై పరిశీలనగా వాలాయి.

అతని చూపులకు వాలిన గులాబి కొమ్మలా నిలబడింది ఉమాశశి,

"ఏం ఫర్వాలేదండీ! గాయాలు పెద్దవేమీకావు. ఒకటి రెండురోజులు హాస్పటల్లో వుంటే చాలు. గాబరా చెందవలసిన పరిస్థితిలేదు" అన్నాడు డాక్టరు కరుణానిధి ఆమెకేసి దీక్షగా చూస్తూ.

ఉమాశశి మనస్సు చల్లబడింది.

డాక్టరు కరుణానిధి తన గదిలోకి వెళ్ళాడు. కాంపౌడరూ, నర్సూ క్యాజువల్టీ వార్డులోనే ఉన్నారు.

ఉమాశశి కొంచెం దూరంలో వుండి కట్లు కట్టబడి బెడ్‌మీద అచేతనంగా పడివున్న కుర్రవానికేసి దయార్ద్ర హృదయమై చూచింది.

"ఈమే మా బిల్లాడ్ని కారుకింద పడేసింది. ఎంత గుండెలేని రాయివమ్మా!" అన్నది కుర్రవాడి తల్లి కళ్ళు వురిమి చూస్తూ.

"అంత అడిసిపాటు పనికి రాదమ్మా! కారుంటే మటుకు కళ్ళు నెత్తికెక్కాలా ? రోడ్డుమీద సూపుండక్కర్లా" అన్నాడు కుర్రవాడి తండ్రి కట్టలు త్రెంచుకొస్తున్న కోపావేశంతో.

"పోలీసోళ్ళతో చెప్పాల్సిందే. లేకుంటే యీ దొర

పాపమ్మ రోజూ ఎంతమంది రకతం కళ్ళజూసుద్దో" అన్నది కుర్రవాని తల్లి భర్త ఆసరా చూచుకొని.

"శిచ్ఛ వేయించాల్సిందే. ఏం అన్నా! ఏఁవం టావు?" అన్నాడు కుర్రవాడి తండ్రి ముఠామేస్త్రీ కేసి తిరిగి.

—ఈ వ్యవహారంలో తనకేమీ సంబంధం లేదన్నట్లు ముఠామేస్త్రీ మౌనం వహించి, వార్డులోంచి బయటకు వచ్చాడు.

వాళ్ళ మాటలకు ఉమాశశి కోపగించుకోలేదు, భయ పడలేదు. డాక్టరుగారి గదిలోకి మెల్లగా నడిచింది.

ఆ కుర్రవాని తల్లిదండ్రులు కూడా డాక్టరుగారి గది లోకి వచ్చారు.

"డాక్టరుగారూ! నన్ను మన్నించాలి. నా అజాగ్రత్త వల్లనే జరిగిందండీ ప్రమాదం" అన్నది ఉమాశశి కంఠంలో పశ్చాత్తాపాన్ని తొణికిస్తూ.

"జాగ్రత్తగా వున్నప్పటికీ ఒక్కొక్కప్పుడు ప్రమా దాలు జరుగుతూ వుంటాయి. చూడండీ! రోజూ దేశంలో కార్ల క్రిందా, లారీల క్రిందా, రైళ్ళ క్రిందా - ఎంతో మంది పడుతూ వుంటారు. కొంతమంది ప్రాణాల్ని గోల్పో తారు; ఇంకొంతమంది వికలాంగులవుతారు. మరికొంతమంది ప్రమాదాల నుంచి సుళువుగా బయటపడతారు అన్ని యాక్సిడెంట్సుకీ తప్పు ఒక్కళ్ళదే అని నిర్ణయించలేం. కారు నడిపే ఆయన 'నేను పద్నేళ్ళనుంచీ కారు నడుపుతున్నాను.

ఎంత జాగ్రత్తగా నడపాలో నాకు తెలీదా? నువ్వే రాంగ్ సైడున నడుస్తున్నావు?' అంటాడు. ప్రమాదానికి గురి యైన వ్యక్తి మండిపడుతూ 'నేను పుట్టినప్పట్నుంచీ రోడ్డు పైన నడుస్తున్నాను. ఎట్లా నడవాలో నాకు తెలీదా? నువ్వే అజాగ్రత్తగా కారు నడుపుతున్నావు' అంటాడు. రోడ్డు ప్రమాదాలకు కారణాల్ని వెతకడం గమ్మత్తుగా వుంటుంది. యాక్సిడెంటు కళ్ళారా కనబడుతుంది; కాని ఎవరి అజాగ్రత్త వల్ల జరిగిందో తెలీదు. కారణం లేకుండా యాక్సిడెంటు జర గదు ఆ కారణాన్ని ఇరుపక్షాలు ఒప్పుకోవు చివరకు భగ వంతుని చెయిదంగా భావించడం జరుగుతుంది" అన్నాడు డాక్టరు కరుణానిధి.

తనని సమర్థించటానికి డాక్టరు చాల ఉపోద్ఘాతం చెప్పాడని గ్రహించిన ఉమాశశి అనిర్వచనీయమైన ఆనం దానుభూతిని పొందింది. కాని తన తప్పును సమర్థించుకొనే సాహసానికి దిగలేదు.

"నాకు కారు నడపడం కొత్తండీ! ఇంకా బాగా అలవాటుకాలేదు. టెంపరరీ లైసెన్సుహోల్డరును. ఈ ప్రమా దానికి నేను ఆశ్చర్యపడటం లేదు. ఈ నేరంనుంచి తప్పించు కుందామన్న ప్రయత్నంలేదు" అన్నది ఉమాశశి.

"ఒక్కొక్కప్పుడు నేరంయొక్క బలం అది కలిగించే ఫలితాలపై ఆధారపడివుంటుంది. అవతల వ్యక్తి నైతికంగా గానీ, శారీరకంగా గానీ, మానసికంగా గానీ, ఆర్థికంగా గానీ, మరేవిధంగా నైనా - నష్టపడకపోతే అది పెద్ద నేరంకాదు.

పశ్చాత్తాపం సరిపోయేటట్లు. ఆ పశ్చాత్తాపాన్ని మీరు పొందుతున్నారు. ఇక ముందు కారు డ్రైవింగులో ఎట్లాంటి అజాగ్రత్తలకీ తావు నివ్వరని భావిస్తాను." అన్నాడు డాక్టరు కరుణానిధి సౌమ్యంగా.

తన మనస్సులోని ఆలోచనల్ని అంత తేలిగ్గా అంచనా వేసిన డాక్టరుగారి ఊహాశక్తికి ఉమాశశి ఆశ్చర్యచకిత మైంది.

డాక్టరుగారి ధోరణి కుర్రవాని తండ్రికి రుచించ లేదు. తన కొడుకును కారు ప్రమాదానికి గురిచేసిన ఆమెకు తగిన శిక్ష వేయించాలన్న వెర్రి ఆవేశం అతగాడిలో కుతకుతలాడుతూనే ఉంది.

"ఈమెను పోలీసుస్టేషనుకు తీసికెళ్ళాల్సిందే చూస్తూ చూస్తూ విడిచిపెట్టడానికి వీల్లేదు" అన్నాడు కుర్రవాని తండ్రి ఆమెకేసి కోరమీసంలోంచి కొరకొర చూస్తూ.

కుర్రవాని తల్లికూడా అంత విసురుగానే మాట్లాడింది.

డాక్టరు కరుణానిధి గంభీరంగా చిరునవ్వు నవ్వాడు.

"మీ పిల్లవాడికేం ప్రమాదం లేదు. రెండు మూడు రోజుల్లో గాయాలు పూర్తిగా నయమవుతాయి. అప్పటి వరకూ హాస్పటల్లోనే వుంచవచ్చు. మీరు ఏ మాత్రం ఆదుర్దా పడక్కర్లేదు. మందులకు మీరు నయాపైసా ఇవ్వనవసరం లేదు. ఆమెమీద ప్రతీకారాన్ని తీర్చుకోవాలంటే – పోలీసు రిపోర్టు ఇవ్వండి. అందువల్ల మీకు కలిగే ప్రయో

జనమేమీ లేదు. మీ అబ్బాయే అజాగ్రత్తగా రోడ్డుమీద ఆడుకుంటూ కారుక్రింద పడ్డాడని నిరూపణయైతే - ఆమె మీద మీరు తీర్చుకొనే ప్రతీకార మేమీ ఉండబోదు. ఇట్లాంటి చిన్న చిన్నవాటికి రిపోర్టులూ, పోలీసు స్టేషన్లూ, కోర్టులూ, సాక్ష్యాలూ దేనికి? సులభంగా సర్దుబాటు చేసికోవచ్చు?

ఆ కుర్రవాని తల్లి దండ్రులు నిరుత్సాహంతో ఒకళ్ళ ముఖా లొకళ్ళు చూసుకున్నారు.

మనస్సులో ఉమాశశి డాక్టరుగార్ని సంపూర్ణంగా అభినందించుకుంది.

కృతజ్ఞతా పూర్వకంగా డాక్టరుగారికి నమస్కారం చేసి హాస్పటల్ నుంచి బయటకు నడిచింది ఉమాశశి. ఆమె బయటకు వెళుతుంటే - ఆమెకేసి కొన్ని క్షణాలపాటు డాక్టరు కరుణానిధి దృష్టి నిలిపి చూసిన సంగతి ఆమె గమనించ లేదు.

* * *

ఉద్యోగస్తుల్లో రకరకాల తరహాలుగల వాళ్లుంటారు. ఉద్యోగాన్ని జీవితంగా భావించేవాళ్ళు, ఉద్యోగాన్ని జీవితంలో ఒక అంశంగా తలచేవాళ్ళు, ఉద్యోగాన్ని సంపాదనగా ఎంచుకొనేవాళ్ళు, ఉద్యోగాన్ని "జీవిక"గా నిర్ణయించుకొనేవాళ్ళు, ఉద్యోగాన్ని పురుష లక్షణంగా, అభిలాషగా, హోదాగా, కాలక్షేపంగా పెట్టుకొని వ్యవ

హించేవాళ్ళు, ఉద్యోగాన్ని ఏ విధంగా భావించి నప్పటికీ, ప్రధానమైన ధర్మానికి ముప్పు కలక్కుండా సాగి పోతే యిబ్బందులు వాటిల్లవు. కాని కొంతమంది ఉద్యోగానికీ ఉద్యోగ ధర్మానికీ గల ఏకత్వాన్ని గుర్తించకుండా ఉద్యోగాలు చేస్తూంటారు. అది ఆత్మ వంచన కంటె హీనమైనది. తన శక్తికి విలువ ఏర్పరచుకోనివాడు, ఆ విలువల్ని ధర్మచ్యుతుడై పోగొట్టుకున్న మానవుడు జీవితంలో ముందంజ వేయలేడు. ఉద్యోగ ధర్మానికి బద్ధుడై శక్తివంచన లేకుండా కర్తవ్య నిర్వహణలో కృషి సల్పే మానవుడు ఒక ప్రక్కన ఆత్మానుగతమైన తృప్తినీ, సౌఖ్యాన్నీ పొందుతాడు! మరో ప్రక్క దేశాభివృద్ధికి దోహదమివ్వగలడు. ఆ కోవకు చెందిన వ్యక్తే డాక్టరు కరుణానిధి – అనుకుంది ఉమాశశి. మరునాడు ఉదయం హాస్పటల్‌కు ఆ కుర్రవాని పరిస్థితి కనుక్కునేందుకు వచ్చి, డాక్టరు కరుణానిధి పేదలకు చేసే వైద్యసేవను కళ్ళారా చూసింది ఉమాశశి. ఒక్కొక్క రోగిని ఎంతో ఓపికగా రవ్వంత విసుగు కనబర్చకుండా, నేర్పుగా, ఆప్యాయంగా మాటలు చెబుతూ, వ్యాధి లక్షణాలను కనుక్కుంటూ, మందులు నిర్ణయిస్తూ, రోగులకు ధైర్యం చెబుతూ – నిర్విరామంగా పనిచేస్తున్నాడు వార్డులన్నీ తిరుగుతూ, రోగుల పరిస్థితుల్ని కనుక్కుంటూ, ఇంజక్షన్సు యిస్తూ, మందులు తాగిస్తూ, జాగ్రత్తలు చెబుతూ – నూతనోత్సాహంతో చెదరని చిరునవ్వుతో కనబడే డాక్టరు కరుణానిధి ఆమె మనస్సులో మధురమైన అనుభూతి పగిది ముద్రించబడినాడు. అతని అందమూ,

ముఖంలో ప్రశాంతతా, విధి నిర్వహణలో వున్న దీక్షా, పేద ప్రజలపై వున్న కరుణా, జాలీ, శ్రద్ధా – ఆమెను సూదంటు రాయిలాగా ఆకర్షించాయి. ఆ ఆకర్షణలో అపూర్వమైన మాధుర్యం మొగ్గలు విప్పుకొంది.

కారు క్రిందపడ్డ కుర్రాణ్ణి పరామర్శించి, చాలసేపటి వరకూ డాక్టరు కరుణానిధి కొంచెం దూరంలో వెనుకనే వుండి రోగులకు అతను చేసే ట్రీట్‌మెంటును ఆసక్తిగా చూసింది. ముగ్ధురాలైంది.

డాక్టరు కరుణానిధి గదిలోకి వెళ్ళగానే, ఆమె కూడా గదిలోకి వెళ్ళింది.

"నమస్కారం డాక్టరుగారూ!" రెండు చేతులూ జోడించి, వినమ్రతమై నమస్కరించింది ఉమాశశి.

డాక్టరు కరుణానిధి మెత్తని చిరునవ్వుతో ప్రతి నమస్కారం చేశాడు.

"ఆ కుర్రవాని పరిస్థితి ఎట్లావుందో చూసిపోదామని వచ్చాను. రాత్రంతా నాకు సరీగ్గా నిద్రపట్టలేదు, జరిగిన యాక్సిడెంటుకు నన్ను నేను నిందించుకుంటూ కొరగాని ఆలోచనలతో గడిపాను. ఏమైనా నన్ను పెద్దరభసనుంచి రక్షించినందుకు మీకు సంపూర్ణమైన కృతజ్ఞత చెప్పుకోవాల్సిన ధర్మం నాపైన వుంది."

మనోహరమైన దరహాసాన్ని నిశ్శబ్దంగా దొర్లించాడు డాక్టరు కరుణానిధి. ఆ దరహాసాన్ని గమనించిన ఉమాశశికి– పాలపై పేరుకున్న మీగడా, పచ్చికబయలుపై స్వేచ్ఛగా

నాట్యంచేసే మయూరమూ, నిశ్చలమైన నీటిలో నీడల్ని చూసికొనే పువ్వులూ స్ఫురణకు వొచ్చాయి.

"దాని దేముందిలెండి! కాలమూ, పరిస్థితులూ సాక్షిగా సాగిపోవాలన్నదే నా స్వభావం చిన్న చిన్న విషయాల్లోకూడా సర్దుబాటుతత్వంలోపించి మనుష్యులు గోళ్లతో తీసివేసేదానికి గొడ్డళ్ళు తెచ్చుకుంటారు సమస్యల్ని సృష్టిస్తారు. పరిస్థితుల్ని గడ్డుపరుస్తారు. సర్దుబాటు గుణాన్ని ప్రతి మానవుడూ వృద్ధిచేసికొని, ఆచరణలో పెడితే - ప్రపంచం ఇంత అశాంతిగా వుండదు. ఆ కుర్రవాడు త్వరగానే కోలుకుంటున్నాడు నొప్పులుకూడా బాగా తగ్గాయి. రేపో, ఎల్లుండో డిస్‌చార్జి చేస్తాను."

"మానసిక కల్లోలంతో మెలితిరిగిపోతూన్న వ్యక్తికి - పవిత్ర దేవాలయంలో ప్రశాంతత చిక్కినట్టు, మీ హాస్పటల్లోకూడా ప్రశాంతత దొరికేట్టున్నది. నామనస్సు ఎట్లాంటి కల్లోలంతో చీకాగ్గా లేనప్పటికీ - ఎందుకో ఈ హాస్పటల్లో అదోరకమైన హాయిని సమకూర్చే వాతావరణం కనబడుతూన్నది. ఇంత ప్రశాంతంగావుండే హాస్పటలూ. మీలాగా నిశ్శబ్దంగా నిర్విరామంగా వైద్యసేవచేసే డాక్టర్నూ - నేను చూడలేదు" అన్నది ఉమాశశి నిర్మలత్వంతో కూడుకున్న హాస్యంతో.

డాక్టరు కరుణానిధి మనస్సులో చిరునవ్వు నవ్వుకున్నాడు గానీ - ఆ నవ్వును వెలుపలికి కనబర్చలేదు. కొన్ని క్షణాల తర్వాత—

"ఎంతో కాలంగా నాతో పరిచయమున్న వాళ్లుకూడా నన్ను గురించి వ్యక్తీకరించని పొగడ్తను - నిన్నా ఇవాళటి లోనే మీరు వ్యక్తీకరించారే! ఎవ్వరి చేసేపనిలో వాళ్ళకు పూర్తిగా విశ్వాసముంటే చాలు; సాఫల్యతను గురించి చింత పడక్కర్లేదు. మన ధర్మాన్ని మనం సక్రమంగా నిర్వహిస్తే మనం నడిచే బాట సాక్షీగానే వుంటుంది. తన విధిని నెర వేర్చడంలో ప్రకృతి ఏమరుపాటు చూపనట్టే మనిషి కూడా ఏమరుపాటు చూపకపోతే - ప్రకృతి రాణించినట్టు మనిషీ రాణిస్తాడు. నన్ను గురించి మీ రేదో కొంత గ్రహించినట్టు న్నారు గానీ, మిమ్మల్ని గురించి మీరు పరిచయం చేయ లేదు" అన్నాడు డాక్టరు కరుణానిధి.

మొగ్గపై చిరుగాలి వీచినట్టుగా సిగ్గుతెరలు ఒక్క సారి ఆమెను చుట్టుముట్టాయి. వెంటనే మాట్లాడ లేకపోయింది. తనని గురించి తను ఎట్లా చెప్పుకోవాలి? తనని గురించి ఏముంది? తనింకా చదువుకొనే దశలోనే ఉంది. ఆ చదు వైనా పదిమందికీ ప్రాక్టికల్‌గా వుపయోగపడేదికాదు. ఏమని చెప్పుకోవాలి - అట్లాంటి వ్యక్తిముందు?

బిడియంతో ఆమె పడే అవస్థను డాక్టరు గ్రహిం చాడు.

"మీరేమీ చెప్పకపోయినా ఫర్వాలేదు లెండి! వట్టినే తెల్సుకుందామని అడిగాను."

ఉమాశశికి ఏదో ఒకటి చెప్పక తప్పింది కాదు.

"నన్ను గురించి 'ఫలానా' అని చెప్పుకోనేందుకు ప్రత్యేకంగా ఏమీ లేదనే - సందేహిస్తున్నాను. మాది గుంటూరు. మా ఫాదర్ లాయరు. మా సిస్టరు ఇక్కడ అసిస్టెంటు ఇంజనీరుగా పనిచేసే మోహన్‌కుమార్ గారి భార్య. నేను గుంటూరులో బి. ఏ. ఫైనల్ ఇయర్ చదువుతున్నాను. సెలవులకు అక్కయ్యను చూచినట్టూ అవుతుందనీ, ఇక్కడి ప్రాజెక్టూ, నాగార్జున కొండా, ఎత్తిపోతల జలపాతమూ చూడవచ్చునని వచ్చాను. అనుకోకుండా మీతో పరిచయమయ్యే భాగ్యం కూడా కలిగింది." ఆ చివరి వాక్యం పలుకుతూ ఉమాశశి సహజంగా చిరునవ్వును పెదాల చివర వెలిగించింది

"మరి, మీ పేరు చెప్పలేదు!"

"ఉమాశశి. కొంతమంది 'ఉమా' అని పిలుస్తారు. మరి కొంతమంది 'శశీ' అని పిలుస్తారు. ఇట్లాంటి పేర్లతో వున్న ఇబ్బందే యిది!"

"నన్ను ఏమని పిలువమంటారు?"

"మీ ఇష్టం. ఎట్లా పిలిచినా ఒక్కటే."

"పూర్తి పేరే పిలుస్తాను. ఆ పేరులోనే నిండుదనం వుంది. చూడండీ! ఉమాశశిగారూ! హాస్పటల్స్, రోగులూ, డాక్టర్లూ, అక్కడి వాతావరణమూ, మీకు గల అభిప్రాయాలూ పరిశీలిస్తే - మీరు బి ఏ. కంటె, మెడిసన్ చదివి వుండాల్సింది. ఈ ప్రొఫెషన్‌లో పదిమందికి సేవ చేశామన్న ఆత్మ సంతృప్తి మిగులుతుంది.

"మా నాన్నగారి ఉద్దేశ్యం కూడా అదే. పి. యు సి. లో సైన్సు సబ్జక్ట్సు తీసుకోమని గట్టి సలహా యిచ్చారు. సైన్సుమీద వాస్తవంగా నాకు మంచిమోజూ, అభిలాషా ఉన్నాయి విశ్వశ్రేయస్సు దృష్ట్యా, సమాజాభ్యుదయాన్ని పెంపొందించడంలో, ప్రకృతి నధిగమించి శాశ్వతమైన విలువల్ని సృష్టించడంలో - వైజ్ఞానిక శాస్త్రం యొక్క పాత్ర నాకు తెలుసు. కాని చిన్నప్పట్నుంచీ తేలికైన చదువుకు అలవాటు పడ్డాను. లెక్కలు, సైన్సు - ఆ రెండంటే నాకు భయం. ఎలిమెంటరీ ఎడ్యుకేషన్‌లో ఎప్పుడూ ఎక్కాలు చదివేదాన్ని కాదు. స్కూలు ఫైనల్లో కూడా ఆ రెండు సబ్జక్టుల్లో మార్కులు తక్కువ వచ్చాయి. ఆర్ట్సు సబ్జక్ట్సు తీసికుంటే సులభంగా చదవచ్చునీ, ప్యాసు కావచ్చునీ పిచ్చి భ్రమలోపడి - నా వికాసానికి నేనే అడ్డుగోడలు పెట్టుకున్నాను. నా ఇష్టానికి వ్యతిరేకంగా మా నాన్నగారు బలవంతం పెట్టలేదు. ఇప్పుడు విచారిస్తూ వుంటాను - మెడిసన్ చదివితే ఎంత బావుండేదని? అయినా ఆడవాళ్ళ చదువులు ఆ మూడు ముళ్ళూ పడేవరకే. ఆ పైన భర్తఇష్టాయిష్టాలపై ఆధారపడి వుంటుంది. మా అక్క మెడిసిన్ చదువుతూ మానేసింది - బావగారి పట్టుదలవల్ల. ఆయనగారికి తను ఉద్యోగం చేస్తూంటే; భార్య కాలేజీలో చదవటమేమిటి? తను సంపాదించేది చాలదా? తన భార్యకూడా సంపాదించాలా? అన్న భావం కలిగి - అక్కయ్య చదువుకు కట్టిపెట్టించి కాపురానికి తీసికెళ్ళాడు. స్త్రీకి పెళ్ళికిముందే

కాలేజీల్లో చదువు; ఆపైన సంసారమనే యూనివర్సిటీలో ఆమె పరిశోధనలు జరిపి, ఆ సారాంశాన్ని సుఖదుఃఖాల కాల వాలమైన జీవితానికి అన్వయించుకోవటం ఆమె విధి. ఇప్పుడు మా అక్కయ్య ఆ రిసర్చిలోనే వుంది."

వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూ వుండగా నర్సు వొచ్చింది: "డాక్టరుగారూ! ఆ నాలుగో నంబరు గదిలో వున్నామె మందు త్రాగకుండా మారాం చేస్తూంది. 'మందులో విషం కలిపారు. అందుకనే చేదు' అంటోంది. హాస్పటల్లోంచి పారిపోతానని బెదిరిస్తోంది.

డాక్టరు కరుణానిధి కుర్చీలోంచి లేచాడు.

"నేను వెళ్ళొస్తానండీ" అంటూ ఉమాశశి కూడా కుర్చీలోంచి లేచింది.

'మంచిది' అన్నట్టు మంచితనం వుట్టిపడేట్లు చిరునవ్వు నవ్వాడు.

రసానుభూతిని పెద్దమోతాదులో కలిగించే ఒకగొప్ప సినిమాను చూచి హాలులోంచి సంతృప్తిగా బయటకొచ్చిన ప్రేక్షకురాలివలె ఉమాశశి హాస్పటల్‌నుంచి సంతృప్తిగా బయటికొచ్చింది.

ఆ మరునాడు కూడా మళ్ళీ హాస్పటల్‌కు వెళ్ళింది ఉమాశశి. ఉద్దేశం ఆ కుర్రవాణ్ణి చూడటానికైనా

డాక్టరుగార్ని చూడాలనీ, వారితో మాట్లాడాలనీ హృద యాంతరాళాల్లో కోర్కె గిలిగింతలు పెట్టడంచేత వెళ్ళకుండా వుండలేకపోయింది. జీవితంలో కాకతాళీయంగా జరిగే కొన్ని కొన్ని సంఘటనలద్వారా కొంతమంది వ్యక్తులతో పరిచయా లేర్పడతాయి ఆ పరిచయాల్ని తాత్కాలిక ప్రయోజనాల కోసం వినియోగించుకొని మర్చిపోయేవాళ్ళుంటారు; ఆ పరిచ యాల్ని పొడిగించుకొని తమ జీవితంలో అత్యంత ప్రాధాన్యత నిస్తూ ఆరాధించేవాళ్ళూ వుంటారు. ఘనత్వావస్థలో వున్న లక్క ముద్రనుస్వీకరించదు. ద్రవావస్థలో వున్నప్పుడు ముద్రను చక్కగా స్వీకరించి, ఆ తర్వాత ఘనీభవించి శాశ్వతంగా నిలుస్తుంది. డాక్టరు కరుణానిధి రూపాన్నికూడా ద్రవావస్థలో వున్న లక్కముద్రను స్వీకరించి, ఘనీభవింప జేసికున్నట్టు- ఆమె మనస్సు స్వీకరించి, పరిచయంతో ఘనీభవింపజేసింది.

ఆమె రాకను డాక్టరు కరుణానిధి అభిమానంతో ఆహ్వానించేవాడు. తీరిక సమయాల్లో ఆమెతో పిచ్చాపాటీ కబుర్లలోకిదిగేవాడు. ప్రపంచపు తీరు, ఈ యుగంలో రావా ల్సిన పరిణామాలు, శాస్త్ర విజ్ఞానంద్వారా మానవుడు సాధించవల్సిన విజయాలు, మనదేశంలో పారిశ్రామిక, వ్యవ సాయిక, సాంఘిక రంగాల్లో ప్రణాళికాబద్ధంగా జరుగు తూన్న కృషీ, రాజకీయాలు, సిద్ధాంతాలు, ఆధ్యాత్మిక విద్యపై మానవుడు తన దృష్టిని కేంద్రీకరించాల్సిన ఆవశ్య

కత, సామాజిక సూత్రాలలోని ఎగుడుదిగుళ్ళు మొదలైన వాటిని గురించి నిరొత్సాహకరంగా మాట్లాడుకొనే వాళ్ళు. కొన్ని విషయాలపై, సమస్యలపై, సిద్ధాంతాలపై ఇద్దరికీ ఏకాభిప్రాయం కుదిరేది గానీ, ఎక్కువభాగం తర్జనభర్జనల్లో భేదాభిప్రాయాల్ని కనబరుస్తూ వుండేవారు. "ఆర్థిక అసమానత్వం తొలగాలి. పటిష్టమైన సంస్కరణల్ని ఆర్థికవ్యవస్థలో ప్రవేశపెట్టాలి. అప్పుడే దేశం బాగుపడగలదు" అని ఆమె అంటే, "కేవలం వీటివల్లనే ఈ అవ్యవస్థ తొలగిపోదు. దేశౌన్నత్యం ఆశించిన విధంగా రూపొందదు. ఆర్థిక అసమానత్వాలు తొలగించబడేముందు - ప్రతి వ్యక్తిలోనూ సాంఘికమైన మార్పులు పెద్దఎత్తున రావాలి. తన ఆత్మను పరిశుద్ధం చేసికొని, వర్గరహితమైన సోషలిస్టు సమాజ స్థాపనకు ప్రతి వ్యక్తీ దృఢంగా, దీక్షగా కృషి చేయాలి. తనవిధినీ, ధర్మాన్నీ నెరవేర్చడమే కాకుండా - పరుల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని కార్యోన్ముఖుడుకావాలి." అనేవాడు డాక్టరు.

ఆ క్షురవాని గాయాలు నయమై హాస్పటల్ నుంచి డిస్‌చార్జి చేయిబడ్డా, ఉమాశశి రోజూ డాక్టరు కరుణాసింధి హాస్పటల్‌కు వస్తూవుండేది. రాను, రాను ఆమెకదో కాలక్షేపంగా తయారైంది. తన రాకవల్ల, తనతో పిచ్చాపాటీ మాటాడటంవల్ల డాక్టరుగారికి అమూల్యమైన కాలం వ్యర్థమౌతున్నదేమోనన్న సంశయం ఆమెకున్నది కానీ - ఆమెతో

స్వేచ్ఛగా మాట్లాడటంలో ఎలాంటి నిరుత్సాహాన్ని కన బర్చకపోవటంవల్ల ఆ సంశయానికి ప్రాధాన్యత నివ్వలేదు. డాక్టరుగారితో తనకు క్రొత్తగా కలిగిన పరిచయాన్ని, ఆపరిచయాన్ని వృద్ధిచేసుకోవటానికి తను పడుతూన్న శ్రమనూ, చూపెడుతున్న ఆసక్తినీ ఉమాశశి అక్కయ్యతో చెప్పలేదు ఆమె సలహాను కోరలేదు. అలాంటి అగత్యం వుందనుకోలేదు.

ఇంకా రెండురోజులకు కాలేజీకి శలవులు అయిపోతా యనగా హఠాత్తుగా గుర్తువచ్చి ఉమాశశి ఎంతో బెంగ పడింది. ఆరోజు సాయంకాలం ఆమె ముఖంపై తారట్లాడే బరువైన మేఘాల్ని చూసి, విస్మితుడై ప్రశ్నించాడు డాక్టరు.

"ఏమిటి? జీవితంలో ఎంతో విలువైన వస్తువును పోగొట్టుకున్నట్టు దిగులుతో ఉన్నారు?"

"సెలవులు అయిపోయాయి. రేపు గుంటూరు వెళ్లాలి" ఆమె మాటలలో దుఃఖాన్ని ప్రకటించే ధ్వనికి డాక్టరు కరుణానిధి తేలికగా చిరునవ్వు నవ్వాడు.

నాగార్జునసాగర్ విడిచిపోవాలంటే తను పొందుతున్న బాధ డాక్టరుగారికి అంత సులభమైన చిరునవ్వుకు కారణమైనదని తెల్సుకోగానే ఉమాశశికి దిగ్భ్రమ చెందినంత పనైంది.

"గుంటూరులోకంటే ఇక్కడే మీకు బావుందా?"

తనని పరిహసించడానికి డాక్టరుగారు ఆ మాట లంటు న్నట్టుగా పీలయ్యింది ఉమాశశి. ఆమెలో ఓ విధమైన చిరు కోపం పెదాలపై తొణికింది కానీ అంతలోనే అణుచుకుంది.

"పసిపిల్లల్ని వేసే ప్రశ్న వేస్తున్నారు."

"పెద్దవాళ్ళు పసిపిల్లల్లాగ సంచరించినప్పుడు — అల్లా ప్రశ్నించంలో తప్పు లేదనుకుంటాను."

ఉమాశశి మనస్సు చివుక్కుమంది.

నిజమే! తను పసిపిల్లలాగానే ప్రవర్తించింది. ఏదో కులాసాగా చూద్దామని ఇక్కడకు రావటమేమిటి, డాక్టరు గారితో పరిచయమై ఆయన సమక్షంలో కొత్త అనుభూతులు మొలకలెత్తి 'ఇక్కడే బావుంది' అన్న అభిప్రాయానికి జారి పోయి, ఈ ప్రదేశాన్ని వొదిలిపెట్టి వెళ్ళబోవడంతో బాధ పడట మేమిటి? తన నిగ్రహశక్తి అంత బలహీనమైనదా! తన వూరూ, తల్లిదండ్రులూ, చదువూ, స్నేహితులూ - మర్చిపోయి డాక్టరుగారి సమక్షంలో ఏదో ఆకర్షణకు ముగ్ధ రాలై తప్పటడుగు వేయబోతుందా? ఇట్లాంటి తాత్కాలిక అనురాగాలకు, ఆకర్షణలకు - మనస్సును మెత్తబర్చుకుంటే ముందు ముందు జీవితంలో ఎలా స్థిరబడగలదు? తన అజ్ఞా నాన్ని డాక్టరుగారు బాగా ఎత్తి చూపారు. తన మనస్సుని

ఆక్రమించుకున్న మాయామృగాన్ని పారద్రోలారు. ప్రక్క దారికి లాగిన తన మనస్సును నిశితంగా నిందించుకొని - చిరు నవ్వుతో డాక్టరు కరుణానిధికేసి చూసింది ఉమాశశి కళ్ళలో కొత్త కాంతి మెరుస్తుండగా.

ఆమెలో వేగంగా కలిగిన మానసికమైన మార్పును గుర్తించినవాడై డాక్టరు కరుణానిధి సంతృప్తి పడ్డాడు. కాని ఆ సంతృప్తిని బయటకు ప్రకటించలేదు.

"ఈసారి ఎప్పుడేనా వచ్చినప్పుడు తమర్ని కలుస్తాను" అంటూ నమస్కారం చేసి ఆ సాయంత్రం ఉమాశశి హాస్పటలు వెలుపలికి వొచ్చింది.

కాని ఆమె మనస్సు ప్రశాంతంగా లేదు. చేతికందిన అమృతపాత్ర తన అశ్రద్ధవల్ల, దురదృష్టంవల్ల జారిపోయినట్టు - అంతర్గతమైన ఆవేదన కుళ్ళగించసాగింది.

ఆ రాత్రి ఆమెకు సరీగ్గా నిద్రబట్టలేదు. పలు ఆలోచనలు ఆమె మనస్సులో రాత్రించరుల్లా పచార్లు చేశాయి

మరునాడు పన్నెండు గంటలకు హైద్రాబాద్ నుంచి గుంటూరు వెళ్ళే డీలెక్సు బస్సులో ఎక్కింది ఉమాశశి. బస్సుస్టాండుకు అమరేశ్వరి వొచ్చింది - ఆమెని సాగనంపేందుకు.

బస్సులో వెళుతూ, ప్రాజెక్టునూ, కొండల్ని చూస్తూ ఎన్నాళ్ళుగానో హాయిగా, కులాసాగా గడిపిన స్థలాన్ని బలవంతాన విడిచిపెట్టి వెళుతున్నట్టు మనస్సులో కన్నీరు కార్చింది ఉమాశశి.

# 3

ఆ రోజు సాయంత్రం డాక్టరు కరుణానిధి - రిక్రియే షన్ క్లబ్బుకు వెళ్ళాడు. రోజూ క్లబ్బుకు వెళ్ళేందుకు అతనికి తీరిక చిక్కదు. ఎప్పుడేనా వారానికో, రెండు వారాలకో ఒక రకమైన కాలక్షేపం కోసం క్లబ్బుకు వెళుతూవుంటాడు. అతని కాలక్షేపం కూడా సరిహద్దులు లేనటువంటిది కాదు. పరిమితమైంది. కొంతమంది వ్యక్తులు క్లబ్బులో పరిమితంలేని కాలక్షేపం చేస్తూ వుంటారు. అన్ని తరహాలకు చెందిన మనుషులతో సంబంధాలు ఏర్పర్చుకుంటారు. అన్ని రకాలయిన ఆటలు ఆడడం నేర్చుకుంటారు అరచేతిలో స్వర్గం చూపెట్టి నట్లు మాట్లాడటం, ఎంతటి నాలిముచ్చు స్వభావంగలవారితో నైనా ఇట్టే కలుపుగోలుగా కబుర్లలోకి దించడం, స్నేహాన్ని పెంచుకొని స్వప్రయోజనాలకు వుపయోగించుకోవటం, అహర్నిశలూ క్లబ్బులోనే మకాం వేయడం మొదలైన చేష్టల ద్వారా కొంతమంది క్లబ్బు మనుష్యులుగా పరిగణించబడ తారు. అలాంటి వ్యక్తులతో డాక్టరు కరుణానిధి మాటాడడు. టెన్నిస్; బ్యాడ్మింటన్ తప్ప అతనికి ఏ ఆటరాదు. స్నేహి

తులుకూడా అతనికి ఎక్కువమంది లేరు; కాని పరిచయస్తు లున్నారు.

ఆ రోజు క్లబ్బుకు వచ్చిన డాక్టరు కరుణానిధి నేరుగా టెన్నిస్‌కోర్టు దగ్గరకు వచ్చాడు. ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు ప్రక్కనే ఖాళీ కుర్చీవుంటే అందులో కూర్చున్నాడు.

"డాక్టరుగారు క్లబ్బుచాయలకే రావడంలేదేఈమధ్య" అన్నాడు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు మర్యాదకోసం చిరునవ్వు నవ్వుతూ.

"ఈ రోజులలో డాక్టర్లకు ఇంజనీర్లకున్నంత తీరుబాటు న్నదా క్లబ్బులకు రోజూ రావటానికి" అన్నాడు డాక్టరు కరుణానిధి.

రెండువందల డెబ్బై అయిదు పౌనులు బరువుగల ఎగ్జి క్యూటివ్ ఇంజనీర్ 'క్రోమ్‌ప్లైట్' స్టీలు కుర్చీ కిర్రుమనేట్టు వొళ్ళంతా కదిలిస్తూ పెద్దపెట్టున నవ్వాడు. ప్రతి చిన్న విష యానికీ పెద్దపెట్టున నవ్వటం ఆయన పద్దెనిమిదేళ్ళ సర్వీసులో మార్చుకోని స్వభావం. ఆయన నవ్వు క్రొత్తవాళ్ళకు ఆశ్చ ర్యాన్ని కలిగిస్తుంది; అలవాటుపడ్డ వాళ్ళకు అసహ్యాన్ని పుట్టిస్తుంది.

టెన్నిస్ డబుల్సు ఆడుతున్నారు. అసిస్టెంటు ఇంజ నీర్ మోహన్‌కుమార్, కంట్రాక్టర్ వెంకటరెడ్డి ఒకతట్టూ, ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు నాయుడూ, జూనియర్ ఇంజనీయరు శాస్త్రి మరోతట్టూ, మోహన్‌కుమార్ వాళ్ళు వరుసగా

రెండు గేములు గెల్చారు, మూడో గేము చివరిభాగంలో వుంది.

"డాక్టరుగారూ! నేను రోజుకు ఏడెనిమిది పెట్టెలు సిగిరెట్లు కాలుస్తాను. ఈ తీరున గత పది పన్నెండేళ్ళ నుంచీ కాలుస్తున్నాను. ఈ మధ్య పేపర్లలో అధికంగా కాలిస్తే లంగ్ క్యాన్సరు వస్తుందని అమెరికాలో పరిశోధనవల్ల నిరూపించబడినదనీ రెండు మూడుసార్లు చదివాను. అప్పట్నుంచీ భయం పట్టుకున్నది. కానీ ఎంత ప్రయత్నించినా ఒక్క సిగిరెట్టుకూడా తగ్గించలేకపోతున్నాను రోజు మొత్తంమీద. సిగిరెట్లు తగ్గించటానికి ఏమైనా మెడిసిన్ సజస్ట్ చేస్తారా?" అన్నాడు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు సిగిరెట్టు వెలిగిస్తూ.

ఆయన మాటలకు డాక్టరు కరుణానిధి నవ్వలేదుగానీ, రెండు కుర్చీల అవతల కూర్చున్న మరో ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు నవ్వాపుకోలేక ఫక్కున నవ్వాడు. నవ్వేవాళ్ళను చూస్తే ఆ ఇంజనీరుగారికి సంతోషమే.

"దురభ్యాసాలవల్ల వచ్చే జబ్బులకు మందులుగానీ' దురభ్యాసాల్ని రూపుమాపటానికి మందులేమిటి? ఆత్మనిగ్రహంకంటె బాగా పనిచేసే మందు వుండదు" అన్నాడు డాక్టరు.

'మీరు చెప్పేది నిజమే' నన్నట్టు తల ఆడించాడు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు.

"ఆ నిగ్రహమే కుదరడం లేదండీ!"

"నీరు ఎప్పుడూ పల్లానికే పరుగెత్తుతుంది. అల్లాగే మన దురభ్యాసాలు కూడా. నీటిని మెరక ప్రదేశానికి చేర్చాలంటే యంత్రశక్తి అవసరం. అల్లాగే దురభ్యాసాన్ని అరికట్టాలంటే నిగ్రహశక్తి కావాలి. నిగ్రహశక్తిని కోల్పోయిన మనుష్యులు తమ జీవితాల్లో ఎప్పుడూ జారుడు మెట్లపైనే ప్రయాణం చేస్తూ సుఖశాంతుల గమ్యస్థానానికి చేరుకోలేరు. అడవిలో స్వేచ్ఛగా తిరుగాడే పశువులకూ మన ఇళ్ళ దగ్గర మన అదుపు ఆజ్ఞలో వుండే పశువులకూ తేడా లేదూ! ఆ తేడా ఎక్కడ వొచ్చింది! మనం కొన్ని ఆటంకాలను, ప్రతిబంధకాలను, నియమాలను ఏర్పర్చి, వాటి స్వేచ్ఛను అరికట్టి, మన ఉపయోగాలకు సాధకాలుగా చేసుకుంటున్నాం. అట్లాగే మనస్సును కొన్ని నియమాలతో, సరిహద్దులలో బంధించి, అదుపులో పెట్టుకొని - సక్రమమైన జీవన పథానికి మార్గదర్శకం చేసికోవాలి. మనస్సుపై అధికారాన్ని వొదులుకుంటే, దానికుప్పిగంతులకు మానవుడు పతనం కావాల్సిందే." అన్నాడు డాక్టరు కరుణానిధి.

డాక్టరుగారి సమాధానంలో పెద్దపెట్టున నవ్వేందుకు పిసరంత ఆస్కారం కూడా చిక్కక పోయేప్పటికి ఇంజనీరు గారికి అడ్డేపల్లి వంటామువుదం (తాగిన ముఖం పెట్టాల్సి వొచ్చింది.

మూడో గేము కూడా మోహన్‌కుమార్ వాళ్ళే గెల్చారు.

సూర్యాస్తమయం జరగటంతో చీకటినీడలు పలుచగా పాలగా - టెన్నిస్‌కోర్టులో లైట్లు వేయబడ్డాయి.

ఓడిపోయిన జట్టు నిరుత్సాహపడి కోర్టునుంచి బయటికొచ్చారు.

డాక్టరుగారూ! సింగిల్స్ ఆడదాం రండి. మీతో ఆడి చాలా రోజులైంది" అన్నాడు మోహన్‌కుమార్, గేము గెల్చిన సంతోషంతో రాకెట్‌ను గాలిలో ఆడిస్తూ.

అసిస్టెంటు ఇంజనీరు మోహన్‌కుమార్‌కీ, డాక్టరు కరుణానిధికీ క్లబ్బులో ముఖపరిచయమేగానీ, ప్రత్యేకమైన స్నేహమేమీ లేదు. డాక్టరుగారు టెన్నిసు బాగా ఆడతారు అన్న మంచిపేరు ఆ క్లబ్బులో వుంది. డబ్బుల్సులో గెల్చిన వూపుతో సింగిల్సులో కూడా గెలువగలనన్న ధీమాతో మోహన్‌కుమార్ డాక్టరు కరుణానిధిని ఆటకు ఆహ్వానించటం జరిగింది. డాక్టరుక్కూడా ఆ రోజు టెన్నిసు ఆడాలనే కుతూహలం కలిగి, రాకెట్ తీసికొని యదాలాపమైన చిరునవ్వుతో ప్రశాంతంగా కోర్టులోకి ప్రవేశించాడు.

ఇరువురూ జోరుగా ఆడుతున్నారు.

ప్రేక్షకులు కోర్టుచుట్టూ వేయబడ్డ కుర్చీల్లో నిండిపోయారు ఆసక్తిగా చూస్తున్నారు.

మొదటి గేము డాక్టరు కరుణానిధి గెల్చాడు.

ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు నాయుడూ, జె. యి. శాస్త్రి మరికొంతమంది డాక్టరుగారి ముందు యీ మోహన్‌కుమార్ ఏం ఆడతాడు! అనుకున్నారు.

మోహన్‌కుమార్‌లో రోషం రెచ్చిపోయింది. ఈసారి తను గెలవాలన్న దీక్షతో ఆడాడు.

రెండో గేము మోహన్‌కుమార్ గెల్చాడు.

మూడో గేము ప్రారంభమైంది. ప్రేక్షకులలో అభిలాష జాస్తి అయింది. ఎక్కువమంది డాక్టరుగారే గెలువాలనే ఉత్సాహంతో ఉన్నారు.

డాక్టరుగారివి రెండుపాయింట్లు. మోహన్‌కుమార్‌వి నిల్. ఆ సమయంలో కాంపౌండరు సైకిలు వేసికొని అర్జంటుగా డాక్టరుగారి కోసం వచ్చాడు. ఎవరికో యాక్సిడెంటు జరిగిందట. ప్రాణాపాయస్థితిలో ఉన్నాడట. డాక్టరుగారు వెంటనే రావాలట.

డాక్టరు కరుణానిధి ఆట ఆపి, టెన్నిసు రాకెట్‌ను యిచ్చి, సత్వరం కారులో హాస్పటలుకు బయలుదేరాడు.

"వెధవ ప్రొఫెషన్ ఏదైనా కులాసాగా సర్దాగా కాలక్షేపం చేయాలంటే – ఏ క్షణంలో ఎవ్వడికి ఏం మూడుతుందో తెలియదు. పూర్వజన్మలో పాపం చేసికుంటేగానీ, ఈ జన్మలో డాక్టర్లుకారు. అయినా యీ డాక్టరు తన ఆత్మీయులకు యాక్సిడెంటు జరిగినట్టు అట్లా ఆదుర్దాగా పరిగెత్తకపోతేనేమో! గేము అయిపోయాక వెళ్ళొచ్చుగా! కాలం చెల్లి పోయేవాడ్ని యీయన మందుపోసి బ్రతికిస్తాడా! ఏమిటో – అనాకఫోజు, తనకి డూటీ, వైద్యసేవ ప్రాముఖ్య

మన్నట్టు – విలుక్కున్నాడు. మోహన్‌కుమార్ టెన్నిసు, కోర్టునుంచి బయటికివస్తూ.

అది జరిగాక మళ్ళీ అసిస్టెంటు ఇంజనీరు మోహన్ కుమార్, డాక్టరు కరుణానిధి క్లబ్బులో కల్సుకోలేదు. మోహన్‌కుమార్ రోజూ క్లబ్బుకొచ్చి పేకాటా, టెన్నిసూ ఆడుతున్నాడుగానీ డాక్టరు కరుణానిధి తీరిక లేక పోవడంవల్ల క్లబ్బుకు రావడం లేదు.

పదిహేను రోజుల తర్వాత మోహన్‌కుమార్ ఓరోజు ఉదయం తొమ్మిదిగంటలకు సూపర్‌వైజర్ను వెంటబెట్టుకొని హాస్పటల్‌కు వెళ్ళాడు ఆ హాస్పటల్‌కు అదనపు భవనాలు కట్టాలని ప్లాన్లూ, ఎస్టిమేట్లూ శాంక్షనయ్యాయి. వాళ్ళతో పాటు కంట్రాక్టరు సూర్యనారాయణ కూడా వొచ్చాడు. డాక్టరు కరుణానిధి అప్యాయంగా ఆహ్వానించి తన గదిలో కూర్చోబెట్టాడు. కాఫీ తెప్పించి యిచ్చాడు.

"మళ్ళీ మీరు క్లబ్బుకేసి రావటంలేదే! మీతో టెన్నిసు సింగిల్స్ ఆడి నా ఆట స్థాయి తేల్చుకోవాలని అను కుంటున్నాను" అన్నాడు మోహన్‌కుమార్.

క్లబ్బుకొచ్చే వ్యవధి దొరకడం లేదండీ" అన్నాడు కరుణానిధి చిరునవ్వు నవ్వుతూ.

గవర్నమెంటు ఉద్యోగాలో వ్యవధి అంటూ దొర కదు. మనకు మనమే సృష్టించుకోవాలి. చేసేవాడికి గాడిద చాకిరీ, చేయనివాడికి కాలం ఉబుసుపోక కబుర్లు. ఆరోగ్యం

చెపగొట్టుకొని, భౌతిక సౌఖ్యాలను దూరమై ఎంత వెట్టి చాకిరీ చేసినా ఫలితం ఒక్కటే! జీతం నయాపైసా ఎక్కువ రాదు. మూడు దశలలో నిండివున్న ఈ జీవితంతో రెండో దశ అత్యంత ప్రధానమైనది జీవితంలో సుఖాన్ని అనుభవించాలన్నా, అనుభూతుల్ని పదిలపర్చుకోవాలన్నా, డబ్బు సంపాదించాలన్నా, కుటుంబపు స్థాయిని పెంచాలన్నా, వార్ధక్యానికి భద్రత ఏర్పర్చుకోవాలన్నా — ఈ దశలోనే ప్రతి వ్యక్తీ ప్రయత్నిస్తాడు. అలాంటి ఈ దశలో జీవితాన్ని ఉద్యోగపు బందిఖానాలో ఇరికించి, ఆ చీకటిలో కొట్టుకులాడుతూ భౌతికమైన ఆనందాలకు పరిత్యజించరాదు. ఉద్యోగాన్ని జీవితంలో ఒక భాగంగా ఎంచుకోవాలిగానీ, ఉద్యోగమే జీవితంగా భావించి బండచాకిరీ నెత్తిన వేసికుంటే — అన్యాయంగా మన కడుపులో మనమే చిచ్చుపెట్టుకున్నవాళ్ళమౌతాము. ఉద్యోగంనుంచి రిటైర్డు అయినాకగానీ ఆవిషయం గుర్తింపుకురాదు. ఉద్యోగ కాలంలో తెలివితేటల్ని, శక్తిని, జీవితాన్ని దానికి బలిచేసి, ఏమీ కూడబెట్టుకోలేక, వయస్సులో పొందవల్సిన అనుభవాన్ని పొందలేక, యంత్రంగా ఉద్యోగ ధర్మానికిలోనై, పెన్షన్ పుచ్చుకున్నాక-ఆర్థికంగా నికృష్టమైన బ్రతుకుల్ని గడుపుతూ బాధపడుతూన్న వాళ్ళు ఎంతమంది లేరు! దీపం ఆరిపోయాక మనం ఇల్లు చక్కబెట్టుకొనేది ఏముంటుంది? ఉద్యోగంలో నా జీవిత విధానమదేనండి" అన్నాడు అసిస్టెంటు ఇంజనీరు మోహన్ కుమార్.

"వీరారు జీవితాన్నీ, రెండో దశలో దాని పరిణామ విశేషాన్నీ, జీవితంలో ఉద్యోగధర్మాని కివ్వవల్సిన మర్యాదనూ — ఒకే కోణంలో, ఒకే దృష్టిలో చూస్తున్నారు. భౌతిక సుఖాలను మనస్సులో పెట్టుకొని మాట్లాడుతున్నారు. సమగ్రదృష్టీ, దృక్పథమూ అవుసరం. సంపూర్ణమైన స్వార్థంతో మనిషి బ్రతకలేడు. బ్రతికినా ఆ బ్రతుక్కు విలువ లుండవు ప్రతిమనిషికీ మనస్సూ, ఆత్మా అనేవి వుంటాయి. భౌతిక ఆనందాలను వాంఛించి మనస్సు స్వార్థానికీ, అధర్మానికీ, అక్రమానికీ మొగ్గినా, ఆత్మ మందలించి, సరైన మార్గంలో పెడుతుంది అట్లాంటి ఆధిక్యత అంతఃకరణకు లేని వ్యక్తులు నైతికంగా, సాంఘికంగా పతనమౌతూనే వుంటారు మనస్సును అదుపులో పెట్టుకోలేని ఆత్మ ఆధ్యాత్మిక విలువల్ని గుర్తించని ఆత్మ – రాణించదు. రాణించని ఆత్మగల వ్యక్తులు దీపం ఆరిన శెమ్మలాంటి వాళ్ళు జీవితంలోని సుఖదుఃఖాలు కేవలం డబ్బుమీదే ఆధారపడి వుంటాయని అనుకోవటం భ్రమ డబ్బు పుష్కలంగా వున్నవాడూ సుఖపడుతున్నాడు; డబ్బు ఏమీ లేనివాడూ సుఖపడుతున్నాడు. ధనవంతుడూ దుఃఖాన్ని పొందుతున్నాడు; నిరుపేదా దుఃఖాన్ని పొందుతున్నాడు. సుఖదుఃఖాల్ని తూచేది అంతఃకరణగానీ ఆర్థికస్థితి గతులుకావు. ఉద్యోగస్థుల విషయంలోకూడా ఉద్యోగధర్మానికి పెడగావెళ్ళి, రెండు చేతులతో లంచాలు పుచ్చుకుంటూ ఒకప్రక్క ప్రభుత్వానికి ద్రోహం చేస్తూ మరోప్రక్క తమకు తాము ద్రోహంచేసికుంటూ, విపరీతమైన సంపాదనతో —

సుఖపడుతున్నారని అనుకుంటున్నారా? ఆ సుఖం మరీచిక లాంటిది స్వార్థంతో కూడుకున్న సుఖం సుఖంకాదు. ఆ సుఖానికి సంతృప్తి, అనుభూతులూ వుండవు. ఉద్యోగ ధర్మానికి బద్ధుడై, తన పనిని గౌరవంగా, సక్రమంగా నిర్వహించేవాడు, ఆర్థికంగా ఇబ్బందులకు లోనైనప్పటికీ - ఆత్మ సంతృప్తినీ, పవిత్రమైన అనుభూతుల్నీ పొందుతాడు. జీవితానికి అంతకంటె కావాల్సిన సుఖ మేముంటుంది?" అన్నాడు డాక్టరు.

పెదవి విరిచాడు మోహన్‌కుమార్-తన ఆశయాలకూ, మీ ఆశయాలకూ పొత్తు కుదరదన్నట్టు.

"పోనీలెండి. ఇప్పుడా చర్చలన్నీ దేనికి? మీ హాస్పటల్ ఎక్స్‌టెన్షన్స్‌కు నేను ఇన్‌చార్జి. త్వరలో పని ప్రారంభిస్తాము. వీరు కంట్రాక్టరు సూర్యనారాయణగారు, సూపర్‌వైజర్ చంద్రశేఖర్‌గారు" అంటూ వాళ్ళని పరిచయం చేశాడు మోహన్‌కుమార్

వాళ్ళందరికీ నమస్కరించాడు డాక్టరు.

"ఒక్కసారి అట్లా సైట్ దగ్గరకు వెళదాం రండి. బిల్డింగు ప్లాను మీకు వివరంగా చెబుతాను."

అందరూ కుర్చీల్లోంచి లేచి హాస్పటల్ ప్రక్కనున్న ఖాళీ స్థలంలోకి వెళ్ళారు సూపర్‌వైజరు ప్లాను తాలూకు బ్లూ ప్రింట్సును తెచ్చి వాళ్ళముందు పెట్టాడు.

## ౪

హాస్పటల్ నుంచి డాక్టరు కరుణానిధి ఇంటికి వొచ్చేప్పటికి పన్నెండున్నర అయింది. ఈ పాపపు లోకంపై పగదీర్చుకొంటూన్నట్టు తీక్షణంగా ఎండకాస్తోంది. సానుభూతిగా గాలి స్తంభించింది. అప్పటివరకూ హాస్పటల్లో నిర్విరామంగా పనిచేసి, కొంచెంకూడా అలసటను 'ఫీల్' కాకుండా బాత్ రూమ్‌లో కాళ్ళూ, చేతులూ, ముఖమూ పరిశుభ్రముగా కడుక్కొని వంటగదిలో టేబుల్ ముందు భోజనానికి కూర్చున్నాడు డాక్టరు.

తల్లి అన్నపూర్ణమ్మ భోజనం వడ్డించింది.

డాక్టరు కరుణానిధి భోజనంచేస్తూండగా ఆవిడ పాత పాట ప్రారంభించింది.

"ఇంకా ఎన్నాళ్ళురా యీ ముసలి తల్లి వంట నీకు? ఈ యేడైనా పెళ్ళిచేసికొని నా ముచ్చటా, భారమూ తీర్చరా.

రోజూ వినే గోలే గనుక డాక్టరు కరుణానిధి. ఒక పట్టాన వెంటనే సమాధానం చెప్పలేదు. మౌనంగా భోజనం చేస్తున్నాడు.

అన్నపూర్ణమ్మమ్మ మళ్ళీ హెచ్చరించింది ఆమర్ధాని గాఢంగా ప్రదర్శిస్తూ.

"నా పెళ్ళివిగురించి నీకింత పట్టుదల దేనికమ్మా!"

"మరి నాకుగాక ఇంకెవరికిరా...? మీ నాన్నగారుంటే, నీకు పెళ్ళిచేయకుండా ఇంతకాలంవూరుకొనేవారేనా! ఆయనగారు పోయాక... నేనేమీ చేయలేని దాన్నని, నా మాటలు పెడచెవిని బెడుతూ పెళ్ళికి వాయిదాలువేస్తూ వస్తున్నావు" అన్నపూర్ణమ్మ కంటతడిపెట్టుకొని, పైట చెంగుతో తుడుచుకుంది.

నిశ్శబ్దంగా భోజనం చేస్తున్నాడు డాక్టరు కరుణానిధి. తనేమైనా మాటాడితే తల్లి దుఃఖం కట్టలు పొర్లి ప్రవహిస్తుందని అతని భయం.

కాని ఆవిడ నిశ్శబ్దంగా వుండలేదు. కొడుకు పెళ్ళి వ్యవహారం ఏదో ఒకటి ఆరోజు అమో, తుమో తేల్చుకుందామన్న ఆవేశాన్ని ఉదయం నించీ ఆవిడ జాగ్రత్తగా నిల్వ చేసికుంది. ఆవిడ దృష్టిలో రెండుమూడు మంచి సంబంధాలున్నాయి అబ్బాయి ఒప్పుకుంటే వచ్చే మాసంలోనే నచ్చిన సంబంధాన్ని చేయొచ్చు. ఆ కళ్ళేపల్లి సంబంధం తప్పకుండా నచ్చుతుంది. పిల్ల బంగారు బొమ్మ. బి యస్. సి. వరకూ చదువుకుందట కుటుంబ సాంప్రదాయాలు వొంకపెట్టవీలు లేనివట. కట్నంకూడా కోరినంత యిస్తారుట ఇంకేం కావాలి? లేదా, ఆ పాలెం సంబంధం చేసికున్నా చేసికోవచ్చు. పిల్ల

వస్తే కొంచెం తగ్గినా ముక్కూ, ముఖమూ కళ్ళూ సిరిగలవట. పిల్లతండ్రి పంచాయితీబోర్డు ప్రెసిడెంటు మంచి బలుకుబడి గలవాడట ఒక్కతే ఆడపిల్ల. కట్నం ఘనంగా యిస్తానని కబురు చేశాడు. అసలు అబ్బాయి పెళ్ళికి ఒప్పుకుంటే ఏదో ఒక సంబంధం నిశ్చయం చేయొచ్చు. ఇన్నింటికీ మొదలు - వాడు పెళ్ళికి అంగీకరించాలిగా! తను ఎంత కాలంనుంచో చెవినిల్లు గట్టుకొని పోరాడుతూన్నది. కాని ఏం లాభం? ఆ ధ్యాసే ఉన్నట్టు కనబడదు, పైగా వేదాంతమూ, వైరాగ్యమూ మాటాడతాడు. సలక్షణంగా వివాహం చేసికొని సకలభోగాలూ అనుభవించాల్సిన యీ తరుణంలో వేదాంతమేమిటి? వైరాగ్యమేమిటి? కొడుక్కి తను పెళ్ళి చేయలేక పోయిందనే అపఖ్యాతి తను అయిన వాళ్ళల్లో తలెత్తలేక పోతూవున్నది.

"ఏమైనా ఈ సంవత్సరం నువ్వు పెళ్ళి చేసుకోవాల్సిందేరా? అప్పుడుగానీ నాకు మనశ్శాంతి చిక్కదు. అసలే నేను గుండె జబ్బు గలదాన్ని, ఏ క్షణంలో ఆ భగవంతుడు నాకు కబురు పంపుతాడో తెలియదు. నేను బ్రతికి వుండగానే నీ పెళ్ళి ముచ్చట చూడాలని నా కోర్కె. ఆ కోర్కెను నువ్వు తీర్చేట్టులేవు" అన్నది అన్నపూర్ణమ్మ కన్నతల్లి కడసారి కోర్కెగా నొక్కి పలుకుతూ.

గుండెలో గునపం గుచ్చుకున్నంత బాధ కలిగింది డాక్టరు కరుణానిధికి నోట్లో పెట్టుకోబోయే అన్నపు ముద్దను అలాగే చేతిలో పెట్టుకొని తల్లికేసి బరువైన నేత్రాలతో

చూశాడు. తల్లి అసూర్దాని గ్రహించాడుగానీ - ఆ అయిష్టం వెనుకగల అగత్యం అతనికి బోధపడలేదు.

"నన్ను నువ్వు సరీగ్గా అర్థం చేసుకోవడం లేదమ్మా! నిన్ను మానసికంగా కష్టపెట్టటానికే నేను నా పెళ్ళిని వాయిదా వేస్తూన్నానని నువ్వు అనుకుంటే, అలా అనుకోవటం కేవలం పొరబాటమ్మా! తల్లిని దైవంగా భావించి, పూజించే వాళ్ళల్లో నేనొకణ్ణి. తల్లిని సంతోషపెట్టడంకంటె ముఖ్యమైన ధర్మం నాకు లేదు. ఇంతకాలంనుంచీ పెళ్ళికి విముఖత చూపెట్టటానికి ముఖ్యకారణం - నా మనస్సింకా ఆ వాతావరణంలో ప్రశాంతతను పొందలేదు. నేను పెళ్ళి చేసుకోవాలనుకున్నప్పుడు నీతో చెప్పకుండా చేసికుంటానా! నీ చేతుల మీదుగా జరక్కుండా వుంటుందామ్మా!"

"ఇంకెప్పుడురా? నీకు ఆరవై ఎనిమిదో సంవత్సరం వెళ్ళిపోతూవున్నది."

"వయస్సు దేముంది! - మనస్సు పెళ్ళిమీదకు మళ్ళాలి గాని."

మళ్ళించుకోవాలి. వయస్సులో మనస్సును పెళ్ళి మీదకు మళ్ళించుకోవాలిగానీ, వయస్సుమీరిన తర్వాత పెళ్ళి చేసికుంటే సుఖమేముంది? ఆకులు రాలిన తర్వాత చెట్టుకేమి అందం వుంటుంది? మానిషికి దేవుడు బాల్యం, యౌవనం, వార్ధక్యం అని మూడుదశలు కల్పించిన కారణమేమిటి? ఏయే దశలో మనిషి ఆయా ధర్మాల్ని పాటించాలనేగా! అందుకు భిన్నంగా ప్రవర్తిస్తే బ్రతుకు విస్సారం కాదూ!... ఎవరో

ఒకమ్మాయిని ప్రేమించావు చదువుకునే రోజుల్లో. ఇద్దరూ ఒకళ్ళనొకళ్ళు గాఢంగా ప్రేమించుకోవచ్చు; వివాహం చేసికొని సుఖంగా జీవితాల్ని గడుపుదామని కలలుగనొచ్చు. కాని అలా జరుగలేదుగా! విధి మన చెప్పుచేతల్లో వుంటే - దాన్ని గురించి మనం ఇంతగా ఎందుకు చెప్పుకుంటాము? మీ పట్ల విధి అనుకూలించలేదు. ఆమెకు ఎవరితోనో వివాహమైంది. భర్తతో కాపురం చేస్తూంది ఎక్కడో. నువ్వు ఆమెను వివాహం చేసికోవాలనుకున్నా, ఆమెకూడా నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమించి వివాహం చేసికోవాలనుకొన్నా - ఆమె తల్లిదండ్రుల పట్టుదలవల్ల మీ ఇరువురికీ వివాహం కాలేదు. తల్లిదండ్రులతో మగవాళ్ళు తెగతెంపు చేసికున్నట్టు ఆడవాళ్ళు చేసికోలేరుగా. మనస్సులో ఆడది ఎంత స్వాతంత్ర్యురాలైనా, ఆచరణలో స్వతంత్రించి తన బ్రతుకుబాటను తనే వెతుక్కోలేదు. నువ్వు ప్రేమించిన ఆమెకూడా అలాగే నీకు శాశ్వతంగా దూరమైంది. ఆమెకోసం నువ్వింకా పెళ్ళిచేసికోకుండా; నీ జీవిత సుఖాన్ని నువ్వు గమనించకుండా - కని పెట్టుకొని కూర్చోవడంలో అర్థంలేదు. ఈ ప్రేమల్లో, అనురాగాల్లో, అభిమానాల్లో - నాకు నమ్మకమేమీ లేదురా అబ్బాయ్! నువ్వు కాలేజీలో చేరకముందు ఆమె ఎవరో నీకు తెలియదు; ఆమె కాలేజీలో చేరకముందు నువ్వు ఎవరో ఆమెకు తెలీదు. కాలేజీలో ప్రేమించుకున్నారు. కాలేజీలో నీ చదువు పూర్తికాకముందే ఆమెకు పెళ్ళయింది; ఇంకా ఆమెపై నువ్వు ప్రేమానురాగాల్ని పెట్టుకోవాల్సిన అగత్యం

లేను. అందని నక్షత్రానికోసం చేతులెత్తుతూ జీవితాన్ని వ్యర్థపుచ్చుతావా ? జీవిత భాగస్వామినిగా ఇంకో యువతిని ఎన్నుకో. ఆమెపైనే నీ ప్రేమనూ, అనురాగాన్నీ అభిమానాన్నీ చూపెట్టు ఆమెతోనే జీవితాన్ని సారవంతం చేసికొనేందుకు ప్రయత్నించు కొఱగాని ప్రేమలతో జీవితాన్ని చిత్రహింస చేసికోవటంకంటె - అందుబాటులోకి వచ్చిన సుఖాన్నే ప్రేమించు; ఆరాధించు. నువ్వు 'ఊ' అంటే చాలు నీకు అన్నివిధాలా నచ్చిన సంబంధాన్ని తీసికొస్తాను. మంచి ముహూర్తాలు దగ్గర్లోనే ఉన్నాయి. పెళ్ళీ, పిల్లలూ, సంసారమూ - అప్పుడేగానీ మనిషికి పరిపూర్ణత్వం రాదు" తన మనస్సులో గానుగాడుతూన్న విషయాల్ని పొల్లుపోకుండా ఏకరువు పెట్టింది అన్నపూర్ణమ్మ. కొడుకేసి కొత్త ఆశల ఆదుర్దాతో చూసింది.

మజ్జిగ పోసుకోకుండానే భోజనం ముగించాడు డాక్టరు. అతని ముఖంలోని అలజడిని ఆవిడ కనిపెట్టింది.

"నీ ధోరణి నీదేగానీ, నన్ను అర్థం చేసికోవటం లేదమ్మా !" అంటూ టేబుల్ ముందునుంచి లేచాడు.

అన్నపూర్ణమ్మ నోరు తెరచి విస్తుపోయింది.

డాక్టరు తన గదిలోకి వెళ్ళాడు.

'ఛీ, ఛీ, తను అనవసరంగా వాగి, అబ్బాయి మనస్సును కష్టపెట్టి, సొంతం అన్నం తిననివ్వకుండా చేసింది. తనది పాపిష్టి జన్మ' నొచ్చుకుంది అన్నపూర్ణమ్మ.

ప్రాయబడిన పెట్టబడిన ఆరోజు ఉత్తరాల్ని చూశాడు, డాక్టరు వొచ్చిన రెండు ఉత్తరాలలో ఒకనీలిరంగు కవరూ, దానిపైన దస్తూరీ అతన్ని ఆకర్షించాయి. అట్లాంటి దస్తూరీతో అతనికి అంతకు ముందు ఏ లేఖారా లేదు. సోఫాలో కూర్చుని కవరు చించాడు.

—డాక్టరు కరుణానిధిగారికి,

మనఃపూర్వక నమస్కారములు. నాగార్జునసాగర్ నుంచి వొచ్చిన ఇన్నాళ్ళకు మీకు లేఖ వ్రాయగలుగుతున్నాను. అక్కణుంచి వొచ్చిన మూడోరోజునుంచీ మీకు లేఖ వ్రాద్దామని ప్రయత్నిస్తూనే ఉన్నాను. కాని కొన్ని విచిత్రమైన ప్రశ్నలు నామనస్సులో చెలరేగి, వ్యర్థ సంఘర్షణకు దారి తీశాయి. లేఖ వ్రాయాలనే ఉత్కంఠ నాకెందుకు కలగాలి? వ్రాసే అగత్యమేమిటి? ఏం వ్రాయకపోతే? వ్రాస్తే మీరేమనుకుంటారు! నా నుంచి మీరు లేఖ కోసం ఎదురుచూస్తూ వుంటారా? ఎందుకెదురు చూస్తారు? అయితే నేనెందుకు వ్రాయాలి? మొదలైన ప్రశ్నలతో నా మస్తిష్కపు లేబరేటరీలో ఎన్నో ప్రయోగాలు జరిగిన మీదట, ఫలితాల ననుసరించి చివరకు లేఖ వ్రాయటానికే సాహసిస్తున్నాను. కాని ఎలా వ్రాయ్యాలి? ఏమని వ్రాయాలి? అన్నవికూడా ప్రశ్నలే!

ఒక మధురాతి మధురమైన దృశ్యం చూసినా, కమనీయమైన సంగీతం విన్నా, ఒక మంచి పుస్తకం చదివినా –

ఆ అనుభూతి మనస్సుపై చెరగని ముద్రవేస్తుంది. నాగార్జున నాగర్‌లో మీ సమక్షాన నా మనస్సుపై అలాంటి అనుభూతిగల చెరగనిముద్రే పడింది అక్కణుంచి వొచ్చాక నాలో అంతర్వాహినివలె కలుగుతూన్న మార్పుకు నాకే ఆశ్చర్యం వేస్తూన్నది. ఇంతవరకెన్నడూ పొందని భావాల్నీ మెదలని ఆలోచనల్నీ నా మనస్సు ఆహ్వానిస్తూన్నది. మీ రూపూ, మాటలూ, మంచితనమూ - నా హృదయంలో గొప్ప శిల్పి నిర్మించిన కళాఖండాలవలె స్థిరనివాసమేర్పర్చుకున్నాయి. అయినప్పటికీ ఏదో వెలితి, ఒకరకమైన అలజడీ, తీయని వేదన, ఆరని లాలస - మనస్సులో గుప్తంగా తిరుగుతూ' అనిర్వచనీయ వాతావరణాన్ని కల్పిస్తున్నాయి. ఆ వాతావరణంలో నిర్బంధించబడ్డ గాలివలె ఉన్నది నా పరిస్థితి కాలేజీపై పాఠ్యపుస్తకాలపై - దినచర్యలపై ఉత్సాహం తగ్గిపోతూన్నది. అభిలాషలు అడుగంటిపోతున్నాయి. నా విషయంలో కాలం పనిచేయటం మానివేసినట్లూ, జీవితం సాగడం ఆగిపోయినట్లూ 'ఫీల్' అవుతున్నాను. ఏమీ ఉబుసు పోవటంలేదు. నా యీ అనిశ్చిత పరిస్థితికి, అనిర్వచనీయమైన వాతావరణానికి, మానసికమైన మార్పుకూ - కారణమేమిటో సరీగ్గా అంచనా వేయలేకపోతున్నాను. కాని ఒక్కవిషయం మటుకు నిజం. నా మనస్సును మీరు బలమైన సూదంటురాయిలాగ ఆకర్షించారు. ఆ ఆకర్షణ వేడిమికి నేను తట్టుకోలేకపోతున్నాను.

మీ దగ్గరకు రావాలనీ, మిమ్మల్ని చూడాలనీ, మాటాడాలనీ నా మనస్సు ఉవ్విళ్ళూరుతున్నది. ఆ అవకాశ మెప్పుడో !

సాహసంతో కూడుకున్న నా యీ లేఖను మన్నించి సానుభూతిగా జవాబు వ్రాస్తారని ఆశిస్తూ, వేయి కన్నులతో ఎదురు చూస్తూ—

...............

ఉమాశశి.

ఆ ఉత్తరం చదువుకున్న డాక్టరు కరుణానిధి జాలిగా చిరునవ్వు నవ్వాడు. ఆ ఉత్తరాన్ని మడిచి డ్రాయర్లో పెట్టాడు.

బెడ్ మీద ఆలోచిస్తూ మేనువాల్చాడు.

౫

జీవితంలో మానవుని ధ్యేయం సుఖాన్వేషణ. సుఖాన్వేషణలో మానవుడు అనేక మార్గాలు అవలంబిస్తున్నాడు. తన ధర్మాన్ని వీడకుండా కష్టసాధ్యమైన కృషి ద్వారా నీతి న్యాయాలకు, సామాజిక సూత్రాలకు, పరిసరాలకు గౌరవాన్ని యిస్తూ-సుఖానికి రాస్తా ఏర్పర్చుకోవడం; తన ధర్మాన్నీ నీతి న్యాయాలనూ, సంఘాన్నీ కట్టుబాట్లనూ, పరి

సరాల్ని లక్ష్య పెట్టకుండా ఒన్ వే ట్రాఫిక్ లాగా సుఖం కోసం అవురావురుమంటూ సంచరించటం. సుఖం కోసం జీవితంలో నిరంతరాన్వేషణ జరిపే వారిని ప్రధానంగా పై విధంగా రెండు తెగలుగా విభజించవచ్చు. మొదటి తెగకు చెందిన వారు సమాజానికి సన్నిహితులు. సంఘ శ్రేయస్సునుదృష్టిలో పెట్టుకొని తమ దృక్పథాలను నిర్దుష్టం చేసికుంటారు. ఇతర్లకు అపకారం, మోసం, దౌర్జన్యం, అన్యాయం, అక్రమం తల పెట్టరు. తమ ఆదర్శాల ఆచరణలో తాత్కాలికమైన అపజయాన్ని ఎదుర్కొన్నా నిరుత్సాహపడరు. అచంచలమైన దీక్షతో మంచికాలంపై చూపుతో దృఢంగా కృషి సల్పుతారు అంతిమ విజయాన్నిపొంది, కోరినతృప్తినీ, సుఖాన్ని అనుభవిస్తారు. రెండో తెగకు చెందినవాళ్ళు సంఘాన్ని లక్ష్య పెట్టరు. స్వార్థం, అవినీతి, అక్రమం, అన్యాయం, దౌర్జన్యం, మొండిపట్టుదలా, పరిస్థితుల మలుపులపై నిర్లక్ష్యం మొదలైన వాటితో గట్టులేని ప్రవాహంలాగ సాగిపోయే తమ ప్రవర్తనతో దొరికిన సుఖాన్ని బావుకుందా మనే తహతహతో వుంటారు జీవితంలో వెలుగుపైనే అహర్నిశలూ దృష్టివుంటుంది. నీడల్ని గురించి ఆలోచించరు. సుఖాన్వేషణకై నిర్ణయించుకున్న ఆశయాలు ఆచరణలో అపజయాల్ని ఎదుర్కొంటే - ఇట్టే నిరుత్సాహపడతారు. సెంటిమెంట్సుకు లోనవుతారు. తెగింపుతో కూడుకున్న సాహసంతో జీవితాన్ని జూదంలో పావులాగ ఒడ్డుతారు. ఆ రెండో తెగకు చెందిన మనిషి అసిస్టెంటు ఇంజనీరు మోహన్‌కుమార్.

చిన్నతనం నుంచీ మోహన్‌కుమార్ 'అహం'తో పెరిగాడు. తన బ్రతుక్కి తానే అధికారి. తన భవిష్యత్తును తనే నిర్ణయించుకోగలడు. తన జీవిత విధానాల్ని తానే ఆలోచించుకోగలడు, తనపై ఎవ్వరికీ ఆధిక్యత వుండరాదు. గ్రుడ్డి వానికి దారి చూపించటానికి ఎవ్వరైనా సహాయపడాలి తను గ్రుడ్డివాడు కాదు. 'అట్లా బ్రతుకు, ఇట్లా ప్రవర్తించకు' అని తను చెప్పించుకోనక్కరలేదు. ఆలోచించుకోవటానికి మనస్సు వుంది. చూడటానికి చూపు ఉన్నది మంచీ, చెడూ విచక్షణకు విమర్శనా జ్ఞానముంది. సమాజమూ, నీతిసూత్రాలూ భగవద్గీతా, పరిస్థితుల ప్రాబల్యతా-వీటి అవసరం, బ్రతుకులో సుఖాన్ని అనుభవించడం చేతకానివాళ్ళకు, నీడల్ని చూసి దడుచుకొనే పిరికివాళ్ళకు. జీవితంలో సుఖానికి భారీ ఎత్తున ప్రాముఖ్యత నివ్వదల్చుకున్నవాళ్ళకు సామాజిక కట్టుబాట్లూ నీతి సూత్రాలూ, పరిస్థితుల ప్రాబల్యతా భగవద్గీతా అక్కర్లేవు. పుష్కలంగా డబ్బుంటే - అవన్నీ దారి తప్పుకుంటాయి. ధైర్యంతో అనుభవాన్ని అరిచేతుల్లో పెట్టుకొనేవాళ్ళకు గాని ఆ సత్యం బోధపడదు. ఈ లోకంలో సుఖానికి ధనం చుక్కాని ధనం విరివిగా వుంటే అద్దాల రోడ్డు లాంటి బాటను సుఖ తీరాలకు వేసికోవచ్చు. డబ్బు కోర్కెకుమీర వుంటే మటుకు అందరూ సుఖపడుతున్నారా? అంటే - అది వేరు. లక్ష రూపాయలు నిల్వ వున్నవాడు మరో లక్షను నిల్వ చేసేందుకు ప్రయత్నిస్తాడు. ఆ ప్రయత్నంలో సుఖం విషయం మర్చిపోతున్నాడు. సంపాదనే జీవితా

నికి సార్థకతగా భావిస్తున్నాడు. సంపాదించే ప్రతి వ్యక్తి లోనూ ఆ భావం గట్టిపడితే - సుఖానికీ సంతోషాలకూ, సౌందర్యానికీ కరువొచ్చి లోకమంతా ఈడుబోయిన బీడు వలె తయారవుతుంది. కాబట్టి సంపాదన యొక్క సాఫల్యత ఖర్చుపెట్టడంలోనే వుంది. సంపాదనా, ఖర్చూ; ఖర్చూ - సంపాదనా, ఆ రెండింటికీ ఏ వ్యక్తి తన జీవితంలో సమాన మైన విలువల్ని ఇవ్వడో - ఆ వ్యక్తి బ్రతుకు బావిలోని కప్ప లాంటిది. జీవితాన్ని అట్లా ప్రతిస్తంభించుకోవటంలో ప్రయో జన మేముంది? - అలాంటి ఉద్దేశ్యాల్ని జీర్ణించుకొని ఆ ప్రకారం తన ప్రవర్తనను పెంచుకుంటూన్న వ్యక్తి మోహన్‌కుమార్.

అతనికి సంపాదన జాస్తి. ఖర్చుకూడా జాస్తే. ఏ అలవాట్లు సుఖానికి సోపానాలని అతను మనస్ఫూర్తిగా భావిం చాడో, ఆ అలవాట్లన్నీ అతనికున్నాయి వాటికి అవసరమైన డబ్బును సంపాదించడం తన ధర్మంగా ఎంచుకున్నాడు. తనకా అలవాట్లు లేకపోతే - అంత సంపాదన అక్కర్లేదు; పైపెచ్చు తను సంపాదనమీద అభిలాషగలవాడు కాదు. కాని ఆ అలవాట్లే తన జీవితానికి కోరిన సుఖాన్ని తెచ్చి పెట్టే సాధనాలు సుఖం లేకపోతే జీవితం దేనికి? సుఖం కోసం జీవితంకోసం - తను సంపాదించాలి. సంపాదనలో తను అవలంబిస్తూన్న మార్గాలు సరైనవి కాకపోవచ్చు. తను లంచాలు తీసికుంటాడు. అది ఉద్యోగ ధర్మానికి గొడ్డలిపెట్టు.

దేశానికి ద్రోహం, చట్టానికి వ్యతిరేకం అయినప్పటికీ తను కంట్రాక్టర్లవద్ద నిర్మొహమాటంగా నిర్భయంగా డబ్బు గుంజుతుంటాడు. వర్క్సుమీద ఎక్కువశాతం తనకి ముట్టజెప్పకపోతే - ఆ కంట్రాక్టర్ను నష్టపరుస్తున్నాడు. నానా ఇబ్బందులకూ గురిచేస్తున్నాడు. అంచేత కంట్రాక్టర్లు తనకి భయపడి ఆ ఇచ్చేకట్న మేదో ముందుగా సమర్పిస్తూవుంటారు. తగినట్టుగానే తను వాళ్ళకు సహాయంచేస్తూ, అధిక లాభాల్ని సమకూర్చడంద్వారా సంతృప్తి కలిగిస్తూవుంటాడు. ఆ విషయాల్లో తను ముక్కుసూటిగా పోయేవ్యక్తి. పోచికోలు కబుర్లూ, మోసగించుదామనేఉద్దేశ్యమూ, డబ్బుపుచ్చుకొని, వాళ్ళకి ఆశలుచూపెట్టి, ఆ పైన పనిచేయకపోవటమూ, వాళ్ళని నష్టాలపాలు చేయడమూ - తన పద్ధతిగాదు. రావాల్సిందిఖచ్చితంగా పుచ్చుకోవటమూ, చేయవల్సింది ఎన్ని ప్రమాదాలున్నప్పటికీ జంకూ గొంకూ లేకుండా చేయటమూ, అందుకే తనంటే కంట్రాక్టర్లంతా పడిచస్తారు.

కొంతమంది ఆఫీసర్లు డబ్బురూపేణా నయాపైసా తీసికోరు. 'హానెస్టు'గా భుజాలు ఎగురవేస్తూ తిరుగుతారు కాని ఇంట్లోకి జవాన్లద్వారా వొచ్చిపడే కోడిగుడ్లూ, కోడిపెట్టలూ బియ్యపుమూటలూ, పండ్లబుట్టలూ, కూరగాయల తట్టలూ ఫ్యాన్లూ, రేడియోలూ, పట్టెమంచాలూ, నగలూ, చీరెలూ చూసీ చూడనట్టు నటిస్తారు. అవే చాలునన్న సంతృప్తి మనస్సులో రెక్కలు విప్పుకున్నా -పెదాలను మట్టుకు చలికి బిగుసుకుపోయిన కంబళి లాగా బిగిస్తారు. మరి కొంతమంది

ఆఫీసర్లు ఏదో శుభకార్యం 'సత్యనారాయణవ్రతం' లాంటిది తలపెట్టి, కానుకల రూపంలో రావాల్సిన మొత్తాన్ని ఇట్టే రాబట్టుకుంటారు. ఆ పాపం ఆ వ్రతఫలంలో లీనమౌతుంది కాబోసు!

ఇంకొంతమంది ఆఫీసర్లు రహస్యమైన ఏజెంట్లద్వారా తమకు చెందవల్సిన ముడుపుల్ని నేర్పుగా వసూలుచేసి కుంటారు. 'అన్నిరోడ్లూ రోమునగరానికే దారితీస్తాయి' అన్నట్టు పద్ధతి ఏదైనా చేరేది ఒకచోటుకే! ఈ దొడ్డిదోవ విధానాలు తనకి నచ్చవు. అంత భయపడుతూ, ఆత్మవంచన చేసికుంటూ, నటిస్తూ లంచాలు తీసికొని - సుఖపడేదెట్లా? సుఖపడటం చేతకానప్పుడు అక్రమ సంపాదన దేనికి? పాప భీతితో దేవునికి మొక్కుబడులూ, పూజలూ, అభిషేకాలూ సంతర్పణలూ - ఎందుకు? అనుకుంటూ మోహన్‌కుమార్ అప్పుడప్పుడూ, తను అనుసరిస్తూన్న విధానానికి తనే మురిసి పోతూ వుంటాడు.

నాగార్జునసాగర్‌లో మోహన్ కుమార్‌కు ముఖ్యమైన స్నేహితుడు కంట్రాక్టరు సూర్యనారాయణ. అతనిది కృష్ణాజిల్లాలోని ఓ మారుమూలగ్రామం. ఉన్న అయిదెకరాల భూమీ అమ్ముకొని విజయవాడ పట్నం చేరాడు. పదేళ్ళక్రితం ఒక పార్ట్నరుతో ఒక హోటలు పెట్టాడు. పది గమిడి గేదెల్ని కొని దిట్టంగా మేపుతూ సైడు బిజినెస్ పాల వ్యాపారం సాగించాడు. హోటలు పైన లాడ్జింగు గదుల్లో ఇద్దరు వన్నెల విసనకర్రల్ని నెల జీతాలపై పెట్టి,

వాళ్ళ లావణ్యాన్ని చిటపట చినుకుల్లాంటి యౌవ్వనంతో ఉలిక్కిపడి పడుతూన్న యువకులకు హారతిగా సమర్పింపజేసి, వందలూ వేలు గడించాడు. ఆ తర్వాత ఒక పెళ్ళికాని కన్నె పడుచును చెఱచిన నేరంలో యిరుక్కొని, పది పచ్చనోట్లు నలిగిపోగా, ఎల్లాగో కన్నుకొట్టబోయినంతపనై, తప్పించుకొని - హోటల్ బిజినెస్‌నూ, గమిడిగేదెల్నీ వన్నెల విసెనకర్రలనూ ఆ పార్టనర్‌కు వొదిలేసి, ఒక శ్రేయోభిలాషి సలహామీదట కంట్రాక్టరుగా తన పేరును లిస్టులో వేయించుకొని, చక్రాన్ని వడిగా త్రిప్పుతున్నాడు. మొదట్లో ఎ. ఆర్. వర్కు చేసి, ఆ తర్వాత రివీటుమెంటూ, చిన్నచిన్న బిల్డింగ్సూ కంట్రాక్టు చేశాడు. ఆఫీసర్ల అభిమానాన్ని పొందటంలో అందెవేసిన చేయి. నామినేషన్ వర్కుల్లో, వేలు గడించాడు. విజయవాడలో పాతికవేలతో స్వంత భవనాన్ని నిర్మించాడు.

కొన్నాళ్ళు హైవేస్‌లో రోడ్లూ, వంతెనలూ కంట్రాక్టు చేశాడు. నాగార్జునసాగర్‌లో ప్రాజెక్టు పని ప్రారంభించగానే తాత్కాలికంగా విజయవాడ నుంచి మకాం మార్చాడు.లక్షరూపాయలదాకా ఎర్త్ వర్కు చేయించాడు; కొన్ని బిల్డింగ్స్ కట్టించాడు. మంచి కాంట్రాక్టు వర్కు చేయిస్తున్నాడు. అతని అదృష్టం వాలుగాలిలో తెరచాప ఎత్తినట్టుగావుంది. ఆదాయం నాలుగంకెలు దాటి అయిదు అంకెలలో నడుస్తోంది. కారు కొన్నాడు. ఏయే ఆఫీసర్లను ఎట్లాంటి ఎరలద్వారా గాలానికి పట్టించుకోవాల్సిందీ, స్వలాభానికి

వినియోగించుకోవాల్సిందీ - పిండికొట్టినట్టు నేర్చుకున్నాడు. జూదం, తాగుడు, వ్యభిచారం మొదలైన సప్తవ్యసనాలూ అతనికున్నాయి. కాని పైకి మటుకు ఖద్దరు ధోవతీ, ఖద్దరు లాల్చీ ధరించి, చేతిలో లెదర్ బ్యాగ్ పట్టుకొని - మంచి హోదాగల వ్యక్తివలె కనబడుతూ ఉంటాడు. కంట్రాక్టర్ సూర్యనారాయణకూ అసిస్టెంటు ఇంజనీరు మోహన్‌కుమార్‌కీ స్నేహం పెంపొందటానికి, గాఢతరం కావటానికీ ముఖ్య కారణం-ఇరువురి అలవాట్లలో పోలికలు కుదరటమే. 'జీవితం సుఖం కోసమే సృష్టించబడింది' అన్న అభిప్రాయానికి ఇరువురూ విలువల్ని ఇస్తారు. ఇరువురికీ సంఘమంటే లక్ష్యం లేదు. తమ కోర్కెల్ని సాధించుకోవటంలో ఎంత సాహసానికైనా వెనుకాడరు. ఏ అన్యాయానికైనా పాల్పడతారు. నీతి నిజాయితీల పట్ల ఇరువురికీ గడ్డిపోచల్లాంటి ఉద్దేశాలున్నాయి. దుర్వ్యసనాలకు అలవాటుపడ్డవాళ్ళు స్నేహాన్ని పొడిగించుకున్నంత త్వరితంగా మామూలు మనుష్యులు స్నేహాన్ని పొడిగించుకోలేరు. కొద్ది కాలంలోనే వాళ్ళు ఎంతో సన్నిహితులవుతారు. మోహన్‌కుమార్‌కు గల దురలవాట్లను పసిగట్టిన కంట్రాక్టరు సూర్యనారాయణ పెద్ద ప్రయత్నం లేకుండానే గెస్టు హవుస్‌లో ఒక డిన్నర్ ఏర్పాటుచేసి జానీవాకరు రెడ్ లేబిల్ విస్కీ బాటిల్ తెప్పించి, ఆ నిషాలో ఖుషీకోసం ఓ కోకిల్లా రాణిని రప్పించి, కావాల్సిన సుఖాన్ని సరఫరా చేయించి, వశపర్చుకున్నాడు. మెరుపులాంటి ఆ అనుభవంతో

మోహన్‌కుమార్‌కు అతనిపై అభిమానమేర్పడి, అతనుకోరిన పనుల్ని చేయసాగాడు. ఆఇంజనీరు క్రింద తన కంట్రాక్టు పనుల మీద వొచ్చే లాభాల్లో కొంతభాగం ముట్టజెపుతూవుంటాడు. కంట్రాక్టరు సూర్యనారాయణ. అంతే కాకుండా మోహన్ కుమార్ విలాసాలకు ముడిసరకును సప్లయి చేస్తూవుంటాడు ఇద్దరూకలిసి వారానికో రెండు వారాలకో హైదాబాదు వెళ్ళి కులాసాగా కాలక్షేపంచేసి వస్తూవుంటారు. అక్కడ పెద్ద హోటల్లో దిగడం, కాఫీకి మారుగా బార్సులో బీరు గానీ, విస్కీగానీ సేవించటం, రోజంతా ఆ మత్తులో పిచ్చి పిచ్చిగా కబుర్లుచెప్పుకోవడం, రాత్రుళ్ళు గానా బజానాలకు, స్త్రీలతో పొందూ - కాలంతో నిమిత్తంలేకుండా "ఖుషీగా" గా గడుపుతారు.

ఆ రోజు కనుచీకటిపడగానే మోహన్‌కుమార్ ఇంటికి వొచ్చాడు గార్డెన్‌లో పూలచెట్లకు నీళ్ళుపోస్తూ "ఏమిటో శిరీష! ఇవాళ పెందలాడే ఇంటికి వొచ్చారు" అనుకుంది అమరేశ్వరి ఆమెకు పువ్వులంటే అపరిమితమైన ఇష్టమే కాకుండా. పూలమొక్కల్ని పెట్టటమూ, ఆ మొక్కల్ని శ్రద్ధగా పెంచటమూ, పువ్వుల్ని పూయించటమూ, వాటి సౌరభానికీ, సౌందర్యానికీ మురిసిపోవడమూ - ఎంతో సరదా. అందమైన పువ్వుల్ని చూసినప్పుడు ఆమె అవ్యక్తానుభూతిని అంచనా వేయలేము.

కారు "గారేజి"లో పెట్టి, ఇంట్లోకొచ్చాడు మోహన్ కుమార్. ఫ్లాస్కులో ఉన్న టీని త్రాగి, ప్రసన్నమూర్చుకొని

సిగరెట్టు కాల్చుకుంటూ - వరండాలో పడకకుర్చీలో ఏటవాలుగా పడుకున్నాడు. పూలచెట్లకు వెల్లువికిన ఆప్యాయతతో నీళ్ళుపోస్తూన్న భార్యను చూస్తూ.

"పిల్లలకు బొమ్మలంటే ఇష్టం. అల్లాగే ఆడవాళ్ళకు పువ్వులంటే ఎక్కడలేని ప్రాణం. సహజమైన అభిలాషల్ని కలిగించటంకూడా భగవంతుని సృష్టిలో ఒక భాగమే" అన్నాడు మోహన్‌కుమార్ మానవ మనస్తత్వ విశ్లేషణ కావిస్తోన్న గంభీర స్వరంతో.

భర్తకేసి క్రీగంటిగా చూసింది అమరేశ్వరి - ఆయన గారి నోటినుంచి సరళమైన ఆ పలుకుల్ని ఎప్పుడూ వినని ఆశ్చర్యంతో.

"కవులు స్త్రీలను పువ్వులతో పోలుస్తారు. ఇప్పటి రచయితలు స్త్రీల అంద చందాల్ని వర్ణించేప్పుడు పచ్చి వాస్తవికతకోసం - పువ్వుల ఇంపుసొంపుల్ని పదునైనమాటల చేత గారడీ చేయిస్తున్నారు గులాబీ రేకుల్లాంటి పెదాలు సంపెంగ మొగ్గలాంటి ముక్కు, ప్రొద్దు తిరుగుడుపువ్వులాంటి ముఖము, ముద్దబంతి పువ్వులాంటి మనసు, సన్నజాజి తీగె లాంటి నడుము, మందార పుష్పంవంటి కఠినుదనం, మల్లె పూలపై వెన్నెలజారిన నవ్వు మొదలయిన పోలికలతో గల వర్ణనల్ని ఈనాటి కథల్లో నవలల్లో ఎక్కువగా చూస్తూంటాం. స్త్రీల సౌందర్యమూ, అమాయకత్వమూ, మానసిక లక్షణాలూ, ప్రవృత్తులూ పువ్వులతో జతపడి వుండటం నిజంగా విశేషమే! ఏమంటావ్?"

అమరేశ్వరి మాట్లాడలేదు. తనతో అంత తీరిగ్గా అందులో సాయంత్రపుపూట, మాట్లాడటానికి ఆయనగారికి అవకాశం ఎట్లా వొచ్చిందా? అన్న ప్రశ్నే ఆమెలో తూనీగలాగ ధ్వనిస్తోంది.

అంతలో ఓ కంట్రాక్టరు వచ్చాడు - వెనుకా ముందూ దిక్కులు చూసుకుంటూ. "రండి! వెంకట సుబ్బయ్యగారూ!" అంటూ మోహన్‌కుమార్ ఆయన్ను లోపలకు తీసికెళ్ళాడు.

పూల మొక్కలకు నీళ్ళు పోయడం ముగించి - ఇంట్లోకి వెళ్ళింది అమరేశ్వరి.

డ్రాయింగ్ రూమ్‌లోని దృశ్యం చూడగా - ఆమె గుండె బరువెక్కింది.

కంట్రాక్టరు వెంకట సుబ్బయ్య అయిదు వందల రూపాయల నోట్లను ఇవ్వగా, ఆయనగారు గబుక్కున ప్రక్క జేబులో పెట్టుకొని సంతృప్తిగా చిరునవ్వు నవ్వుతున్నారు. నమస్కారం చేసి ఆ కంట్రాక్టరు బయటకు వెళ్ళిపోయాడు.

— ఆ దృశ్యం అమరేశ్వరి హృదయంలో నిర్భరమైన రోతను కలిగించింది. చప్పుడుకాకుండా ముఖం చిట్లించుకుంది.

భర్త లంచాలు తీసుకుంటాడని, ఉద్యోగ ధర్మానికి విరుద్ధంగా నడుస్తున్నాడనీ; నైతికంగా ఎంతో పతనమవుతున్నాడనీ ఆమెకు తెలుసు. చెడుమార్గాలనుంచి భర్తను కాపాడుకోవటానికి ఆమె ప్రయత్నాలు చేయకపోలేదు. మోహన్‌కుమార్ దృష్టిలో అపహాస్యం పాలుగావడం జరి

గింది గాని ప్రయోజనం శూన్యం. గ్రుడ్డి ఎద్దు చేనులో పడితే ఏదో ఒక గోతిలో దిగేవరకూ వెనక్కి మళ్ళిచూడదు. అలాగే దుర్వ్యసనాల దుర్గంధంలో పొర్లాడే మగవాడు - ఏదో ఒక బలమైన సంఘటన ద్వారా తనకుతాను తెలుసుకో వలసిందేగానీ ఇతర్ల మాట వినడు.

దుర్నీతిలో సుఖాన్ని దురాక్రమణ చేసికునే మగవాడెప్పుడూ తన భార్యమాటలు వినడు. పైవెచ్చు 'ఆమె తనకు చెప్పేపాటిదా?' అన్న అవజ్ఞకు గురై, రోషంతో విచ్చలవిడిగా ప్రవర్తిస్తాడు. లంచాలు తీసికో వద్దనీ. ఉద్యోగ ధర్మానికి న్యాయం చేకూర్చమనీ, త్రాగుడు, జూదం మొదలయిన చేష్టలవల్ల సంఘంలో స్థాయి తగ్గుతుందనీ అమరేశ్వరి భర్తకు ముఖాముఖినే చెప్పింది. కాని మోహన్‌కుమార్ వినలేదు. అవమానంగా భావించాడు. తనంటే ఏమిటో తనకు తెలుసనీ, తన బ్రతుకు తీరు సరిహద్దులు అతిక్రమించలేదనీ, కొన్ని అలవాట్లద్వారా సుఖాన్ని అనుభవించే వ్యక్తి స్థాయిని యీ సాంఘిక వ్యవస్థ న్యూనత పర్చగల ప్రశ్నేలేదనీ, లంచాలు తాను తీసుకోవడం కొత్తకాదనీ-దేశంలో ఎక్కువ భాగం ఉద్యోగస్థులు తీసుకుంటున్నారని, ఒకళ్ళచేత చెప్పించుకొనే స్థితికి తను దిగజారలేదనీ కటువుగా అన్నాడు. అప్పటినుంచీ మోహన్ కుమార్ ప్రవర్తనపై, బాగుపర్చుకోవాల్సిన అగత్యంపై ఆమె వ్యాఖ్యానించలేదు. తనలో తను కుమిలిపోవడమూ;

కన్నీళ్ళు కార్చటమూ, దుఃఖాన్ని కడుపులో ఘుండువలె పెంచుకోవటమూ.

వివాహంతో తన బ్రతుకుపై చీకటి నీడలు జడలు విప్పుకున్నాయనీ, ఎదురుగాలిలో అతికష్టంమీద ప్రయాణం చేసే పడవలాంటిదే తన జీవితమనీ. ఆ పడవ ఎంతదూరం ప్రయాణం చేసేదీ చెప్పలేని అనిశ్చితస్థితి తన బ్రతుక్కు ఏర్పడిందనీ, భవిష్యత్తుపై విశ్వాసాన్ని కుదుర్చుకోవటానికి ప్రయత్నించటం ఒక విధంగా ఆత్మవంచనేననీ అమరేశ్వరి తలపోయ సాగింది. జీవిత పరిస్థితిలోని మెరుగుదలకోసం ప్రతి వ్యక్తీ ఆశావాదాన్ని ఆరాధించటం కద్దు. ఆ ఆశాబలంతో ఓర్పునూ, నిబ్బరాన్నీ, భవిష్యత్తుపై దృఢమైన నమ్మకాన్నూ, ఆత్మస్థయిరాన్నీ అభివృద్ధిపర్చుకొని కొంత మానసిక ప్రశాంతతను పొందటం జరుగుతూవుంటుంది. కాని అమరేశ్వరి అట్లాంటి మానసిక ప్రశాంతతను పొందలేక పోతూన్నది.

## ౬

ఉమాశశి వ్రాసిన ఉత్తరానికి డాక్టరు సమాధానమివ్వ లేదు. సమాధానం వ్రాద్దామన్న అభిప్రాయమే లేదు.

పదిహేనురోజుల తర్వాత ఉమాశశి దగ్గర్నుంచి మళ్ళీ ఉత్తర మొచ్చింది. డాక్టరు ఆ ఉత్తరాన్ని చదువుకున్నాడు.

"...నేను వ్రాసిన లేఖకు మీనుంచి సానుభూతినీ, సహృదయతనూ ప్రకటించే సమాధానం వొస్తుందని ఈ క్షణంవరకూ తీక్షణంగా ఎదురుచూశాను. ఇంకా ఎదురు చూడటంలోని ఓర్పును కోల్పోయి, మళ్ళీ యీలేఖ వ్రాస్తున్నాను. మొదటి లేఖలో నేను పొందుపర్చిన భావాల్లో మీకు నచ్చనివి, మనస్సు నొప్పించినవేమైనా వుంటే క్షమించమని కోరుకుంటున్నాను మీరెందుకు జవాబు వ్రాయలేదో, నాకు నేను సమాధానం చెప్పుకోలేక తల్లక్రిందులవుతున్నాను. ఉత్తరాల జవాబులు వ్రాయటానికి మీకుగల బద్ధకమా? తీరుబాటులేకనా? 'ఏమిటిలే - వ్రాసేది!' అన్న అశ్రద్ధా! నిర్లక్ష్యమా! - మీనుంచి లేఖకోసం నేను పడుతూన్న ఆమర్దాని ఆంచనావేసి వ్రాయలేక, మీ ఊహాకు విడిచి పెడుతున్నా.

...మిమ్మల్ని అర్థంచేసికోవటంలో నేను త్వరపడ్డానా, నన్ను గురించి మీరప్పుడే మర్చిపోయారా? మర్చిపోయినా ఆశ్చర్యపడవలసిన విషయం కాదనుకుంటాను. జీవితాన్నీ, కాలాన్నీ, మనస్సునూ వైద్యసేవకు అంకితం చేసిన మీలాంటి మహనీయులకు - నాలాంటిదాన్ని జ్ఞాపకం పెట్టుకోవటం కష్టంకామా! మీరు నన్ను మర్చిపోయినా - నేను బాధపడను. కాని మిమ్మల్ని నేను మర్చిపోలేను. ఎందుకు మరిచిపోలేనో చెప్పమంటే - వెంటనే చెప్పలేను. అది నా బలహీనత కానివ్వండి; మిమ్మల్ని గురించి నా మనోఫలకంపై చిత్రించుకున్న అభిప్రాయాల గట్టిదనం కానివ్వండి; మరేదైనా బలమైన ఆకర్షణ కానివ్వండి; నా మనస్సును మీరు ఆక్రమించుకున్నారు. అనుక్షణమూ మీ గురించే ఆలోచనలు తుమ్మెదలాగ మనస్సులో చప్పుడు చేస్తూ వుంటాయి. ఆశ్చర్యం! ఒకందుకు నాకు నేనే గర్వపడేదాన్ని పురుషుడుగానీ, స్త్రీగానీ - పరస్పరాకర్షణలకు ఎందుకు లోబడతారు? ఆత్మనిగ్రహశక్తి లోపించటంవల్లనా! మానసికాంతర్జగత్తు మృగ్యంకావటంవల్లనా! వయస్సు మనస్సుపై చేసే అధికార ప్రభావానికా? అనుకునేదాన్ని నాకు గల ఆత్మనిగ్రహశక్తికీ, నాలో రాణించే మానసికాంతర్జగత్తుకీ మనస్సును అదుపు ఆజ్ఞల్లో వుంచగల పటుత్వానికీ గర్వపడేదాన్ని. కాని ఇప్పటి నా మానసిక వాతావరణం చూస్తుంటే నాకే చిన్నతనమేస్తూన్నది. మనస్సును పాలించే అనూహ్యమైన శక్తి

ఒకటున్నదనీ, దాన్ని జయించాలంటే జ్ఞాన పరిపక్వత కావాలనీ మిడి మిడి జ్ఞానంతో మిడిసిపడటం అవివేకమని గ్రహించాను.

...ఈ ఉత్తరానికైనా నాపట్ల దయానూ, శ్రద్ధనూ వహించి జవాబు వ్రాస్తారు గదూ! మీ దగ్గర్నుంచి వెంటనే సమాధానాన్ని పొందకపోతే నాకు నేనుగా ఏమౌతానో నాలో కరకరమంటూన్న ఆదుర్దా నా మనస్సుపై ఎలాంటి పరిణామాల్ని తెస్తుందో - తెలీదు. మూడు ముక్కల్లో ఉత్తరం వ్రాసినా నా మనస్సుపై చల్లనిగాలి వీస్తుంది..." ఆ విధంగా ముగించబడింది ఉమాశశి రెండోసారి వ్రాసిన ఉత్తరం.

సాయంత్రం హాస్పటల్‌కు వెళుతూ ఆలోచించాడు డాక్టరు కరుణానిధి. ఉమాశశి తనని గురించి పూర్తిగా పొరపడుతున్నది. సూటిగా వ్రాయకపోయినా - ఆమె తనని ప్రేమిస్తూన్నది. తన రూపాన్ని హృదయంలో గట్టిగా పీట ముడివేసికొని ఆరాధిస్తూన్నది ఆశల మెట్లు కట్టుకుంటూ, ఆకాశంలో మెరిసే తారను అందుకోవాలని తాపత్రయ పడుతూన్నది! [illegible] వేసి వెలుగును పోగొట్టుకున్న ఆ తారలో ప్రకాశాన్ని [illegible] చూడ[illegible]తున్నదో! పాపం... అమాయకురాలు. మా[illegible] భ్[illegible]ంతనన్న కనబడినా - అంతరాత్మ నిర్మలమైనది. తన [illegible]యాన్ని పెంచుకొని, గట్టిపర్చుకొనేందుకు తహ[illegible]లాడుతున్నది. తనని గురించి ఆమెకేం

తెలుసు? తొలిమలుపులోనే తప్పటడుగు వేసే తొందరపాటు ఆమె కెందుకు! హెచ్చరిక లేకుండా అకస్మాత్తుగా ఒక సంఘటన జరిగినట్టుగాక యౌవనమందిరంలో ప్రవేశిస్తూన్న యువతులు అమూల్యమైన తమ మనస్సును అతి సులభంగా కోల్పోతారు. తాము ప్రవేశిస్తూన్న మందిరంలో ప్రేమానురాగాలు చమురుగాగల కుండీలలో జీవిత సౌఖ్యపు దీపాలు తెల్లగా, కాంతివంతంగా వెల్గుతుంటాయని వాళ్ళ విశ్వాసం. కాని ఒక్కొక్కప్పుడు ప్రేమానురాగాలు చమురుకుండీలనిండా వున్నప్పటికీ, జీవితసౌఖ్యపు దీపాల్ని వెలిగించే వ్యక్తులు కరువవుతారనీ, అప్పుడా మందిరంలో చీకట్లు నిద్రపోతాయనీ వాళ్లకి తెలియదు. మనిషి ఎప్పుడూ కాంతినిగురించేఆలోచిస్తూ, అందమైన కలలుగంటాడుగానీ, చీకటినిగురించి ఆలోచిస్తూ, దుఃఖాన్ని దృష్టిలో పెట్టుకోడు. వ్యాపారానికి లాభనష్టాలు ఎట్లాంటివో - జీవితానికి సుఖ దుఃఖాలట్లాంటివి. వ్యాపారంలో కేంద్రీకరణ దృష్టి లాభంపై ఉన్నా నష్టాన్ని గూర్చి భయపడడమూ, జాగ్రత్త వహించటమూ, ఆలోచించటమూ జరుగుతూ వుంటుంది. అట్లాగే జీవితంలో కేంద్రీకరణదృష్టి సుఖాలపై లగ్నంచేసినా దుఃఖాన్ని గూర్చి భయమూ, జాగ్రత్త, ఆలోచనా అవసరం. ఉమాశశి అంత దూరం ఆలోచించే తనని గురించి మనస్సుపై హక్కుల్ని వొదులుకుందా ?...ఏమిటో...అనుకుంటూ హాస్పటల్‌కు వచ్చాడు డాక్టరు కారులో.

హాస్పటల్ ఎక్స్‌టెన్షన్ బిల్డింగ్సుకు పునాదులు వేశారు. కంట్రాక్టరు సూర్యనారాయణ దగ్గరవుండి కూలీలచేత పని చేయిస్తున్నాడు. సూపర్‌వైజరుకూడా అక్కడే ఉన్నాడు సిమ్మెంట్ ఇసుకా కలిపే మిక్చరు దగ్గర

అసిస్టెంటు ఇంజనీరు మోహన్‌కుమార్ హాస్పటల్లో నర్సు లలితాంబతో బాతాఖానీ వేస్తున్నాడు. పాతికేళ్ళ వయస్సులో పటపటలాడే సౌందర్యంతో లలితాంబ ఆ హాస్పటల్‌కి పెద్ద ఆకర్షణ. ఆమెను మొదటిసారి చూసినప్పుడే మోహన్‌కుమార్ పెదాలు తడిచేసికొని, పిడికిలి గట్టిగా బిగించాడు. ఆమెను వశపర్చుకొని, అనుభవించటంద్వారా తన సుఖానికి కొత్త రాస్తా వేద్దామనుకున్నాడు ఆమెను గురించి అక్కడక్కడా ఆచూకీ తీశాడు. వివాహమైన రెండేళ్ళకే మొగుడ్ని వొదిలేసిందనీ, తన శరీర లావణ్యాన్ని కేవలం అంగడిలో పెట్టకపోయినా - ఒక పచ్చనోటు రెపరెప లాడిస్తే అభ్యంతరం చెప్పదనీ, అట్లా పచ్చనోట్లు యిచ్చి ఆమెనుంచి అనుభవాల్ని పొందిన పెద్దమనుష్యులు చాల మంది ఉన్నారనీ తెలియవచ్చింది. అప్పట్నుంచి మోహన్ కుమార్ హాస్పటల్‌కు ఏదో మిషచేత రాకపోకల్ని హెచ్చు చేసి, డాక్టరుగారితో స్నేహాన్ని ఎక్కువ చేసికుంటూ, లలితాంబతో మాట్లాడే అవకాశాల్ని సృష్టించుకుంటున్నాడు. ఒకసారి కాలు డోరు కింద చిటికెనవ్రేలు నలిగి నెత్తురుకారితే, ఆమె చేతనే టించరు అయొడిన్ వేయించి, కట్టుకట్టించు కున్నాడు. మరోసారి రొంపపడిశెం పట్టిందనీ, కోడిచారుకీ,

బ్రాందీ బాటిల్‌కూ కూడా లొంగలేదనీ - ఆమె చేతుల మీదుగా మందు పుచ్చుకున్నాడు. మరునాడు తగ్గితే - ఆమె దగ్గరకు వెళ్ళి ప్రత్యేకంగా అభివందనాలు తెల్పాడు.

అదంతా చూస్తూంటే కాంపౌండరు జగన్నాథరావుకు అరికాళ్ళలో పుట్టిన జ్వాలలు నషాళానికి నేరుగా అంటుతున్నాయి. కేవలం ప్రేమాభిమానాలద్వారా ఆమెను చేపట్టి, శాశ్వతంగా తన దానినిగా చేసికొని జీవనరాగాన్ని చవి చూడాలనే కాంపౌండరుకు డబ్బూ, హోదా, కల్లబొల్లి కబుర్లూ ఎరచూపి ఆమెను పొందాలనుకునే వాళ్ళంటే మంట కాదు మరి! అతనికి భార్యపోయి రెండేళ్ళయింది. పిల్లలు లేరు. లలితాంబ ఆ హాస్పిటల్‌కు సంవత్సరం క్రితం వచ్చి వుండకపోతే - ద్వితీయ వివాహం చేసికొని వుండేవాడే. ఆమెను చూచిన దగ్గర్నుంచే ఆశా సౌధాన్ని నిర్మించుకుంటూ, అందులో సుఖాన్ని ఖైదు చేయాలని నిర్విరామంగా కలలు గంటున్నాడు. 'జీవితంలో మళ్ళీ పెళ్ళి చేసుకుంటే అందాల కాణాచి లలితాంబనే పెళ్ళి చేసుకోవాలి' అన్న ప్రతిజ్ఞను ఆశయంగా హృదయంలో స్థాపించుకున్నాడు. తన హాస్పిటల్లో పనిచేసే నర్సు లలితాంబ హాస్పిటల్ కంతటికీ గొప్ప ఆకర్షణనీ, ఆమెకోసం పడి చచ్చే పురుషులు కొంత మంది ఉన్నారనీ, వాళ్ళ మనస్సుల్లో ఆమె రూపం అహర్నిశమూ మెర్క్యురీ దీపంలాగ వెలుగుతూ వుంటుందనీ - డాక్టరుకి తెలియదు.

డాక్టరు హాస్పటల్లో ప్రవేశించటం అంత దూరంలోనే లలితాంబ చూసి - మోహన్‌కుమార్‌తో సంభాషణను పుటుక్కున తెంపివేసి, విసవిస మొదటి వార్డులోకి నడిచి వెళ్ళింది. హఠాత్తుగా ఆమె ప్రవర్తనలో కలిగిన మార్పుకు ఆశ్చర్యపడి, డాక్టరున్నచూసి సాధ్యమైనంతవరకు సర్దుకొని, పెదాలపై చిరునవ్వును నటించి-"హల్లో! డాక్టరుగారూ!" అంటూ విష్ చేశాడు అసిస్టెంటు ఇంజనీరు మోహన్‌కుమార్.

"ఇవాళ కొంచెం ఆలస్యంగా వొచ్చినట్టున్నారే! నిద్రబోయారా?"

"లేదండీ! మామూలు వేళకే వచ్చాను." అన్నాడు. డాక్టరు చిరునవ్వుతో తన గదిలోకి వెడుతూ.

"అటు వర్క్ సాపాట్ దగ్గరకు వెళదాం రండి. పునాదులు కావొచ్చినయ్. చూద్దురుగాని. మీ కోసమే ఇక్కడ వెయిట్ చేస్తున్నాను."

"నేను చూసేదేముంది లెండి! ప్రాణమున్న జీవుల్ని పరీక్ష చేయటం తెలుసుగానీ, ప్రాణంలేని రాళ్ళూ, రప్పల్నీ సిమెంటు కాంక్రీటునూ, గోడల్నీ పరీక్ష చేయటమేం తెలుసు? అది ఇంజనీర్ల వంతు. కూర్చోండి కాఫీ త్రాగి వెళదాం."

మోహన్‌కుమార్ కుర్చీలో కూర్చుంటూ "మేం చేయించే వర్కును పదిమందీ చూస్తే అదో సంతృప్తిమాకు. అందులో ఈహాస్పటల్‌కు ఇన్‌చార్జి. ఇక్కడకట్టే ఎక్‌స్టెన్షన్ బిల్డింగ్సును మీరు విధిగాచూడాలి. ఏమంటారు?" అన్నాడు.

అప్పునన్నట్టు మెల్లగా తల ఆడించాడు డాక్టరు.

క్యాంటీన్ బాయ్ రెండు అరకప్పుల కాఫీ తెచ్చి వాళ్ళముందు డ్రాయరుపై పెట్టాడు.

ఉమాశశి వ్రాసిన రెండో ఉత్తరానికికూడా డాక్టరు కరుణానిధి సమాధానం వ్రాయలేదు.

తను ఎంతో ఆదుర్దాని వ్యక్తపరుస్తూ ఆశల్ని, సాగదీస్తూ వ్రాసిన రెండు ఉత్తరాలకీ జవాబు రాకపోయేటప్పటికి ఉమాశశి మానసికంగా బెంబేలుపడి, సంక్రాంతి సెలవులు ఇవ్వగానే, "అక్కయ్య దగ్గరకు వెళ్ళొస్తాను" అని ఇంటిదగ్గర తల్లి దండ్రులతో చెప్పి నాగార్జునసాగర్ వచ్చింది. చెల్లెలి రాక మేఘాల్లేకుండా పట్టపగలే వర్షం కురిసినంత ఆశ్చర్యం వేసినా అమరేశ్వరి ఆ భావ శకలాన్ని ముఖ కవళికల్లో కనబర్చలేదు.

"ఉత్తరంముక్క వ్రాయగూడదటే! బస్సుస్టాండుకు వొచ్చేదాన్ని."

"మీ ఇంటికి దారి తెల్సుగా. ఈ అపరాహ్ణపువేళ నీకు శ్రమ ఇవ్వడం దేనికనీ, అదీగాక హఠాత్తుగా అప్తుల ఇంటికి రావడంలోని ఆనందం - ముందుగా తెలియజేర్చి రావడంలో వుండదక్కా- ఫలానా తారీఖున ఫలానా శుక్రవారంనాడు మధ్యాహ్నం ఒంటిగంటకు నేను వస్తానని ఉత్తరం ద్వారా తెలియబర్చి రావడంలోనూ - ఇట్లా అనుకోకుండా మీ అందరికీ ఆశ్చర్యం కలిగించేట్టు రావడంలోనూ తేడా లేదూ' ఒక వ్యక్తికోసం ఎదురు చూడగా చూడగా

ఆ వ్యక్తి వచ్చినప్పటికంటె ఎదురు చూడకుండా ఆ వ్యక్తి వచ్చినప్పుడు ఎక్కువ సంతోషం కలుగుతుంది"

"అలాంటి సంతోషాన్ని మాకు కల్గించడానికే హఠాత్తుగా వచ్చావన్నమాట."

ఉమాశశి ముసిముసి నవ్వులు నవ్వుకుంది. తన రాకలోని ఆంతర్యాన్ని బయటపెట్టడం ఆమె కిష్టంలేదు

ఉమాశశి ఇంత త్వరితంగా తనకు తెలియజేయకుండా రావటంలో ఏదో గుప్తమైన కారణముండి వుంటుందని అలవోకగా అనుకున్నది గానీ అమరేశ్వరి అంతగా ఆలోచనకు పట్టించుకోలేదు. పైగా నోరు తెరచి అడగనూలేదు. ఇంటికొచ్చిన చెల్లెల్ని "ఎందు కొచ్చావు?" అని కట్టె విరిచి పొయ్యిలో కుక్కినంత కరుగ్గా అడిగేతత్వం ఆమెకులేదు.

పన్నెండున్నరకు భోజనంచేసి సాయంత్రం నాలుగున్నర వరకూ గాఢంగా నిద్రపోయి లేచిన మోహన్‌కుమార్ ఎత్తైన కొండమీదనుంచి నీళ్ళు పడుతూన్నట్టు మాట్లాడే మరదల్ని వంటగది ముందిగం ప్రక్కన చూసి "కలా? వాస్తవమా?" అన్న దిగ్భ్రమతో కళ్ళు నులుముకున్నాడు.

"బావగారు పెందలాడే నిద్ర మేల్కొన్నట్టుందే! ఇంకా రెండుగంటలపాటు ఆనిద్రను అల్లాపాడిగిస్తే సూర్యుడు నిష్క్రమించేవాడు; చీకటిపడేది. పగటి నిద్ర రాత్రితో ఏకమయ్యేది. మళ్ళీ సూర్యోదయానికి ప్రశాంతంగా మేలుకోవచ్చు"

"నేనేమైనా కుంభకర్ణుని వారసుడ్నా !" అన్నాడు మోహన్‌కుమార్ తల నిలువుగా ఆడిస్తూ.

కిలకిలా నవ్వింది ఉమాశశి.

"లాటరీలో అదృష్టం తన్నుకు వచ్చినట్టు అకస్మాత్తుగా వూడిపడ్డావే"

"ఆ అదృష్టాన్ని పరీక్షించడానికే"

"ఏ అదృష్టం!" – కనుబొమలు ముడిచి రెప్పలార్పుతూ మోహన్‌కుమార్ భార్యకేసి చూశాడు. అమరేశ్వరి చెల్లెలి మాటలోని అంతరార్థం అవగాహనకాక అయోమయంగా ఉమాశశికేసి చూసింది.

నోరు జారిన తొందరపాటును సత్వరం ఉమాశశి గ్రహించింది.

"సంక్రాంతి సెలవులు కదూ, ఓవారం రోజులపాటు ఇక్కడ కొండలలో, రాళ్ళలో ప్రశాంతమైన వాతావరణంలో కాలక్షేపం చేద్దామని వొచ్చాను. మళ్ళీ ఒక్కసారి [illegible], నాగార్జునకొండ మ్యూజియమూ, ఎత్తిపోతల జలపాతమూ చుట్టి రావాలని వుంది. చరిత్ర ప్రసిద్ధమైన స్థలాలనూ, ప్రకృతి రమణీయకతను ప్రకటించే ప్రదేశాలనూ, దేశాభ్యుదయం కోసం నిర్విరామంగా జరిగే కృషినీ – ఎన్నిసార్లు చూస్తే హృదయం సంతృప్తి పడుతుంది!"

"ఈ నాగార్జున సాగర్ నిన్నంతగా ఆకర్షించిందన్నమాట" అన్నాడు మోహన్‌కుమార్ కనుబొమలు సాశ్చర్యంగా ఎగురవేస్తూ.

అవునన్నట్టు తల మృదువుగా ఆడించింది ఉమాశశి.

స్నానం చేసి డ్రస్సు వేసికొని కారులో బయటకు వెళ్ళాడు మోహన్‌కుమార్.

ఆ సాయంత్రమే డాక్టరు కరుణానిధిని కల్సికోవాలనుకున్నది ఉమాశశి ఆ వుద్దేశ్యంతోనే కనుచీకటి పడకముందే ముస్తాబై "అక్కా! ఓ అరగంటసేపు ఒక్కదాన్నే అలా వాహ్యాళికి వెళ్ళివస్తాను" అన్నది.

"త్వరగా రా, చీకటిపడకముందే" అన్నది అమరేశ్వరి.

"అలాగే" అంటూ ఉమాశశి నేరుగా హాస్పటల్‌కు వొచ్చింది.

సూర్యుడు నిద్ధకంగా అస్తమిస్తున్నాడు. సాయంత్రపు నీడలు సంపూర్ణంగా పరుచుకున్నాయి. కృష్ణానదీ తీరం నుంచి చల్లని గాలి చక్కగా వీస్తోంది.

డాక్టరు కరుణానిధి, కాంపౌండరు జగన్నాధరావూ కొత్తగా కట్టే బిల్డింగు దగ్గర వున్నారు. ఏవో మాట్లాడు కుంటున్నారు. ఇటుకరాతి రంగు ధర్మవరం పట్టుచీర, అదే రంగు పట్టుజాకెట్టూ ధరించి, మెడచుట్టూ రాళ్ళ నెక్‌లెస్ మెరుస్తూండగా మెత్తని అందమైన సంధ్యాకాంతిలో సౌందర్య దేవత నడిచి వస్తూన్నట్టు వస్తోన్న ఉమాశశిని అంతదూరంలోనే చూశాడు డాక్టరు కరుణానిధి. అతని హృదయం యెందుకో రెపరెపలాడే కిటికీ తెరలా చప్పుడు చేసింది. ఆమె వుత్తరాలకు తను అశ్రద్ధగా సమాధానా

ల్వలేను. అసలు సగం తన మానాన్ని అర్థంచేసికొని, తన పట్ల అభిలషించిన ప్రేమాభిమానాల్ని చూపలేదేమోనన్న నిర్ణయానికొచ్చి - నిశ్శబ్దంగా అభిప్రాయాల్ని, ఆశల్ని మార్చుకుంటుందేమో అనుకున్నాడు. ఇంత హఠాత్తుగా మళ్ళీ ఎందుకొచ్చింది? తనలో నిరాశామాటంగా మార్పులకి తనను తాను సమీక్షించుకోవటానికా? లేదా వేరే పరిస్థితుల పరంగా రావాల్సి వొచ్చిందా? ఆమె తను నిలబడ్డ స్థలానికే రావటం గమనించి డాక్టరు కరుణానిధి ఆమె కెదురుగా వెళ్ళాడు కాంపౌండు హాస్పటల్లోకి నడిచాడు.

ఉమాశశి ముందుగా నమస్కారం పెట్టింది. ఆ నమస్కారాల్ని చిరునవ్వుద్వారా స్వీకరించి, ప్రతి నమస్కారం పెట్టాడు డాక్టరు కరుణానిధి.

ఇద్దరూ హాస్పటల్లోకి నడుస్తూండగా - "మీరు ఇక్కడే ఉన్నారన్నమాట. ఏమైనా మీరు ట్రాన్స్ఫర్ అయ్యారేమోననుకున్నాను." అన్నది ఉమాశశి.

"నన్ను అంత సులభంగా ట్రాన్స్ఫర్ చేయరు, నేను కావాలని కోరుకుంటే తప్ప-"

ఇద్దరూ కన్సల్టింగ్ రూములో కూర్చున్నారు.

ఆకాశపు అంచులు ఉదారంగు దుస్తులు ధరించగా మునిమాపు నిశ్శబ్దంగా వాలింది

అటెండరు గదిలో లైటు వేశాడు. ట్యూబు లైటు కాంతి గదిని తెల్లదనంతో నింపివేసింది.

ఇరువురి మధ్యా నిశ్శబ్దం చూపుల్ని మార్చుకుంటోంది

మనస్సు ఖాళీ అగ్గిపెట్టె కాగా డాక్టరు కరుణానిధి ఆమెకేసి కొన్ని క్షణాలపాటు చూడాలనే ఆసక్తి లేకుండా చూశాడు. 'ఉమాశశి సహజమైన సౌందర్యవతి' అన్న భావం ఠక్కున అగ్గిపుల్ల వెలిగించినట్టుగా అతని మనస్సులో మెరిసింది. పాలపై నురుగువలె వయస్సుతో పెరిగిన సౌందర్యం కాదు ఆమెది. వేసవికాలపు ఉదయకాంతి వంటి ఆమె శరీర ఛాయా, శిల్పకళా కోవిదుల స్వప్నాలలో సంచరించే అపురూప సౌందర్యలలామ ముఖవర్చస్సులాంటి ముఖవర్చస్సూ, పులకరింతల్ని కలిగించే వెలుగుల్ని ప్రసరించే విశాల విసీల నేత్రాలూ, మల్లెమొగ్గలా కొనదేరిన ముక్కూ, తెల్లగులాబి రేకుల పేశలత్వాన్ని స్ఫురణకు తెచ్చే అందమైన పెదాలూ, వలపు సోయగానికి అద్దాలుగా నిలిచిన చెక్కిళ్ళూ, గుండ్రటి కంఠమూ, తీర్చిదిద్దిన తలకట్టూ, పైట చాటున జాకెట్టు బిగింపులో సిగ్గుతో ముడుచుకున్న కలువ పువ్వుల్లా వున్న రొమ్ములూ - ఎంతటి మగవాని హృదయంలోనైనా చలనాన్ని కలిగించక పోవు. అయినా తను ఉమాశశి సౌందర్యాన్ని అంతయిదిగా పరిశీలించడమేమిటి? ఆమె అందాన్ని తను శంకించడం లేదు. ఆమె తనపై కనబరుస్తోన్న ఇంటరెస్టును మరోవిధంగా భావించడంలేదు. ఆమెపై తన కెలాంటి ద్వేషభావమూ, జుగుప్సా, అయిష్టతా లేవు. కాని అంతమాత్రం చేత తన హృదయంలో ఆమెకు స్థానాన్ని కల్పించగలడా? ఆమెను

తన మనస్సులో నిల్పుకోగలడా? ఆత్మసాక్షిగా ఆరాధించ గలడా? జీవితంలో భాగస్వామినిగా చేసికొని, జీవిత మాధుర్యాన్ని చవి చూడగలడా?

మళ్ళీ తను ఎండమావుల్లాంటి ఆలోచనలల్లోనై, పాత గాయాల్ని కుళ్ళగించుకుంటున్నాడు హృదయంలో ఒక స్త్రీ కోసం బంగారు సౌధాన్ని నిర్మించటమూ, ఆ సౌధంలో ఆ మూర్తిని ప్రతిష్ఠాపనచేసి ఆరాధించడమూ, ఆ ఆరాధన విలువల్ని సాధించలేకపోవటమూ, విధి కన్నెర్ర జేయడమూ, నిరాశా, నిస్పృహా, మళ్ళీ జీవితాన్ని గురించి విశ్వాసాలను కుదుర్చుకోవడమూ, ప్రశాంతమైన సౌఖ్యాన్ని పొందాలనే లాలసా – ఇల్లాంటి ఒడుదుడుకులతో తన బ్రతుకు దొర్లి పోతూన్నది.

ఈ పరిస్థితుల్లో ఉమాశశి తలుపులు తెరుచుకొని తన బ్రతుకులో ప్రవేశించ ఉత్సాహపడటం విచిత్రం. తన బ్రతుకు చూడటానికి మైదాన దశలో ప్రశాంతంగా ప్రవహించే నది వలె వున్నప్పటికీ – ఆ ప్రవాహపు అంతర్భాగాన ఆరాచకపు వెల్లువలు పొర్లాడుతున్నాయని ఆమెకు తెలియదు. ముఖం ఎప్పుడూ మనస్సుకు అద్దంకాదు. మనస్సు వుత్పత్తిచేసే భావాలకు, మస్తిష్కపు పరిశోధనాగారంలో తయారయ్యే వస్తువులకు–ముఖం ప్రతిబింబమని అందరివిషయంలో అనుకోవడం, పొరబాటే. పెదాలు దరహాసాన్ని జారవిడిస్తే, చూపులు ప్రశాంతతను ప్రకటిస్తే – మనస్సు సంతోషంగా వుందనీ, ఏ కల్లోలానికి తావులేదని గ్రహించడం సమంజసంకాదు. తను

నిష్కల్మషంగా, నిర్మలంగా నవ్వుతూవుంటాడు; తనచూపులు, తన బ్రతుకు శాంతినివాసం అన్న విషయాన్ని వ్యక్తీకరిస్తాయి.

కాని తన మానసిక స్థితి నడి సంద్రంలో తుఫానుకు దారుణంగా గురియైన నావ స్థితిని గుర్తుకు తెస్తుంది నావ బయలుదేరేప్పుడు – సముద్రపు వాతావరణం సుముఖంగానే వుండొచ్చు. సుఖమైన ప్రయాణాన్ని సూచించవచ్చు కాని కుట్ర పన్నినట్టు మధ్యన వచ్చిపడే తుఫానుకు నావ అమాయకంగా గురికావాల్సిందేగా! తను ... ఆమెను కాలేజీలో ప్రేమించినప్పుడు వాతావరణ పరిస్థితులు సుముఖంగానే ఉన్నాయి. అవి ఆదర్శ ప్రేమనూ, పవిత్రమైన దాంపత్యాన్నీ, సుఖప్రదమైన భవిష్యత్తునూ సూచించాయి. కాని పగబట్టినట్టు కొన్ని పరిస్థితులు నాలుకలు సాచుకొని తమను కాటువేశాయి. తమ ప్రేమ హృదయాలలో కూలిన ఆశాసౌధపు తాలూకు పాడుపడిన గోడలవలె మిగిలిపోయింది. పునాదులు లేకలని ఆ గోడలపై మళ్ళీ తనకు సౌధాన్ని నిర్మించటం సాధ్యమౌతుందా? ఆమె జీవితాన్ని ఒక కొత్త వ్యక్తి ఆక్రమించుకున్నాడు. అందుకు ఆమె తల్లిదండ్రులు సంపూర్ణంగా బాధ్యులు. వాళ్ళు తమ కన్నకూతురిపై ఎంత అధికారాన్ని చెలాయించవచ్చో పరీక్షకుపెట్టి నెగ్గామని సంతృప్తిపడ్డారు గానీ – తమ కూతురికి ఓ హృదయం ఉన్నదనీ, ఆ హృదయాన్ని తన బ్రతుకు పంటను వినియోగించుకుంటుందనీ.

ఆమె కాపాడ్డానికి గలదనీ, తమజోక్యం అధికారప్రపృత్తిలాగ తొందరపాటూ ఆమె హృదయాన్ని గాయపరుస్తుందనీ ఆలోచించలేను.

ఈ లోకంలో చాలమంది స్త్రీలకుమల్లే ఆమెకూడా తన జీవిత విధానాన్ని నిర్ణయించుకోడంలోనూ, జీవితయాత్రలో వెలుగులుచూపే వ్యక్తిని ఎన్నుకోవడంలోనూ స్వతంత్రత లేకపోయింది. మూగగా కన్నీరుకారుస్తూ విధికి కట్టుబడిపోయింది. కాని తను ఆమెను మనోవీధిలోంచి తొలగించుకోలేకపోతున్నాడు. తనామెను గాఢంగా ప్రేమించాడు. ఆమెతో జీవిత సౌఖ్యాన్నిగూర్చి మధురమైన కలలుగన్నాడు. ఆశయాల్ని, ఆదర్శాల్ని ఏకంచేసికొని, ఆచరణల ద్వారా జీవితపు విలువల్ని గట్టిపర్చుకొనేందుకు పరస్పర ప్రమాణాల్ని చేసికున్నారు. కాని ఏం ప్రయోజనం? ప్రేమికులపట్ల భగవంతునికిగల పక్షపాతమో, పగో, ఆగ్రహమో ఏమోగాని - గాఢంగా ప్రేమించుకొని, ఆ ప్రేమబలంతో జీవితాన్ని సార్థకపర్చుకుందామనుకున్న ప్రేమికులకు అవరోధాల్ని కల్పిస్తూ పరిస్థితుల్ని గడ్డుపరుస్తూ, జీవితాల్ని విషాదవలయంలోకి నెట్టి ఆనందిస్తూంటాడు భగవంతుడు. భగవంతుని వినోదానికి తాముగూడా బలియైనారు

ఆమె ఎవర్ని వివాహమాడిందో, ఎక్కడ వుంటూన్నదో, ఎలా బతుకును గడుపుతూన్నదో, తను ప్రేమను మర్చిపోయిందో - తనకి తెలీదు. కాని తను ఆమెను మర్చి

పో లేదు. ఆమె రూపు మానస్సులో అహర్నిశమూ ఆరనిదీపం వలె వెలుగుతూనే వుంటుంది. ఆమె అందంలోనూ ఉమాశశి అందంలోనూ తేడావుంది. ఆమె అందం మృదువైనది. ఉమాశశి అందం కరుకైనది. ఆమె అందంలో భౌతికమైన ఆకర్షణ తక్కువ ఆత్మసౌందర్యం జాస్తి ఉమాశశిలో భౌతిక ఆకర్షణ ఎక్కువ. ఆత్మసౌందర్యాన్ని తను అంతగా గుర్తించ లేదు. ఆమె మితభాషిణి. తనమనస్సుతో ఎక్కువ మాట్లాడు కుంటుంది. ఉమాశశి స్వేచ్ఛగా మాటాడుతుంది. మనస్సులోని భావాల్ని మాటలద్వారా వ్యక్తపరుస్తూ వుంటుంది. ఏమైనా ఆమె శాశ్వతంగా దూరమైనట్లే! పెళ్ళిచేసికొని భర్తతో యెక్కడో కాపురంచేస్తూన్న ఆమెను హృదయంలో తను ఇంకా పూజిస్తూ వుంచటంవల్ల ప్రయోజన మేముంది? సంసారమూ సాంఘికవ్యవస్థా ఆమెచుట్టూ గోడలుగా కాపలా కాస్తుండగా విధి పైకప్పుపై తిష్ఠవేసికొని వీక్షిస్తున్నది. వివాహబంధం ఆమెకు జీవితఖైదు విధించింది. ఆఖైదునుంచి ఆమె విడుదలకాదు విడుదలకాని ఆమె కోసం - ఇంకా తను కనిపెట్టుకొని వుండటం అవివేకం కాదూ! కావచ్చు. ఇతర్ల దృష్టిలో అది అవివేకమూ, పిచ్చిదనమూ, మూర్ఖత్వమూ కావచ్చు కాని తన హృదయం అలా భావించుటలేదు. తన అంతర్మనస్సులో ఆమె మహారాణిగానే ప్రకాశిస్తున్నది. ఆ ప్రకాశంలో తనకి ఏ యువతీ దృగ్గోచరం కావడంలేదు. చివరకి ఉమాశశికూడా!

మనస్సు మబ్బు పట్టిన సంజె ప్రొద్దుకాగా ఆలోచనా

అశాంతిలో అల్లల్లాడుతూన్న డాక్టరుకేసి చూస్తూ కూర్చొంది ఉదయాశశి. వర్షించని మేఘాలు తిరుగాడుతూన్నట్టు ఆమెలో కూడా ఆలోచనలు బరువుగా తిరుగాడుతున్నాయి డాక్టరు గారు ఇంత యిదిగా ఆలోచిస్తున్నారు దేనిని గురించో! తన రాకలోని ఆంతర్యాన్ని పసిగట్టి ఎట్లా సమాధానం చెప్పాలనా! తనమీద సదభిప్రాయం లేదా? తనతో నిర్మొహమాటంగా మాట్లాడటానికి సంకోచిస్తున్నారా? మనస్సులో ఉన్నదున్నట్టు మాట్లాడితే తను నొచ్చుకుంటుందని భయపడుతున్నారా? తన ఎదుటే ఆయన గారింత సీరియస్‌గా ఆలోచించాల్సిన అగత్యమేముంది? తన ఉత్తరాలు ఆయనగారిలో ఆలోచనల్ని కలిగించలేదా! తనని గురించి, తన లేఖల్ని గురించి, ఏం మాట్లాడవల్సిందీ, ఏం చేయవల్సిందీ, ఇప్పుడు ఆలోచించుకొంటున్నారా? తను ఆయనగారికి సమస్యగా ఏర్పడిన స్థితి వొచ్చిందా!... అంతకుముందే డాక్టరుగారు ఎవర్నయినా ప్రేమించారేమో! తను తొందరపడి ఆయన గారికోసం ప్రాకులాతున్నదేమో! ఏ స్త్రీయైనా ఆయన హృదయంలో చోటు చేసికుంటే, ఆ విషయం తనకు వ్రాయవచ్చుగా! లేదా, ఇప్పుడు చెప్పవచ్చుగా! సందేహించాల్సిన అవసరమేముంది? ఆ ప్రేమలో డాక్టరుగారు విఫలులైనారా? ఆ భగ్నప్రేమతో బాధపడుతున్నారా? ఆ స్థానంలో తను తల దూర్చటానికి ప్రయత్నిస్తూన్నదా? తనదితప్పా, తొందరపాటూ ఏమున్నాయి? ఒక ఉద్యోగానికి దరఖాస్తు పెట్టుకుంటే ఆ ఉద్యోగాన్ని ఇవ్వటమూ, ఇవ్వకపోవటమూ - అధికారి

పైన ఆధారపడివుంటుది. అల్లాగే డాక్టరుగారి ప్రేమ... రాగాలకోసం తను దరఖాస్తు పెట్టుకుంది.. తన అర్హత... తెలియబచ్చింది తన దరఖాస్తును పరీక్షించి, అంగీకరించటమూ, అంగీకరించక పోవటమూ తెలియజేయడం ఆయనగారి ధర్మం ఇలాంటి సున్నితమైన విషయాలలో విలంబన జరిగినకొంచిక్కీ అపోహాలకూ, అపార్థాలకూ ఆస్కారాలు జాస్తియై మానసిక కల్లోలాలకు దారితీయటం జరుగుతుంది. ఆ మాత్రం డాక్టరుగారికి తెలియకపోదు. తన హృదయంతో చెలగాటమాడటం ఆయనగారికి సరదా కాకపోవచ్చు.

"మీారు రెండు ఉత్తరాలు వ్రాశాను. చేరాయా?" అన్నది ఉమాశశి సంభాషణ మొదలెడుతూ.

ఆమె సూటిగా అసలు విషయానికి రాగా - డాక్టరు కరుణానిధి కొంత తడబడ్డాడు.

"అవును."

"సమాధానం ఇవ్వాల్సిన అగత్యం లేదనుకున్నారా?"

అతని పెదవులపై ఓరకమైన నిర్లక్ష్యం - ముఖంలో తెచ్చిపెట్టుకున్న చిరునవ్వులాగా మారింది.

"ఎందుకు లేదు ! అయినా ఆ విషయం తేల్చుకోనేందుకే మళ్ళీ మీారు రాలేదనుకుంటాను."

—సరీగ్గా ఆ సమయంలోనే స్ప్రింగు డోర్సు తెరుచుకొని అసిస్టెంటు ఇంజనీరు మోహన్‌కుమార్ గదిలోకి హఠాత్తుగా వచ్చాడు డాక్టరుగారూ, మరదలు ఉమాశశి మాటాడుకొంటూ వుండటం అతనికి విపరీతమైన ఆశ్చర్యం వేసింది.

ఆ ఆశ్చర్యాన్ని సుస్పష్టంగా కనుబొమల్ని కదిలించడంలో ప్రకటించాడు.

"రండి! ఇంజనీరుగారూ! - కూర్చోండి" అన్నాడు డాక్టరు సహృదయంతో ఆహ్వానిస్తోన్న స్వరంతో.

మోహన్‌కుమార్, ఉమాశశి ఒకళ్ళనొకళ్ళు సాశ్చర్యంగా చూచుకున్నారు. వారి చూపుల్ని డాక్టరు కరుణానిధి గమనించాడు. ఒకళ్ళ కొకళ్ళు తెలుసుకామోసు ననుకున్నాడు.

"మీరేదో మాటాడుకుంటూంటే చొరవగా జొరబడ్డాను. అన్యథా భావించరనుకుంటాను" క్షమార్పణ చెప్పుకొనే విషయంతో అన్నాడు మోహన్‌కుమార్ డాక్టరు గారికేసి.

"అబ్బే! ఏమీ లేదంటి..." అన్నాడు డాక్టరు కరుణానిధి.

వాడిన తెల్లగులాబీలైయింది ఉమాశశి ముఖం.

"ఈమెగారు ఎవరో తెల్సికోవచ్చా!" అన్నాడు మోహన్‌కుమార్ క్రొత్తగా పరిచయం చేసికోవాలన్న కుతూహలాన్ని నటిస్తూ.

అరికాలిలో ముల్లుగుచ్చుకున్నట్లుగా వుంది ఉమాశశికి బావగారి నటింపు.

డాక్టరు కరుణానిధి పరిచయం చేయడానికి ఉపక్రమించబోతూ వుండగా——

"మీరెవరో తెల్సికోవచ్చా! ఎక్కడో చూచినట్లు గుర్తు" అన్నది ఉమాశశి బావగారి కేసి తలెత్తి చూస్తూ.

మోహన్‌కుమార్ క్షణంలో సగంసేపు కంగుతిని, పెద్ద మనిషి ముందు వృధాగా నటించటం దేనికని -

"మీ అక్కయ్య మొగుడ్ని" అన్నాడు ఆపుకోలేని నవ్వుతో.

డాక్టరు కరుణానిధి అర్ధంకాక అయోమయంగా చూశాడు మోహన్‌కుమార్ కేసి.

"అయితే నన్ను తెలుసుకున్నారన్నమాట! సంతోషం" అన్నది ఉమాశశి వెటకారంగా,

"ఈమె మా మరదలే లెండి. ఏదో 'జోక్ గా పరిచయం కోరాను డాక్టరు గారూ! మీ కెన్నాళ్ళ నుంచీ తెలుసు ఉమాశశి" అన్నాడు మోహన్‌కుమార్.

"ఈమధ్యనేలెండి. ఒక చిన్నకారు యాక్సిడెంటులో పరిచయమైంది. మా హాస్పటల్ ముందే - ఈమె కారు డ్రైవ్ చేస్తూంటే దురదృష్టవశాన ఓ కుర్రవాడు పడ్డాడు. పెద్ద దెబ్బలు తగల్లేదనుకోండి ఆ కుర్రాడ్ని హాస్పటల్‌లో చేర్పించి, గాయాలు నయమయ్యేవరకూ వస్తూ పోతూండేది. తర్వాత అప్పుడప్పుడూ కాలక్షేపపు కబుర్లకోసం వస్తూ వుంటుంది" అన్నాడు డాక్టరు.

కదిలిన మేఘంలా నిట్టూర్చింది ఉమాశశి.

"మా మరదలు పిల్ల కబుర్ల పుట్టలెండి. చెప్పింది చెప్పకుండా - కాలాన్ని వేగంగా దొర్లించగలదు వయస్సూ

అనుభవమూ తక్కువైనా - లోకజ్ఞానం ఎక్కువ. జనరల్ బుక్స్ చదవటంద్వారా వయస్సుకు మించిన లోకజ్ఞతను సంపాదించింది పైపెచ్చు మధుర గాయని. కమ్మగా పాడుతుంది. భావగీతాలు, పల్లెపదాలు, అష్టపదులూ, త్యాగరాజ కీర్తనలూ, సినిమా పాటలు - ఏం పాడమన్నా శ్రావ్యంగా, మనస్సు గాలిలో తేలిపోయేట్టూ, పగలే వెన్నెల కాసినట్టూ పాడుతుంది. మీరామె పాట వినదల్చుకుంటే - తల్చుకోవట మేమిటి? తప్పకుండా విని తీరవల్సిందే? కాబట్టి రేపటి ఆదివారం భోజనానికి మిమ్మల్ని మా ఇంటికి ఆహ్వానిస్తున్నాను. తప్పక రావాలి మీరు" అన్నాడు మోహన్ కుమార్ ఉసిగొల్పే ఉత్సాహంతో.

"ఆఁ! ఇప్పుడొద్దులెండి. ఏదైనా అవకాశం వచ్చినప్పుడు ఉమాశశి పాట వింటానులెండి" అన్నాడు డాక్టరు భోజనానికి రావటానికి అయిష్టతను చూపుతూ.

"మీరు అట్లా అంటే వీలులేదు. రేపు ఆదివారం మా ఇంటికి లంచ్‌కి రావాల్సిందే. మా మరదలు పాట వినవల్సిందే పాట వినటానికి కూడా అవకాశం రావాలా! ఎప్పుడు వినదల్చుకుంటే అప్పుడే అవకాశాన్ని కల్పించుకోవచ్చు. మీరు అభ్యంతరం చెబితే నా మనసెంతో నొచ్చుకుంటుంది."

"కాదులెండి—"

"నా పాటకోసం కాకపోయినా మా బావగారు అంత యిదిగా అడుగుతూంటే, మీరు కాదనడం సబబుగాలేదు.

మీరొచ్చి తీరాల్సిందే" ఉమాశశి కూడా గట్టిగా పట్టు పట్టింది.

కొంచెం సేపటి వరకూ డాక్టరు కరుణానిధి ఒప్పుకో లేదు గానీ, ఆ ఇద్దరి పట్టుదలవల్ల చివరకు ఒప్పుకోక తప్ప లేదు. ఆదివారంనాడు పగలు పదకొండున్నర గంటలకు తనే డాక్టరుగారి దగ్గరకు వస్తానన్నాడు మోహన్‌కుమార్.

ఆ తర్వాత మోహన్‌కుమార్ డాక్టరుగారితో హాస్పటల్ ఎక్స్‌టెన్షన్ బిల్డింగ్సునుగురించి మాట్లాడసాగాడు. ఆ సంభాషణలో తను పాల్గొనే అవకాశంలేక, బయట చీకటి చిక్కబడగా - డాక్టరుగారికి నమస్కారం పెట్టి ఇంటి కొచ్చింది ఉమాశశి.

వంటపని పూర్తికాగా అమరేశ్వరి వరండాలో చెల్లెలి కోసం ఎదురు చూస్తో పచార్లుచేస్తోంది. వెన్నెల వెలుగు లాంటి సంతోషం మనస్సులో మెరుస్తూండగా ఉమాశశి పురవడిగా అక్కయ్య దగ్గర కొచ్చి - "అక్కా! ఆదివారం నాడు పగలు పన్నెండు గంటలకు ఒక మహావ్యక్తి మనింటికి భోజనానికి వస్తున్నాడు. ఎవ్వరో చెప్పుకో" అన్నది.

"ఎక్కణ్నుంచి వొస్తున్నాడు?"

"ఇక్కణ్నుంచే!"

"ఎవరు? బావగారి స్నేహితుడా?"

అవునని తల ఆడిస్తూ "పేరు చెప్పు" అన్నది ఉమాశశి నొక్కి పలుకుతూ.

"ఏమో! మీ బావగారి స్నేహితుల పేర్లు నాకేం తెల్సు? ఇక్కడ ఆయనగారికి ఎవరు, ఎలా స్నేహితులో నాకు తెలియదే. మనింటికి ఎవ్వరూ వచ్చినట్టుకూడా లేదు"

"డాక్టరు కరుణానిధి కారు."

అమరేశ్వరి గుండె ఒక్కసారి ఝుల్లుమన్నది - తలపై ఇనుపదూలం వాలినట్టుగా. కాని ఆ నిర్ఘాతపోవడాన్ని తేలిగ్గా ముఖంలో కనబర్చలేదు. కొన్నిక్షణాల తర్వాత—

"ఆ డాక్టరుగారు నీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

డాక్టరుతో తనకు కలిగిన పరిచయాన్ని గురించి క్లుప్తంగా చెప్పింది ఉమాశశి. ఆపైన తను అప్పుడప్పుడూ కాలక్షేపంకోసం హాస్పటల్‌కు వెళుతూన్నట్టుకూడా దాచకుండా చెప్పింది.

"డాక్టరుగారు చాల మంచివారక్కా! ఆయన్ని చూస్తోంటే, ఆయనతో మాటాడుతూంటే - అనిర్వచనీయమైన అనుభూతి ఏదో మన మనస్సును నింపివేస్తుంది. ఆ అనుభూతి మత్తులో మనల్ని మనం మర్చిపోగల పతాక స్థాయికి చేరుకుంటాం. మనిషి రూపుకూడా మనోహరంగా వుంటుంది; ఆయన ఆశయాలు కూడా మహత్తరమైనవి. లోకంలో అలాంటి మనుషులుండటం బహు అరుదు' అన్నది ఉమాశశి డాక్టరు రూపం మనస్సులో మధుర స్మృతివలె మెసలగా.

చెల్లెలికేసి అమరేశ్వరి ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో చూసింది.

౭

ఆదివారంరోజు తెల్లవారు ఝామున అందరికంటె ముందుగా నిద్ర లేచింది ఉమాశశి. ఆ రాత్రి ఆమె సరిగ్గా నిద్ర బోలేదు - ఎప్పుడు తెల్లవారుతుందా అన్న వ్యాపకంతో. తీరా నిద్రలేచాక తనేమి చేయాలా అన్న ప్రశ్న ఎదురైంది. అక్కయ్యను నిద్ర మేల్కొలిపింది. అమరేశ్వరి అంతకుముందే నిద్రలేచిందిగానీ - ఆలోచిస్తూ కళ్ళు మూసుకుంది. గత రెండు రోజులుగా ఆమె మనస్సు మరీ బావుండలేదు. పాత జ్ఞాపకాలు ఆమె మనస్సులో తీవ్రమైన సంచలనాన్ని కలిగిస్తున్నాయి. గత జీవితంలోని కొన్ని సంఘటనలు - తలలెత్తి, కోరలు చాచుకొని భయపెట్టసాగాయి. తనను తానే సంబాళించుకొని, ధైర్యం చెప్పుకోలేక పోతూన్నది. డాక్టరు కరుణానిధి ఆదివారం నాడు తమ ఇంటికి భోజనానికి వస్తున్నాడు అని తెల్సినన్న దగ్గర్నుంచీ ఆమె మనస్సులో తుఫాను వాతావరణం ప్రవేశించింది.

ఆదివారం వచ్చేసరికి ఆ తుఫాను భూమ్యాకాశాల్ని ఏకం చేసినంత భీకరాకృతిని దాల్చి క్షణ క్షణమూ తల్లడిల్లి

పోతున్నది. మధ్యలో తుఫాను తెరిపి యిచ్చినట్టు - ఆమెలో సందేహాలు. తను మెడికల్ కాలేజీలో ప్రేమించిన కరుణానిధి, యీ డాక్టరు కరుణానిధి ఒకరేనా? ఈ డాక్టర్ని తను చూడలేదు. ఆ పేరుగల వాళ్ళు దేశంలో యెంతోమంది వుండవచ్చు. మనిషిని చూడనిదే తనింతగా భయపడటం దేనికీ? ఒకవేళ యీయనే తను ప్రేమించిన కరుణానిధి నైతే మటుకు కల్లాల పడాల్సిన అగత్య మేముంది? తాము కాలేజీలో సహజంగా ప్రేమించుకున్నారు వివాహం చేసికొని ఆ ప్రేమానురాగాలకు జీవితాల్లో విలువనిచ్చి జన్మ సార్థకతను పొందుదామని కలలుగన్నారు. కాని అట్లా జర్గలేదు. తన తల్లిదండ్రుల పట్టుదలవల్ల; వాళ్ళ నెదిరించి జీవితంలో స్వతంత్రమైన మార్గం వెదుక్కునే శక్తి, ధైర్యమూ తనకి లేకపోవడంవల్ల తమ వివాహం జరుగలేదు. తను మెడిసిన్ చదవటం కూడా మానివేసింది. తమ ఇద్దరి మధ్యా విధి ఒక పెద్ద అగాధాన్ని ఏర్పరచింది. ఒకవొడ్డున తనూ, మరొక వొడ్డున కరుణానిధీ. మధ్యలో కాలమూ, సమాజమూ, విధీ ఈ అగాధం శాశ్వతమైంది. కాని తాత్కాలికమైంది కాదు. ఈ అగాధాన్ని అధిగమించే ఆలోచన తనకు లేదు తను ఆ ఒడ్డునే జీవితంలో పాత్రను నిర్వహించాలని భగవంతుడు వ్రాసిపెట్టాడు. ఆ ఒడ్డున కొండలున్నా అరణ్యాలున్నా. అహర్నిశమూ చీకటి మిసమిసలాడుతున్నా తను జీవిత యాత్రను సాగించవల్సిందే. తను ఇంకా డాక్టరు కరుణానిధినిగూర్చి భయపడటంలో అర్థంలేదు. తామిద్దరిమధ్య

వున్న అగాధాన్ని తాను అధిగమించలేకపోతే - డాక్టరు కరుణానిధి ధైర్య సాహసాలతో అధిగమించి ఆ ఒడ్డు నుంచి యీ వొడ్డుకు వస్తాడని భయమా? అప్పటికీ తనెందుకు భయపడాలి? ప్రతివ్యక్తి బ్రతుకుచుట్టూ కొన్ని సరిహద్దు లుంటాయి. కొన్ని సహజంగా ఏర్పడతాయి. మరికొన్ని సా[illegible] కట్టుబాట్లవల్లనూ పొసరాల ఒత్తిడివల్లనూ ఏర్పడ తాయి. ఆత్మసంస్కారంతో ప్రాథమిక ధర్మాల పట్ల గౌర వంతో; భగవద్భీతితో ఏర్పర్చుకొనే సరిహద్దులు కూడా వుంటాయి ఆ పరిహద్దుల్ని అతిక్రమించి జీవితంలో కోరిన విలువల్ని సాధించుకుందామని అవివేకంగా మొండిపట్టులతో ప్రవర్తిస్తే ఆ వ్యక్తిని సంఘం క్షమించదు. కరుణానిధి అలాంటి సాహసానికి అవివేకంగా దిగుతాడా!... తన భయానికి అర్థం లేదు.

ఒకప్పుడు తనూ కరుణానిధి పరస్పరం ప్రేమించుకున్న విషయం - ఆయనగారికి తెలియకపోవచ్చు. తెలియకపోతేనే తన బ్రతుకు యింత అధ్వాన్నంగావుంది; తెలిస్తే - ఇంకా తనని సాధించరూ! జీవితంలో హెచ్చరిక లేకుండా జరిగే సంఘటన లెలాంటివో, వివాహాలు కూడా అంతే! ఫలానా యువతీ, ఫలానా యువకుడూ వైవాహిక బంధంద్వారా సంసార సాగరంలో ఒకేనౌకపై ప్రయాణిస్తారనేది భగవంతు నికి తప్ప ఎవరికి తెలుసు! ప్రేమించుకొని పెళ్ళి చేసికుందా మనుకున్న ప్రేమికులకు వివాహం సాధ్యపడకపోవచ్చు-అనేక రకమైన కారణాలవల్ల ఆ యువతి మరో యువకుణ్ణి పెళ్ళి

చేసికోవచ్చు; ఆ యువకుడు మరో యువతిని పెళ్ళి చేసికోవచ్చు. అల్లాంటి పరిస్థితుల్లో ఆ నలుగురూ సహృదయంతో జీవన సామరస్యంకోసం పాటుబడటం సబబుగానీ - పాత ప్రేమల్ని తుళ్ళగించుకుంటూ వర్తమానాన్ని కలుషితం చేసికొని, భవిష్యత్తుపై నిరాశావాదపు గోతుల్ని త్రవ్వుకోవడం సమంజసమా! పెళ్ళికి ముందు భార్య మనస్సు ఇంకో యువకునిపై లగ్నమైందని తెల్సుకున్న భర్త - ఆమె గత జీవితాన్ని సహృదయంతో అర్థం చేసికొని క్షమించ గలిగితే చిక్కులు రావు అలాంటి సహృదయతా, అర్థంచేసుకోగల సహనమూ క్షమించే ఆర్ద్రితా ఎంతమందికున్నవి? ఆయనగారికున్నవా? ఏమో! అందుకే తను భయపడటం? పెళ్ళికి ముందు మగవాడు ఎంతమంది స్త్రీలను ప్రేమించినా, ఎంతమంది స్త్రీలతో అక్రమ సంబంధమున్నా ఎంత అవినీతి చరిత్ర సృష్టించినా - వివాహంతో క్రొత్త నీరు పాత నీరును తుడిచిపెట్టుకు పోయినట్టు తుడిచిపెట్టుకుపోతాయి. సంఘం ఆ మగవాడికి ఆమోద ముద్ర వేస్తుంది అతని వ్యక్తిత్వంలో అంతర్లీనమైన చెడును లక్ష్యపెట్టదు. మామూలు గౌరవమర్యాదల్ని యిస్తుంది. కాని స్త్రీ విషయంలో సంఘపు దృక్పథం అట్లా వుండదు. స్త్రీ విషయంలో సంఘానికి ప్రత్యేకమైన నీతి సూత్రాలూ, కట్టుబాట్లూ, పాక్షికదృష్టీ, నిర్దయతా, నిర్మోహమాటమూ, అణగద్రొక్కే తత్త్వమూ ఉన్నాయి. ఆయనగారు స్త్రీ విషయంలో యీ సమాజానికి అతీతుడు కాదు.

ఈ సామాజిక వ్యవస్థకు వివాహ ధర్మం పునాది లాంటిది. ఒకళ్ళనొకళ్ళు అర్థంచేసుకొని గాఢంగా ప్రేమించు కొని భవిష్యత్తును గూర్చి బ్రహ్మాండంగా కలలుగన్నంత మాత్రాన-జీవితాలకు పరిపూర్ణత చిక్కదు. నీటి బుడగలతో అనుకున్నట్టే! పెళ్ళికి ముందు పొటమరించిన ప్రేమలకూ, అభిమానాలకూ, అనురాగాలకూ వివాహమే సంఘందృష్టిలో అంగీకారం. ఆ అంగీకారపు ముద్రను పొందని ప్రేమికులు జీవితాల్లో సమన్వయం కుదరక, పరిస్థితులతో రాజీ పడలేక-చిక్కులకూ, చీకాకులకూ గురవుతూంటారు. వివాహ ధర్మాన్ని తృణీకరించి వయస్సుతో కోర్కెల్ని కుస్తీ పట్టిస్తూ శరీర సుఖంకోసం స్వేచ్ఛగా అవిసిలిని ఆరాధించేవాళ్ళగతి కూడా అంతే!... అయినా తను కేవలం నీడను చూసి భయపడుతూన్నదేమో! ఈ డాక్టరుని చూడలేదు. అతనిని ఇతనుగా వూహించుకొని - ఇన్ని ఆలోచనలతో మనస్సును పాడుజేసికోవడం దేనికి? ఈ డాక్టరుని ఉమాశశి గాఢంగా ప్రేమిస్తూన్నట్టుంది. అందుకే అంత ఆపేక్షా, అభిమానమూ ఆసక్తి కనబరుస్తోంది. ఒకవేళ ఈ డాక్టరు కరుణానిధీ తను ప్రేమించిన కరుణానిధీ ఒకరేనైతే...!

— అమరేశ్వరి ఆ తెల్లవారుఝామున అలాంటి ఆలోచనలతో వుండగా ఉమాశశి ఏదో మునిగిపోతూన్న ట్టుగా నిద్రలేపింది. అయినా ఆమె విసుక్కోలేదు.

"అక్కా! భోజనానికి ఏమేం పిండి వంటలు తయారు చేయాలి. మన ప్రిపరేషన్స్‌కు అతిథి అదిరిపోవాలి" అన్నది

ఉమాశశి నిద్రమొహంతో అమరేశ్వరి ఎదురుగ్గా కూర్చుని.

క్రితం రాత్రి ప్రొద్దుపోయేవరకూ ఉమాశశి అక్కయ్యతో రేపటిదినం డాక్టరుకి ఏర్పాటు చేయవల్సిన భోజనమూ, అందుకు తయారు చేయవల్సిన రుచ్యమైన పదార్థాలూ, కులాసాకలిగించే కాలక్షేపాన్ని గురించీ చర్చించింది. కాని చర్చవల్ల ఏకాభిప్రాయాలు కుదరలేదు.

"మంచి భోజనంవల్ల మనుషులమీద సదభిప్రాయాలు ఏర్పడతాయా ?" అన్నది అమరేశ్వరి చెల్లెలి ఆదుర్దాను తను అర్థంచేసికోలేని అశక్తతను వ్యంగ్యంగా వ్యక్తపరుస్తూ.

"ఏర్పడకపోవచ్చు కాని ఆహ్వానింపబడిన అతిథికి భోజనం విషయంలో అశ్రద్ధ జరిగితే దురభిప్రాయాలకు అవకాశం కల్పించినట్టు కాదూ ?"

"అశ్రద్ధ జరిపే అవివేకులమా ?"

"కాదనుకో. అయినా ముందుగా జాగ్రత్త పడటం మంచిదిగదా! ఏమో నీ మనస్సెందుకో బావున్నట్టులేదక్కా, అదోరకంగా వుంటున్నావు ఇవాళైనా నువ్వు ఉషారుగా లేకపోతే నా మనస్సెంతో బాధపడుతుంది."

"నువ్వు ఆహ్వానించిన అతిథికి భోజన విషయంలో లోటురానిస్తానా ? నీ ఆదుర్దాని అర్థంచేసికోలేక అట్లా అంటున్నానుగానీ - మన ఇంటి గౌరవమర్యాదల కేమీ ఇబ్బందులు రానివ్వను" అన్నది అమరేశ్వరి పెదాలపైన నవ్వును దొర్లిస్తూ.

మంచుపట్టిన ఉదయంపై సూర్యకిరణాలు పడట్టుగా అయింది ఉమాశశి ముఖం.

మోహన్‌కుమార్ మామూలువేళ్ళకే నిద్రమేల్కొచి లేచాడు. అక్కచెల్లెళ్ళు పిండివంటల హడావుడిలో వుండటం గమనించి, నాలుకపై నీళ్ళను వూరించే కమ్మని వాసనకు వంటగదిలోకి వొచ్చాడు.

"ఇవాళ ఏదైనా పండుగా! తెల్లవారేప్పటికి వంట గదిని పావనం చేస్తున్నారు."

స్టవ్ మీద గిన్నెలో పంచదార పానకాన్ని కలియబెడుతూన్న ఉమాశశి బావగారి కేసి విస్తుపోతూ చూసింది.

"ఇవాళేగా ఆదివారం. డాక్టరుగార్ని భోజనానికి ఆహ్వానించారుగా. అప్పుడే మర్చిపోయారా?"

మోహన్‌కుమార్ క్రింది పెదవు కొరుక్కున్నాడు తన మతిమరుపుకు బాధపడుతూ

"సారీ, ఆ సంగతే మర్చిపోయాను ఆల్ రైట్, మీరైనా జ్ఞాపకంపెట్టుకొని ఆ ప్రయత్నాల్లో ఉన్నారు. ఎంతైనా అభినందించవచ్చు. బ్రహ్మాండం బ్రద్దలయ్యేట్టుండాలి మీ అక్కా చెల్లెండ్ర ప్రిపరేషన్సు. ఆ వచ్చే అతిథి ప్రతిరోజూ మన ఇంట్లోనే భోంచేస్తాను, అనేట్టు వుండాలి. నేను సరిగ్గా పన్నెండు గంటలకు డాక్టరుగార్ని ఇంటికి తీసి కొస్తాను అప్పటికి రెడీగా వుండాలి" అంటూ బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు మోహన్‌కుమార్.

బాదుషా, బాదంహల్వా, వెజిటబుల్ పలావూ, కట్‌లెట్, బంగాళాదుంప కూర్మా, సేమ్యా, బజ్జీలు, రెండు ఇగుర్లూ, సాంబరూ, రసమూ, తయారుచేసి – పదకొండున్నరకు అక్క-చెల్లెళ్ళిద్దరూ స్నానం చేశారు. ఉమాశశి మేలిమి రంగు జరీతో చాకలెట్ కలర్ బెనారస్ పట్టుచీర, అదే రంగు పట్టు జాకెట్టూ, మెడలో లాకెటుగల రెండు పేటల గొలుసూ ధరించి లలిత మనోజ్ఞమూర్తివలె ఉన్నది. ఆమె ప్రోద్బలంతోనే అమరేశ్వరి పండు మిరపరంగు మధ్య మెరసిపోయే జరీగల అంచుతో నిండు ఆకుపచ్చ రంగు ధర్మవరం పట్టుచీరె, పండు నారింజ రంగు పట్టు జాకెట్టూ, మెడలో ముత్యాల నెక్లెసూ, ధరించి ముగ్ధ మోహినీమూర్తివలె వున్నది.

అక్క-చెల్లెండ్ర సౌందర్య సంపదను డాక్టరు కరుణానిధి కోసం కారులో వెళ్ళబోతూన్న మోహన్‌కుమార్ రెండు నిమిషాలపాటు నిలబడి తృప్తిదీరా చూశాడు. ఉమాశశి స్నిగ్ధమోహనంగా సిగ్గుపడింది. అమరేశ్వరి ముఖం గోడ ప్రక్కకు తిప్పుకుంది. చిరునవ్వు నవ్వుకుంటూ వెళ్ళాడు మోహన్‌కుమార్.

అరగంట వ్యవధిలోనే మోహన్‌కుమార్ డాక్టరు కరుణానిధిని కారులో ఇంటికి తీసికొచ్చాడు. కారు అంత దూరంలో వుండగానే వరండాలో నిలబడి వాళ్ళ కోసం వెచ్చని ఉత్సాహంతో ఎదురుచూస్తోన్న ఉమాశశి "డాక్టరుగారు వస్తున్నారక్కా!" అంటూ కేకవేసింది.

ఇంట్లో హాలులో కిటికీలోంచి చూసింది అమరేశ్వరి. ఇంటిముందు కారు ఆగింది. మోహన్‌కుమార్ కారులోంచి దిగి "రండి, ఇదే మా క్వార్టరు" అన్నాడు. కారులోంచి డాక్టరు దిగాడు. అతను దిగుతూండగా కిటికీలోంచి అమరేశ్వరి స్పష్టంగా చూసింది.

— ఆ కరుణానిధే ఈ డాక్టరు కరుణానిధి!

అమరేశ్వరి హృదయం బాణానికి గురికాబడ్డ లేడి హృదయంలా తల్లడిల్లింది. ఆకాశాన్ని కారుమబ్బులు కమ్ముకున్నట్లు వొళ్ళంతా స్వేదం కమ్ముతుంది. తల దిమ్మెత్తిపోయింది. కళ్ళల్లో భయప్రవాహాలు కాళ్ళల్లో వొణుకు. హాలులోంచి తడబడుతూ పడక గదిలోకి వెళ్ళి పడుకున్నది.

చిరునవ్వుల హారాన్ని చేతులతో ఎత్తి పట్టుకొని డాక్టరుకు వదనంలో సంపూర్ణమైన సంతృప్తితో స్వాగతం చెప్పింది ఉమాశశి.

హాలులో ఒక ప్రక్కనున్న సోఫాపై కూర్చున్నారు మోహన్‌కుమార్, డాక్టరు. ఆ హాలులోనే డైనింగ్ టేబిల్ కూడా అందంగా అమర్చబడింది. తెల్లటి గుడ్డ పరచబడ్డ ఆ టేబుల్‌పై రెండు పూలకుండీలు పెట్టబడ్డాయి. వాటిలో ఆ రోజు పూసిన పువ్వుల్ని శోభాయమానంగా అమర్చింది ఉమాశశి. అగరొత్తుల్ని వెలిగించింది. సువాసనలు హాలులో స్వేచ్ఛగా తిరుగాడుతున్నాయి.

"ఉమా! అక్కయ్యేదీ" అన్నాడు మోహన్‌కుమార్ సిగరెట్టూ వెలిగిస్తూ.

"గదిలో ఉందేమో" అంటూ గదిలోకి వెళ్ళింది ఉమాశశి.

"చూడండి! మా ఆవిడ మెడిసిన్ చదువుకున్నా సోషల్ బీయింగ్ కాదు పూర్వపు పద్ధతులీ, ఆచారా లనూ గౌరవించడం ఆమె ధర్మంగా భావిస్తుంది. ప్రాచీన సంస్కృతి కదుగుణంగా ఆత్మ సంస్కృతి వృద్ధి చేసికోవా లనుకుంటుంది. కొత్తవాళ్ళతో మాట్లాడాలంటే ఆమెకు బెరుకూ; బిడియమూను" అన్నాడు మోహన్‌కుమార్.

"దానిదేముంది లెండి. విద్యా, సంస్కృతీ, స్వభా వమూ - ఒకే తరగతికీ, స్థాయికీ చెందినవి కాదుగదా" అన్నాడు డాక్టరు.

వాళ్ళ సంభాషణ అలా సాగుతూండగా అక్కయ్య కోసం గదిలోకి వెళ్ళిన ఉమాశశి, మంచంమీద బోర్లాపడు కొని ఉన్న అక్కయ్యను చూసి ఆశ్చర్యచకితురాలైంది. "అక్కా! అక్కా! ఎందుకలా పడుకున్నావు? ఏం జరి గింది?" అంటూ ఉమాశశి మంచంమీద కూర్చుని అక్కయ్య భుజాల మీద చేయి వేసింది.

చెల్లెలి అడుగుల చప్పుడు వినగానే అమరేశ్వరి గబ గబా పైట చెంగుతో కళ్ళు తుడుచుకుంది. ముఖందిండులో దూర్చే సమాధానం చెప్పింది ఆమె.

"తల నొప్పిగా వుంది ఉమా! భోజనం నువ్వే వడ్డించు. నేను నిలబడే స్థితిలో లేను."

ఉమాశశి స్తబ్ధురాల్తైంది కొన్ని క్షణాలపాటు. అక స్మాత్తుగా అక్కయ్యకు వచ్చిన ఈ తలనొప్పి ఆమెకు అర్థం కాలేదు అంత త్వరగా అంత తీవ్రమైన తలనొప్పివస్తుందా?

"అక్కా! అయిదు నిముషాలక్రితం బాగానే వున్నా వుగా! డాక్టరుగారు అలా కారు దిగటంతోనే - ఇంత తల నొప్పి ఎలా వచ్చింది? నాకేం బోధపడలేదు. నువ్విలా మంచానికి కర్చుకొని పడుకుంటే - భోజనానికి ఆహ్వానింపబడిన అతిథికి మర్యాద లోపం జరగదూ? డాక్టరుగారు ఏమనుకుం టాడు? బావగారు బాధపడరూ! ఒక రకంగా బావగారు ఇన్సల్టుగా 'ఫీల్' కారూ! ఇదేమీ బావుండలేదు. తల నొప్పిని ఎల్లాగో ఓలాగు సర్దుబాటు చేసికొని, నలుగురిలో వొచ్చి కూర్చోవాలి గానీ - ఇలా పడక గదిలో పడుకుంటే ఏం సబబుగా వుంటుంది? లే అక్కా. హాల్లోనికి రా, తల నొప్పి అదే పోతుందిలే" బ్రతిమలాడింది ఉమాశశి.

కాని అమరేశ్వరి వినలేదు. మంచంమీదనుంచి లేవ లేదు. అక్కయ్య మనస్సు అంత హఠాత్తుగా విరిగిపోవడానికి ఉమాశశికి కారణం కనబడలేదు.

మోహన్‌కుమార్ గదిలోకి వొచ్చాడు - అక్క చెల్లెండ్రిద్దరూ ఎంత సేపటికీ రాకపోయేప్పటికి.

"అవతల పెద్దమనిషిని కూర్చోబెట్టి అక్కడ మీ రేం చేస్తున్నారు?"

"అక్కయ్యకు విపరీతమైన తలనొప్పిగా వుందట. తను హాల్లోకి రాలేదుట."

మోహన్ మార్ బాధా పూర్ణమైన ఆశ్చర్యాన్ని ప్రకటించాడు.

"ప్రొద్దుటినుంచీ వంటగదిలో శ్రమ చేసినట్టున్నావు. అందుకే తలనొప్పి వచ్చివుంటుంది. ఏదైనా మందు బిళ్ళ వేసుకోలేకపోయావా?... అయినా తలనొప్పి వంకతో ఇంటికి అనిధివస్తే - గదిలో పడుకుంటావా? అది మర్యాదకాదు కులాసాగా మాట్లాడుతూంటే తలనొప్పి ఇట్టేపోతుంది. లే, హాలులోకి వెళదాం రా! రాకతప్పదు. ఇంటి ఇల్లాలు భోజనానికి రాకపోతే అతిధి నొచ్చుకోడూ? అమర్యాదగా భావించడూ" భార్య భుజాన్ని తట్టి లేపాడు

"వస్తాను, మీరు పదండి" అన్నది అమరేశ్వరి మంచం మీదనుంచి లేస్తూ

మోహన్‌కుమార్ హాలులోకివెళ్ళి సోఫాలో కూర్చు న్నాడు. సిగిరెట్టు వెలిగిస్తూ - "మనుషులకు తల నొప్పులు చాల విచిత్రంగా వస్తూంటాయి. ఇంతకుముందు వరకూ మా అమరేశ్వరి బాగానేవుంది. హఠాత్తుగా తలనొప్పి వచ్చిందట; మంచమెక్కి పడుకుంది" అన్నాడు.

అమరేశ్వరి పేరు వినగానే డాక్టరు గుండెలో అలారం మ్రోగినట్లయింది. అమరేశ్వరి ఎవరు? తను ప్రేమించిన అమరేశ్వరా! మోహన్‌కుమార్ భార్యా! ఎందుకు కాకూడదు? ఎవరో ఇంజనీరింగు చదివిన యువకునితోనే వివాహమైందని తను విన్నాడు. ఇందాక మాటల సంద ర్భంలో తన భార్య మెడిసిన్ చదివినట్టుకూడా మోహన్

కుమార్ చెప్పుకున్నాడు. తప్పకుండా ఈమె ఆమెయై వుంటుంది. అయితే ఏం చేయాలి? ఏం చేయగలడు తను? అమరేశ్వరి జీవితంలో మళ్ళీ తలదూర్చకూడ దనుకున్నాడు. ఇప్పుడు...

ఉమాశశి వెంటే అమరేశ్వరికూడా హాల్లోకివచ్చింది.

డాక్టరు తలెత్తి అమరేశ్వరికేసి చూశాడు. కాని అమరేశ్వరి తలెత్తి అతనికేసి చూడలేకపోయింది.

ఉమాశశి ఇద్దర్నీ పరస్పరం పరిచయం చేసింది. ఒకళ్ళకొకళ్ళు నమస్కారాలు చేసుకున్నారుగానీ - సూటిగా కళ్ళల్లోకి చూసికోలేకపోయారు.

అమరేశ్వర్ని చూసినమీదట డాక్టరు హృదయాంతరాళంలో ఆందోళన చెలరేగిందిగానీ - ముఖాన్ని మాత్రం ప్రశాంతంగా కనబర్చాడు. అమరేశ్వర్ని నూతనంగా చూసినట్లే నటించాడు. ఆమెకూడా అంతే. మనస్సు ఎంత కల్లోలంగా వున్నా, ఆ పరిస్థితిని ముఖకవళికల్లో రవ్వంత ప్రకటించ లేదు.

ఉమాశశీ, అమరేశ్వరీ టేబుల్ పైన వడ్డించారు. ఉమాశశి చమత్కారంగా మాట్లాడుతూ వడ్డన చేసిందిగానీ, అమరేశ్వరి ఒక్కమాటకూడా మాట్లాడలేదు. మౌనంగా, గంభీరంగా వడ్డనలో సహాయపడింది.

నలుగురూ భోజనం చేశారు. డాక్టరు, అమరేశ్వరీ సరిగ్గా భోజనం చేయలేదు. అంతే కాకుండా ఉమాశశీ,

మోహన్‌కుమార్‌లు స్వేచ్ఛగా, చమత్కారంగా, జోక్సు విసురుతూ మాట్లాడితే, డాక్టరు అప్పుడప్పుడూ చిరునవ్వు నవ్వాడుగానీ - అమరేశ్వరి మూర్తీభవించిన విషాద ప్రతిమలా వుండిపోయింది. భార్య ముఖంలో నిరాశా నీడల్ని గమనించిన మోహన్‌కుమార్ 'తలనొప్పి తగ్గలేదేమో' అని సరిపెట్టుకున్నాడు కాని డాక్టర్‌గారిలో ఆశించిన ఉత్సాహం లేకపోయేప్పటికి కారణమేమిటా? అని ఆలోచించాడు. ఉమాశశికూడా నిరుత్సాహపడింది - డాక్టరుగారిలో ఉషారు లోపించిందని తెల్సికున్నదై.

"భోజనం రుచించలేదా డాక్టరుగారూ" అన్నది ఉమాశశి నిరుత్సాహమాటంగా.

"భోజనానికేం బ్రహ్మాండంగా వుంది" అన్నాడు డాక్టరు వక్కపొడి నోట్లో వేసికుంటూ.

"మరి అట్లా ఉన్నారేం? ఏదో ఇబ్బందిగా 'ఫీల్' అవుతున్నట్టున్నారు. ఉత్సాహంగా మాట్లాడటంలేదు. భోజనంకూడా తృప్తిగా చేసినట్టు లేదు" అన్నాడు మోహన్ కుమార్ కిళ్ళీ వేసికొని సిగిరెట్టు కాలుస్తూ.

భోజనం ముగించగానే అమరేశ్వరి నేరుగా పడక గదిలోకి వెళ్ళింది.

భోజనం మామూలుగానే చేశానే! పదార్థాలు ఎక్కువ ఉన్నాయి కాబట్టి ఎక్కువ తినలేదనేనా మీ అనుమానం. అదేమీ కాదులెండి రాత్రినుంచి కొంచెం అస్వస్థ

తగా వుంది. గొంతుపట్టేవరకూ తింటే - రేపు హాస్పటల్‌కు వెళ్ళనద్దూ” అన్నాడు డాక్టరు.

“ఏమో! మీ భోజనం మాకు తృప్తి కలిగించలేదు” అన్నది ఉమాశశి నిస్సారంగా నిట్టూర్పు విడుస్తూ.

“నాకు చాలా తృప్తిగావుంది” అన్నాడు డాక్టరు తల ఆడిస్తూ.

“పోనీ, నువ్వొక్క పాటపాడు. డాక్టరుగారు వింటారు. మరీ తృప్తిపడతారు” అన్నాడు మోహన్‌కుమార్

“అక్కయ్య వీణ బాగా వాయిస్తుంది అక్కయ్యచేత వీణ వాయింపజేస్తే - నేను పాడతాను. వాయిద్యం ప్రక్క నుంటే పాట బాగా రాణిస్తుంది” అన్నది ఉమాశశి.

“అక్కయ్యకింకా తలనొప్పి తగ్గినట్టులేదు” అన్నాడు మోహన్‌కుమార్.

“ఇంకో అవకాశాన్ని వినియోగించుకొని ఉమాశశి గారి పాట వింటానులెండి. ఇంటికి వెళతాను. వొచ్చి చాల సేపైంది” అన్నాడు డాక్టరు వెళ్ళేందు కుద్యుక్తుడై.

“అప్పుడేనా!” అన్నాడు మోహన్‌కుమార్ కను బొమలపై ఆశ్చర్యాన్ని ఎగురవేస్తూ.

“నా పాట వినకపోతేమానె, కాలక్షేపంకోసం ఏవైనా ఇన్‌డోర్ గేమ్స్ ఆడతారా! చెస్, పేక, క్యారమ్స్ మొదలైనవి. మీరిప్పుడే వెళతానంటారేమటి - కేవలం భోజనం కోసం హోటలుకు వచ్చినట్టు” అన్నది ఉమాశశి కంఠంలో కసుకుదనాన్ని ప్రదర్శిస్తూ.

"నాకు గేమ్స్‌లో పెద్ద ఇంటరెస్టు లేదు. ఏవో గేమ్స్ ఆడుతూ కాలాన్ని దొర్లించాల్సిన అగత్యం నా కుండదు. అంత తీరిక ఎక్కడిది? మీ పాట వినాలనే ఉత్కంఠవుంది కాని అవతల పనివున్నది. ఒక స్నేహితుణ్ని ఒంటి గంటకు ఇంటికి రమ్మన్నాను, వొచ్చి కూర్చుంటాడు అన్యధా భావించకండి" అన్నాడు డాక్టరు కుర్చీలోంచి లేవబోతూ.

అదే సమయంలో కాంపౌండరు జగన్నాధరావు హాస్పటల్‌నుంచి సైకిలుమీద ఆదుర్దాగా వచ్చాడు.

"డాక్టరుగారూ! మీరు అర్జంటుగా హాస్పటల్‌కు రావాలి. ఒక సీరియస్ కేసు వొచ్చింది."

"వస్తున్నాను పద" అన్నాడు డాక్టరు కాంపౌండరు జగన్నాధరావుతో. అతడు వెంటనే సైకిలెక్కి బయలుదేరాడు.

"వెళ్ళొస్తానండి, ఇలాగే అర్జంటు కేసులు వస్తూవుంటాయి. ఓగంటసేపు కులాసాగా కాలక్షేపం చేయటానికి కుదరదు. అమరేశ్వరిగారు శిరోభారంచేత పండుకొన్నట్టున్నారు. వారితో కూడా చెప్పండి. కమ్మని మీ ఆతిధ్యానికి హృదయపూర్వకాభివందనాలు చెప్పుకుంటున్నాను" చేతులెత్తి నమస్కరించి బయటికొచ్చాడు డాక్టరు.

"మిమ్మల్ని కారులో హాస్పటల్ దగ్గరదిగవిడుస్తాలెండి" అంటూ మోహన్‌కుమార్ కూడా బయటికొచ్చాడు.

ఉత్సాహం జారిన వదనంతో వరండాలో నిలబడింది ఉమాశశి.

## ౧ [illegible]

సుందర్రామయ్యగారు గుంటూరులో మంచి ప్రాక్టీసు గల లాయరు. సివిల్ లోనూ, క్రిమినల్ లోనూ ఆయనగారికి మంచి దక్షతవుందిగానీ - సివిల్ సైడునే గొప్పలాయరు అన్న ఖ్యాతి అమల్లోవుంది. ఆ ఖ్యాతికి తగినట్టుగానే సంపాదన వుంది. ఆసంపాదనతో సమానంగా హోదావుంది. ఆయనకు ఇద్దరు ఆడపిల్లలూ, ఒక మగపిల్లవాడూ సంతానం. పెద్ద అమ్మాయి అమరేశ్వరి, చిన్నమ్మాయి ఉమాశశి పిల్లవాడు హైస్కూల్లో చదువుతున్నాడు. ప్రాక్టీసుమీద ఆర్జన కాకుండా లాయరు సుందర్రామయ్యగారికి తెనాలి తాలూకా కొలకలూరు గ్రామంలో స్వంతపొలాలున్నాయి. పదిహేనెకరాల మాగాణీ, అయిదెకరాల మెట్టభూమిఉన్నది. కొన్నాళ్ళ క్రితంవరకూ అన్నగారు తన సేద్యంక్రింద ఆభూమిని సాగుచేసి ఆఫలసాయం తమ్ముడికిస్తూ రావడం జరిగింది గానీ - అన్నగారు చనిపోయాక, లాయరుగారు సొంతసేద్యం కుదరక మొత్తం పొలాన్ని ఊళ్ళో నమ్మకస్థులయిన ముగ్గురు రైతులకు కట్టుబడి కిచ్చారు. వాళ్ళు మామూలైన పిమ్మట

ఆ ధాన్యాన్ని కల్లాలలోనే అమ్మి, అనా పైసలంతోసహా ఆ పైకాన్ని గుంటూరు వెళ్ళి సుందరరామయ్యగారికిస్తూ వుంటారు, మెట్టభూమిలో అరటితోటలు వేస్తూ, ఎకరానికి ఆరువందల రూపాయల చొప్పున ప్రతిసంవత్సరమూ చెల్లిస్తూ వుంటారు. స్వగ్రామంలో ఉన్న లోగిలిని ఎనిమిదివేలకు అమ్మి, ఆ డబ్బుతోనూ, కొంత స్వార్జితంతోనూ గుంటూరులో చంద్రమౌళినగర్‌లో అరవై వేలతో ఆధునిక పద్ధతుల్లో అందమైనమేడ కట్టించారు, సుందరరామయ్యగారు. ఏ పని చేసినా, ఏం మాట్లాడినా తన వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగా కాపాడుకొనేందుకు ప్రయత్నించే మనిషి లాయరుగారు.

జీవితాన్ని కొన్ని ఆదర్శాలతో, నియమాలతో, సరిహద్దులలో బంధించి, సంపాదించుకున్న విజ్ఞానంతో, సంస్కారంతో మానసిక ఔన్నత్యంతో ఆచరణకు సానుకూల పర్చుకొని, సార్థకతను జేసికోవాలి. ఆ సత్యానికి జీవితంలో ప్రధానమైన విలువన్ని ఇస్తారు లాయరు సుందరరామయ్యగారు. ఆయన్ను ఒక్క వాక్యంలో వ్యాఖ్యానించ దల్చుకున్న వారు; 'నిండు కుండలాంటి మనిషి' అంటారు. ఒడ్డూపొడుగూ సమపాళంలోవుండి, జీవితాన్ని గురించి స్థిర గంభీర నిర్ణయాన్ని గైకొన్నట్టు కరుకైన కోలమొహం చెప్పక చెబుతూండగా, నిండైన ఆకారంగలిగి వుంటారు. చూపులకు దయాదాక్షిణ్యాలులేని కొండరాయివలె కనబడ్డా - కొన్ని విషయాల్లో ఆయనహృదయం నవనీతం; దయకూ, మానవసహజమైన జాలికీ ధర్మగుణానికీ నిలయం. ఆ సంగతి ఆయనతో సన్నిహిత

సంబంధాలున్న వారికితప్ప తెలియదు. ఆయనగారికి ప్రాచీన సిద్ధాంతాలపై, సంస్కృతిపై, ఆచారాలపై ద్వేషంలేదు ఆధునిక పద్ధతులపై సంస్కృతిపై ఆచార వ్యవహారాలలో వస్తూన్న పరిణామదృష్టిపై మోజులేదు. ఏ సిద్ధాంతం జీవితానికి వెలుగుబాటను చూపిస్తుందో, ఏ సంస్కృతి జీవితానికి నిండుదనం ఇస్తుందో, ఏ ఆచార వ్యవహారాలు జీవితానికి సామరస్యాన్ని చేకూరుస్తాయో - ఆ సిద్ధాంతానికీ సంస్కృతికీ, ఆచార వ్యవహారాలకూ జీవితంలో ప్రాముఖ్యతనివ్వాలి. అదీ సుందర్రామయ్యగారి దృక్పథం.

పిల్లలపట్ల తల్లిదండ్రుల బాధ్యత ఒక ఇంటివాళ్ళుగా జేయడంవరకే అన్న అభిప్రాయానికి సుందర్రామయ్యగారు కూడా గౌరవాన్ని యిస్తారు ఆ దృష్టితోనే పిల్లల్ని అదుపు ఆజ్ఞలలో పెట్టాలంటారు. పరిణత చెందని మనస్సులకు స్వేచ్ఛనిస్తే భ్రమలలోనై, మిడిమిడిజ్ఞానంతో, పొంగులాంటి ఆవేశంతో తమ కష్టాల్ని తామే సృష్టించుకుంటారు. వాళ్ళకి జీవితంలో ఒక బాటను చూపాల్సిన బాధ్యత తల్లితండ్రులదే. అందుచేతనే సుందర్రామయ్యగారు తమ కూతుళ్ళ విషయంలో జాగ్రత్తపడటం. పెళ్ళికిముందు ప్రేమల్లో ఆయన గారికి కించిత్ విశ్వాసంలేదు. వయస్సు మనస్సుచేత రకరకాలైన రంగుల పువ్వుల్ని పూయిస్తుంది. ఆ రంగులకు మోజు పడి, పువ్వులకోసం ప్రయత్నించటం - ఎండమావుల వెంట బడటంలాంటిదే! ఈనాటి యువతీయువకుల ప్రేమపురాణాలు ఆ తరగతికి చెందినవే. పెద్దమ్మాయి అమరేశ్వరి పను

కాలేజీలో ప్రేమించిన కరుణానిధిని పెళ్ళాడతానని చెప్పగా ఆమె మాటల్ని లక్ష్యపెట్టకుండా తను వెతికి నిర్ణయించిన సంబంధాన్ని చేశారు సుందరామయ్యగారు తన పిల్లలు ఎంత తెలివితేటలు గలవారైనప్పటికీ, ఎంత పెద్ద చదువులు చదివినప్పటికీ, ఎంత లోకజ్ఞానం గల వారైనప్పటికీ, పెళ్ళిళ్ళ విషయంలో వాళ్ళకి పూర్తిస్వాతంత్ర్యాన్నిస్తే వాళ్ళ భవిష్యత్ జీవితాలకు అన్యాయంచేసిన వాడవుతాడు. ఆ అభిప్రాయంలో వున్న సుందరామయ్యగారు చిన్నమ్మాయి ఉమాశశి వివాహంకూడా తన ఇష్టా యిష్టాలపైనే జరగాలనే పట్టుదలతో వున్నారు.

సెలవులై పోవడంతో ఉమాశశి నాగార్జునసాగర్ నుంచి గుంటూరువచ్చింది. ఆ రావడం అసంతృప్తిగానే వొచ్చింది ఆ సాయంత్రం గుంటూరు బస్సుస్టాండులో డీలక్సు దిగుతూ - 'నేనెందుకు నాగార్జునసాగర్ పనిగట్టుకొంటూ వెళ్లాను? ఏం సాధించాను?' అనుకుంది నిష్ఠురంగా. ఆమెకూ డాక్టరు కరుణానిధికీ మధ్యనున్న మసక మసక తెర, భావాల సంకీర్ణత అలాగేవుంది.

ఉమాశశి రిక్షాదిగి, గేటుతలుపు తెరుచుకొని మేడలోకి వెళ్ళబోతూండగా - గార్డెన్‌లో పచ్చిగడ్డిపై కూర్చొని లాయరుగారితో మాట్లాడుతూన్న మేనమామ శీతారామయ్య చటుక్కున సంభాషణను త్రుంచివేసి - "అదుగో! పెళ్ళికూతురు రానేవచ్చింది మాటలోనే మూటకట్టుకొని" అన్నాడు బిగ్గరగా.

నీటి అల రాతినితాకినట్లుగా చివుక్కుమంది ఉమా శశి హృదయం మామయ్యకేసి, మందారచెట్లుపై పడే సంధ్యా కాంతిని గంభీరంగా తిలకిస్తున్న తండ్రికేసి ఆశ్చర్యంగా చూస్తూ ఇంట్లోకి వెళ్ళింది ఉమాశశి.

“బావగారూ! నా మాటల్లో ఒక్క అక్షరాన్నికూడా శంకించే పనిలేదు. ఈ సంబంధం మనకు అన్నివిధాలా దీటైన సంబంధం! వరుడా – అందంలో చంద్రుణ్ని మించినవాడు. పేరుకూడా చంద్రశేఖరరావే అనుకో. చదువు సంగతి ప్రత్యేకం చెప్పనక్కర్లేదు. ఎమ్ యస్. సి. టెక్నాలజీ ఫస్టు క్లాసులో పాసైనాడు. సెంట్రల్ గవర్నమెంటు ఉద్యోగం దుర్గాపూరు స్టీలు ఫ్యాక్టరీలో కెమికల్ ఇంజనీరుగా పనిచేస్తున్నాడు ఇంకా పైకిపోగల అవకాశాలు కోకొల్లలు. ఫారిన్ ఛాన్సు తగలొచ్చు. ఒక్కసారి ఏ ఇంగ్లాండుకో వెళ్ళి ఏడాది పాటు ట్రయినింగ్ అయివస్తేచాలు, జీతం నాలుగో అంకెలోకి నడుస్తుంది. ఇంక వాటిని గురించి నేను నీకు చెప్పనవసరంలేదనుకో. ఇటు కుటుంబమూ సాంప్రదాయమూ, గౌరవ మర్యాదలు చూద్దామంటే – మూడు తరాలవరకూ లోటు దొరకదు. అంతెందుకూ, అవూళ్ళో ఏ పసివాణ్ణి అడిగినా ధనుంజయరావుగారి కుటుంబాన్ని గురించీ, పరువు ప్రతిష్ఠల్ని గురించీ, ఆయన మంచితనం, ధర్మగుణం, పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగా ఆయన వ్యక్తిత్వమూ చెబుతారు. మాంచి పలుకుబడిగల మనిషి. కావాలంటే నెమ్మదిగా వాకబు చేసుకోవచ్చు. ఆ స్తినిగురించి ఆలోచించనక్కర్లేదు. ఇరవై

ఎకరాల శేరీ మాగాణిభూమి ఎకరం ఏడు వేలకు తక్కువ కిమ్మత్తు చేయదు. మూడెకరాల నిమ్మతోట, రెండెకరాల అరటి తోట నీటి వసరులుగల ఆ మెట్టభూమి ఎకరం తొమ్మిదీ, పది వేలదాకా వుంటుంది. ఇక పోతే ధనంజయరావుగారి దగ్గర వున్న నిల్వ ధనాన్ని గురించి జనవాక్యం పలువిధాలుగా వుంది. కొంతమంది నలభై వేలంటారు; మరికొంతమంది వడ్డీలతోసహా అరవై వేలంటారు; ఇంకొంతమంది "ఆయనకేం! లక్షాధికారి" అంటారు. ఏదిఏమయినా డబ్బు నిల్వసంగతి అలా అట్టిపెట్టి మిగతా విషయాల్ని గమనిస్తే - ఇది అన్ని విధాలా తగిన సంబంధం బావగారూ" అన్నాడు శీతారామయ్య.

సంధ్యాకాంతి క్షీణిస్తూన్నకొద్ది నీడలు ముందుకు జరుగుతున్నాయి. ఆజరిగే నీడలకేసిచూస్తూ ఆలోచనలోపడ్డారు. లాయరుగారు.

"ఏమండి! బావగారూ!" అన్నాడు సీతారామయ్య హెచ్చరిస్తూ.

"సరే, కానీయండి. మీ మాటలమీద నాకు నమ్మకముంది. ఈ సంబంధం ప్రయత్నించండి" అన్నాడు సుందరరామయ్యగారు తల నెమ్మదిగా ఆడిస్తూ.

లాయరుగారు ఒప్పుకొనేసరికి శీతారామయ్య సంతోషానికి పట్టపగ్గా ల్లేకుండాపోయాయి. అల్పసంతోషి. వెంటనే చెల్లెలుదగ్గరకు వెళ్ళి బావగారు వొప్పుకున్న సంగతి, తాను ఒప్పించిన ఘనతనూ చెప్పుకున్నాడు. సరస్వతమ్మ సంతోషపడింది.

ఆ రాత్రి తొమ్మిదిగంటలకు భోజనాలయ్యాక హాలులో సోఫాల్లో సుందరరామయ్యగారూ, సీతారామయ్యా, సరస్వతమ్మా కూర్చుని మేడపైగదిలో చదువుకుంటూన్న ఉమాశశిని రమ్మని కబురుచేశారు. హఠాత్తుగా ఆమె గుండెల్లో నీరు క్రిందికి జారినట్లయింది. తాను వొచ్చిన దగ్గర్నుంచీ మామయ్యా చతురో క్తుల్నే ఏదో తనకు తెలీకుండా తనినిగురించి ఆలోచనలు జరుగుతూన్న వాతావరణాన్ని పసిగట్టి - తనకి ఏదో పెండ్లి సంబంధాన్ని చూస్తున్నారని భయపడసాగింది. ఈ పిలుపుతో ఆ భయం గట్టిపడింది.

నేరస్తురాలుభయంభయంగా కోర్టు బోనులోకి ప్రవేశించినట్లు, ఉమాశశి భయభీత మానసియై మెల్లగా మేడ మెట్లు దిగుతూ హాలులో ప్రవేశించింది

కొన్ని క్షణాలపాటు నిశ్శబ్దం నిక్కబొడుచుకుంది. తుఫానుకుముందు ఏర్పడే నిశ్శబ్దంగా భావించింది ఉమాశశి.

"కూర్చో" అన్నారు సుందరరామయ్యగారు.

యాంత్రికంగా కూర్చుంది ఉమాశశి.

ఉపోద్ఘాతం లేకుండానే అసలు విషయంలోకి దిగాడు శీతారామయ్య.

" ఈ సంవత్సరమే నీకు పెండ్లి చేయాలనుకుంటున్నారు మీ నాన్నగారు. ఒక మంచి సంబంధంకూడా వచ్చింది. వరుడు అందచందాల్లో మేటివాడు. ఎమ్మెస్సీ టెక్నాలజీ ఫస్టుక్లాసులో ప్యాసై అయిదువందల చిల్లరవరకూ

ఉద్యోగంలో ప్రాక్టీసు చేస్తున్నాడు. పిల్లవాని ఆస్తీ, కుటుంబపు మంచి చెడ్డలూ, అన్నీ నాన్నగారూ, నేనూ, మీ అమ్మా కల్సి ఆలోచించాము. మా అందరికీ భేషుగ్గా నచ్చిందీ సంబంధం. నీ చెవిని ఈ ముక్క వేసి - ప్రయత్నాలు ప్రారంభించుదామని. నీ అభిప్రాయమేమిటి?"

తను అస్పష్టంగా ఊహించిన విపత్తే ఎదురయ్యేసరికి, ఉమాశశి ఆశ్చర్య పడలేదుగానీ - భయ విచలితమైంది. నిర్వాక్యురాలై గుడ్లప్పగించి చూస్తూ కూర్చుంది.

"చెప్పు ఉమా!" అన్నాడు. శీతారామయ్య ఆమె ముఖంలోని గంభీర ప్రకృతిని అర్థం చేసికోలేక.

"ఇంకా అది చెప్పేదేముందిలే అన్నయ్యా! మన అందరికీ నచ్చిన సంబంధాన్ని కాదంటుందా? మనమేమైనా బాల వివాహం చేయబోతున్నామా! దాని శ్రేయస్సు కోరేగా మనం ఏపనిచేసినా!" అన్నది తల్లి సరస్వతమ్మ.

తను మౌనంగా బాధపడడంవల్ల ప్రయోజనం లేదనుకుంది ఉమాశశి. హృదయగత ప్రేమద్వారా జీవితంలో ఉన్నత శిఖరాన్ని అధిరోహించాలనే విశ్వాసంతో పోరాటం సాగించేవారికి ఇలాంటి సంఘర్షణలకు దారితీసే పరిస్థితులు వుత్పన్నం కావడం అసహజంకాదు గుండె నిబ్బరంతో - ధైర్యసాహసాలతో, భవిష్యత్తుపై నమ్మకంతో - కోరుకున్న విలువలకోసం, నిర్దుష్టమయిన నిర్ణయాలతో కూడిన జీవితం కోసం పరిస్థితుల్ని ఎదుర్కోవాలి. పెనుగాలి నేలపై మొక్కల్ని నాశనం చేస్తుంది గానీ పర్వతాన్ని ఏం చేయగలదు?

సముద్రంలోని నీటి అలలు చిన్నపడవను కదిలిస్తాయిగానీ పెద్ద నౌక నేం చేయగలవు ?

"నాకు అప్పుడే ఏం పెళ్లి అమ్మా ! ఇంకా చదువు పూర్తి కాలేదుగా" అన్నది ఉమాశశి అయిష్టతను స్పష్టంగా ధ్వనింపజేస్తూ.

సరస్వతమ్మ విస్తుపోతూ అన్నయ్యకేసి చూసింది.

"అదేమిటి ఉమా ! ఇంకా చిన్నపిల్లలాగా మాట్లాడతావు. ఆడపిల్లలకు పద్ధెనిమిదేళ్ళ వయస్సు పెళ్లి వయస్సు కాదూ ! ముప్ఫై ఏళ్ళకు పెళ్లిచేసుకుంటావా ? చదువంటావా — అదిపూర్తి కావటమంటూ వుండదు. అనంతాకాశం ఎంతో, విద్యకూడా అంతే చదువు అంతుతేల్చుకుందామంటే ఒక జన్మ చాలదు. అదీగాక నీ చదువు ఉద్యోగం కోసం కాదుగదా ! పరిస్థితుల్ని, పరిసరాల్ని అవగాహన చేసికొని, తెలివితేటల్ని, విజ్ఞాన వికాసాల్ని మేళవించి సామాజిక సూత్రాల్ని సమన్వయించుకుంటూ సాఫీగా బ్రతకటానికి అవసరమైన విద్యచాలు. ఆ మేరకు నువ్వు విద్యను సేకరించావు" అన్నాడు సీతారామయ్య.

"నాకు ఎం. ఏ. చదవాలనివుంది. ఆ డిగ్రీ పుచ్చుకున్నాకే నా పెళ్లి" అన్నది ఉమాశశి ఏమాత్రం తొణక్కుండా.

అంతవరకూ గంభీర మనస్కుడై ఆలోచిస్తోన్న సుందరరామయ్యగారు కూతురి మాటలకు చురుమని కోపంరాగా "అప్పుడే అంత స్వతంత్రురాలివై నావన్నమాట. మా అవసరం

లేకుండా నీ పెళ్ళి నువ్వు చేసుకోగలిగితే - ఇంకా మేమెందుకు చిన్నమ్మాయ్? ఈ వేషాలూ, పోకిళ్ళూ నాదగ్గరపనికిరావు. పెళ్ళికిముందు అమరేశ్వరికూడా ఇట్లాగే సాకులు చెప్పి ఆడపిల్లల ఇష్టాయిష్టాల్ని దృష్టిలో పెట్టుకుంటే ఈ లోకం ఏ తండ్రీ పెళ్ళిళ్ళు చేయలేడు. మారు మాట్లాడకుండ ఈ పెళ్ళికి ఒప్పుకో" అన్నాడు కఠినంగా. ఆపైన ఆయనగారు చివుక్కున లేచి తన గదిలోకి వెళ్ళారు.

ఆ రాత్రంతా కంటిమీద కునుకు లేకుండా దుఃఖించింది ఉమాశశి. కర్తవ్యం బోధపడక కన్నీరు కార్చింది. తండ్రి మొండి పట్టుదలగల మనిషి. ఆయన స్వభావమూ, సిద్ధాంతాలూ, ప్రవర్తనా ఆయనకు బాగా నచ్చుతాయి. తను కుటుంబానికి యజమానీ, కుటుంబములోని ప్రతి వ్యక్తీ తన ఆలోచనకు అనుగుణంగా, తన దృక్పథాల నీడలలో తన శాసనాల ప్రకారం నడుచుకోవాలంటాడు. సంకుచిత కృత్రిమ పరిహద్దులలో బంధించి - తన అధికారాన్నీ, మాట చెల్లుబడినీ నెగ్గించుకోవాలనే ప్రవృత్తిగలవాడు. తన సంతానం తన అభిమతాల మేరకు కృతజ్ఞత చూపాలంటాడు. ఇదెక్కడి తత్వం? ఆయన నిరంకుశ భావాలకీ మూఢ ప్రవర్తనకూ మాట నెగ్గించుకోవాలన్న పట్టుదలకూ అక్కయ్య దారుణంగా బలికాలేదూ! అలాగే తననికూడా బలిచేయాలని చూస్తున్నాడు నాన్న. వెనుకబడిన సిద్ధాంతాలతో, సంస్కృతితో ఆయన బుర్ర ఘనీభవించింది. ఆ ఘనపదార్థాన్ని

అక్కయ్యని ద్రవింపజేయలేక పోయింది. తనైనా పూనుకొని ఎలాంటి పరిస్థితులనైనా దృఢచిత్తంతో ఎదుర్కొని నిర్మలమైన ప్రేమదే విజయం తథ్యమని నాన్నకు తెలుపుచేయాలి. ఆయన బుర్రలో కరుడుగట్టిన పాతభావాల్ని తొలగించాలి.

... కాని తనని డాక్టర్ కరుణానిధి ప్రేమిస్తూన్నట్టు గ్యారెంటీ ఏముంది? తనపై ఆయనగారికిగల ప్రేమాభిమానాలు ఇంకా అస్పష్ట రూపంలోనే ఉన్నాయిగదా! రెండోసారి నాగార్జునసాగర్ పనిగట్టుకుని వెళ్ళికూడా ఆ వ్యవహారాన్ని ఖచ్చితంగా తేల్చుకోలేకపోయింది తామిద్దరిమధ్య ఒక రూపాన్ని ధరించని భావాలు దొర్లుతూనే వున్నాయి. ప్రేమికుల మధ్య ఈ అనిశ్చిత పరిస్థితి శ్రేయస్కరముకాదు. మనస్సును గాలిలో ఆడిస్తూ జీవితాన్ని గురించి నిర్ణయాన్ని తీసికోవడం వివేకంకాదు. ఏక్షణంలో గాలి ఏదిశకువీస్తుందో చెప్పడం కష్టం బొమ్మా బొరుసు పద్ధతితో మనస్సుపై సర్కస్ చేస్తే ముందుముందు ఎన్నో అనర్థాలను ఎదుర్కోవలసి వుంటుంటుంది తను జాగ్రత్తపడాలి. కొంచెం వ్యవధితీసికొని డాక్టరు కరుణానిధిగారితో ముఖాముఖి మాటాడి ఒకళ్ళనొకళ్లు బాగా అర్థంచేసికొని, అపోహల్ని తొలగించుకొని అనురాగాల్ని గట్టిపర్చుకొని భవిష్యత్తును గురించి దృఢమైన అభిప్రాయానికొస్తే – తను తల్లితండ్రుల్ని ఎదిరించి జీవితంలో ఆశించిన సత్యాలకోసం, పెట్టుకొన్న ఆదర్శాల సాధనకోసం పోరాటాన్ని సాగించవచ్చు.

ఆ మరునాడు ఉదయం ఉమాశశి తల్లితో అన్నది. "అమ్మా! మళ్ళీ నాగార్జునసాగర్ వెళ్ళివస్తాను. ఈ పెళ్ళి విషయం అక్కయ్యతో మాటాడాలి" ఆ వంకతోనైనా తను నాగార్జునసాగర్ వెళ్ళటం వెంటనే తటస్థించితే డాక్టర్ గారితో నిర్మొహమాటంగా మాటాడవచ్చు.

ఉమాశశి తల్లిని ఆ విధంగా అడగడం ప్రక్కగదిలో వున్న సుందరరామయ్యగారు విన్నారు. సరస్వతమ్మ ఏదో అనబోతూండగానే, లాయరుగారు చకచకా అక్కడకొచ్చి - "నీ పెండ్లివిషయం అక్కయ్యతో మాట్లాడేదేముందే! అక్కయ్య తన పెళ్ళిని గురించి నీతో మాట్లాడిందా? నీ బాగోగులు కనిపెంచిన తల్లి దండ్రులం మాకంటె అక్కయ్యకు యెక్కువ తెలుస్తాయా? నువ్వు ఏదో ఒక మిషచేత వ్యవహారానికి అడ్డుపుల్ల వేయాలని చూస్తే ప్రయోజనంలేదు." అన్నారు కఠినంగా.

ఉమాశశి ఏం మాటాడలేకపోయింది.

పది గంటలకు కాలేజీకి వెళ్ళింది. కాని క్లాసుకు వెళ్ల లేదు. గరల్స్. వెయిటింగ్ రూమ్‌లో కూర్చుని తీవ్రంగా ఆలోచించింది. మధ్యాహ్నం ఇంటికొచ్చింది - తలనొప్పిగా వుందని స్నేహితురాండ్రతో చెప్పి.

మామయ్యతో తల్లి దండ్రులకు రాయబారం పంపింది ఉమాశశి - పరీక్షలయ్యేవరకూ తన పెళ్ళి ప్రయత్నాలు ఆపుదల చేయించవల్సిందని. సీతారామయ్య ఆ సంగతి

చెల్లెలితోనూ, లాయరుగారితోనూ చెప్పి, ఆ మేరకు ఒప్పించాడు. పైగా ఒక సలహాకూడా యిచ్చాడు ఈ లోపల దానిపై ఒత్తిడితీసికొని రాకుండా తను ప్రయత్నాల్ని తాను చేస్తుంటే, ఒక్కసారే ముహూర్తం పెట్టించి, పరీక్షలు కావడంతో వివాహం జరిపించవచ్చని. ఆ సలహా లాయరుగారికి నచ్చగా, 'సరేలే' అన్నట్టు తల ఆడించాడు.

ఆ రోజు సాయంత్రమే ఉమాశశి డాక్టర్ కరుణానిధికి సుదీర్ఘమైన లేఖ వ్రాసింది – తన పెళ్ళి విషయాన్ని ఉదహరిస్తూ, తన విషయంలో అశ్రద్ధ చూపకుండా వెంటనే నిర్ణయాన్ని తీసికొని, నిర్మొహమాటంగా తెలియబర్చవల్సిందని తమ లేఖపైనే తన బ్రతుకు భవిష్యత్తు పూర్తిగా ఆధారపడి వుందని వ్రాసింది.



ఆ లేఖకు డాక్టరు కరుణానిధి దగ్గర్నుంచి, సమాధానం కోసం ఉమాశశిరోజుల్ని నిముషాలుగా ఎదురు చూడసాగింది. వారమూ, పదీ, పదిహేనురోజులు గడిచినా జవాబురాలేదు. ఒక్కో రోజు కాలేజీ మానివేసి, ఉత్తరంకోసం నిరీక్షించే పోస్టుజవాను 'ఏమీ ఉత్తరాలులేవు' అని పెదాలు చప్

రించగానే ఆమె గుండెలో నిరాశ నీడల్ని ఏర్పర్చుకొనేది. ఆ నీడల పొడవు అంతుబట్టక కల్పిత భయాలతో, సందేహా లతో గిజగిజ లాడేది.

కాలేజీలో పరీక్షల వాతావరణం గుట్టు చప్పుగా ప్రవేశించింది. కాని ఆమె ఆవేదనలో, హృదయ ఘోషలో ఆ వాతావరణం స్తంభించింది కాలేజీ సాంస్కృతి కోత్సవా లంటే అమితమైన అభిలాష ఉమాశశికి. ఏటా ఆ ఉత్స వాల్లో ఉషారుగా పాల్గొనేది. నాటకాలలో వేషం వేసేది. ఫ్యాన్సీడ్రస్ పార్టీలో వేషంకట్టి, ప్రేక్షకుల హృదయాల్లో నవ్వుల కోలాహలాన్ని కలిగించేది మ్యూజిక్ కాంపిటీషన్‌లో లలిత సంగీతంపాడేది. ఆమెకు చాల ప్రైజులొచ్చేవి. మిగతా గరల్స ఆమెకొచ్చే ప్రైజుల్నిచూసి కళ్ళల్లో నిప్పులగుల్లు చల్లుకునేవారు కాని ఆ సంవత్సరం ఉమాశశి కాలేజీ సాంస్కృతి కోత్సవాల్లో పాల్గొనలేదు. కనీసం చూడటాని కూడా కాలేజీకి వెళ్ళలేదు. ఆమె మనస్సంతా సమస్యల సంకీర్ణంతో గజిబిజిగా వుంది.

పాఠ్యపుస్తకాలపై మనస్సు మళ్ళడంలేదు. ఇదివరలో పరీక్షలంటే ఎంతో భయం వుండేది. క్లాసులో అందరికంటే ఎక్కువ మార్కులు రావాలనేకోర్కె, పట్టుదలా, దీక్షా దృఢంగా వుండేవి. అట్లానే చదివి, మార్కులు తెచ్చు కొనేది అట్లాంటిది యూనివర్సిటీ ఎగ్జామినేషన్ను నిశ్శబ్దంగా పరుగిడుకొస్తూన్నా ఎంతో నిర్లిప్తంగా నిర్భయంగా, నిర్ల క్ష్యంగా వుండసాగింది 'ఏం పరీక్ష తప్పితే! జీవితంలో

పరిస్థితులు పెట్టే పరీక్షలే ప్యాసుకావాలిగానీ-ఇలాంటి పరీక్ష లెన్నయినా ప్యాసుకావచ్చు!' అన్నభావం ఆమెలో ప్రబలి పోయింది.

నెలరోజులు గడిచాయి.

ఉమాశశిలో ఓర్పు పూర్తిగా అడుగంటిపోయింది తను ఒక మూర్ఖురాలు. గాలిలో మేడలు కట్టుకుంటూ, ఆమేడల్లో కళ్ళుమూసికొని కలలుగంటూ విహరిస్తూ - నేలమీద వున్న విషయాన్ని మర్చిపోతూన్నది మరీచికలాంటి వ్యామో హానికి గురవుతూన్నది సల్లనిరాతిలో మొక్కలనినాటి, పెరుగుదలకోసం తహతహలాడుతూన్నది. ఇంతకంటెలవివేకం మరొకటి వున్నదా?...డాక్టరు కరుణానిధిగారు తన కెందుకు జవాబు వ్రాయలేదు? తనపై ఇష్టంలేకనా? అసలు తనని ప్రేమించలేదా! తనని వివాహం చేసికొనే ప్రశ్నేలేదా! ఆయన హృదయంలో తనకి స్థానంలేకపోతే, తనని పెళ్ళి చేసికోవటం ఇష్టంలేకపోతే - తనకి నిరాటంకంగా తెలియ జేయవచ్చుగా! తననిట్లా సందిగ్ధావస్థలో పెడుతూ, తనని మనస్సుతో వేళాకోళం ఆడుకోవడం దేనికి! ఎంతపాపం? ఆయన ఇంత మౌనంగా వుండటంలో అంతరార్థమేమిటి? ఏదో వుండివుంటుంది. అది గ్రహించలేకనే - తను ఇలా ఆయనను వెంబడిస్తూన్నదేమో! ఆయనతో తన పరిచయం స్వల్పకాలంనుంచే. అంతకుముందు ఆయనగారి జీవితంలో ప్రవేశించి, ఆయన హృదయాన్ని ఆక్రమించుకున్న స్త్రీ ఎవ రయినా వున్నారేమో! ఆయనకు చేరువుగా రాలేక, ఆయన

జీవితంలో దుఃఖాన్ని, తీవ్రమైన హృదయ సంఘర్షణను తెచ్చి పెట్టిందేమో! ఆ పరిస్థితులలో తను ఆయనకోసం ప్రాకులాడుతున్నదేమో!...ఇదంతా తనకెట్లా తెలుసు? కేవలం తన ఊహ! ఒట్టినే భయం! మరి ఏం చేయాలి తను? ఆయన్నుంచి ఏమీ సమాధానం రాకపోతే ఎట్లా సరిపెట్టుకోవాలి! ...అక్కయ్యకు లేఖ వ్రాస్తే? తన కర్తవ్యాన్ని బోధపర్చమని అర్థిస్తే! ఆమె తప్పకుండా చక్కని సలహాయిస్తుంది. అక్కయ్య ప్రతి విషయాన్ని బాగా ఆలోచించి, బ్రతుకులో ఏమీ ఇబ్బందులు రాకుండా నిర్ణయాలు చేస్తుంది. ఆమె అమూల్యమైన సలహా తన బ్రతుకు చీకటిలో వెలుగు దారిని చూపెట్టవచ్చు.

ఆ రోజే ఉమాశశి అక్కయ్య అమరేశ్వరికి వుత్తరం వ్రాసింది, ఆ వుత్తరంలో తను డాక్టరు కరుణానిధిని గాఢంగా ప్రేమించినట్టూ, ఆ విషయాన్ని తెలుపుతూ పెళ్ళిచేసి కొమ్మనమని ఆయనకు లేఖ వ్రాసినట్టూ, ఇక్కడ తల్లి దండ్రులూ, మామయ్య తనకి సంబంధం కుదర్చబోతూ వున్నట్టూ, డాక్టరుగారి దగ్గర్నుంచి జవాబు రాకపోవడంతో తన మనస్సు అనేక వికారాలకు లోనై, అల్లకల్లోలంగా వున్నట్టూ, భీకర రణరంగంలా తయారయిన తన మనస్సుకు శాంతిని చేకూర్చే సలహా కావాలన్నట్టు వివరించింది.

అక్కయ్యకు వ్రాసిన లేఖకు సమాధానం కోసం కూడా ఉమాశశి వారం రోజులపాటు తీక్షణంగా నిరీక్షించవల్సి వొచ్చింది ఆ తర్వాత అమరేశ్వరి వ్రాసిన లేఖ వొచ్చింది.

'ప్రియమైన చెల్లెలికి

...నీ లేఖను చూచి నేను చాలా ఆదుర్దా పడ్డాను. కాని నువ్వు తొందరపడ్డావనీ, ఆ తొందరపాటుతో మానసిక వ్యథతో అనవసరంగా నలిగిపోతున్నావనీ - అనే సాహసాని కొడిగట్టను తరుణం వచ్చేప్పటికి పువ్వు పూయకమానదు; కాయ పండకవూరుకోదు. అలాగే వయస్సుతో హృదయం సహజంగా స్పందిస్తుంది. ఆ హృదయ స్పందనలో ఆత్మ నిగ్రహానికీ, మనోబలానికీ కట్టుబడివుండడం రానున్న పరిణామాలపై దృష్టిని కేంద్రీకరించటం అందరికీ సాధ్యపడదు. అయస్కాంత శక్తికి లోబడినట్టు బలహీనంగా లోబడిపోవడం కద్దు. అట్లాంటి ప్రమాదం జీవితంలో ఒక దశలో చాలామందికి సంభవిస్తూ వుంటుంది. ఆ ప్రమాదం దుష్ఫలితాల్ని కలుగజేస్తుందో సత్ఫలితాలకు దారితీస్తుందో ఊహించటం కష్టం. ఏ ఫలితాలు ఏర్పడతాయనేది కాలగమనమే చెప్పాలి. విధియే జోస్యం పలకాలి 'నా కర్తవ్య మేమిటి? ఈ పరిస్థితుల్లో నేనేం చేయాలి? మార్గదర్శకమైన నీ సలహా కోసం వేయి కన్నులతో ఎదురు చూస్తూవుంటాను' అంటూ ఆవేదనపూరితంగా వ్రాశావు. నేను మటుకేం సలహా ఇచ్చేది? భవిష్యత్తుకూ, జీవిత శాంతి సౌఖ్యాలకూ, చెరగిపోని అనుభూతులకూ సంబంధించిన యీ వ్యవహారంలో - నీ మనస్సే నీకుదారి, నీ హృదయమే నీకుబలం, నీ ఆత్మే నీకు శ్రీరామరక్ష. అలాంటి విషయాలపై ఎంత ఆత్మీయులైనప్పటికీ ఒకళ్ళపై ఆధారపడడం వాళ్ళ సలహాల ప్రకారం జీవి

తాన్ని గురించి నిర్ణయాన్ని తీసుకోవడం, యాంత్రికంగా ప్రవర్తించడం - ధర్మం కాదు; సమంజసం కాదు.

కాని ఒక్క సంగతి చెప్పగలను డాక్టరుగార్ని ప్రేమించ బూనుకోవటంలో సరైన పంథాయే అనుసరించావు. అంతటి మహనీయమైన వ్యక్తిని ఆరాధించడం నీ హృదయం నీకు చక్కని మార్గం చూపింది. ఆయన సద్గుణ సంపన్నతను గుర్తించడంలో నీ మనస్సు మంచి తీర్పు యిచ్చింది. ఆయన ప్రేమను పొందగలిగి, ఆయనను వివాహం చేసుకోగల్గితే - నీ జీవితం ధన్యమౌతుంది. ఆయన హృద యంలో స్థిరమైన స్థానాన్ని నువ్వు సంపాదించ గల్గితే - నీ బ్రతుకు శాంతినిలయంలోవలె సంపూర్ణమైన శాంతిని పొంద గలదు. ఆ అదృష్టం కోసం నువ్వు దృఢమైన చిత్తవృత్తితో, సంపూర్ణమైన ఆత్మ విశ్వాసంతో ప్రయత్నిస్తే - తప్పక విజ యాన్ని సాధించగలవని మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను.

నీ అక్కయ్య, అమరేశ్వరి

అమరేశ్వరి వ్రాసిన ఆ సమాధానం పూర్తిగా సంతృప్తిపరచలేదు ఉమాశశిని. కాని తనపై అక్కయ్యకు సానుభూతి వుందని గ్రహించి సంతోషపడింది. మనోబలాన్ని ద్విగుణీకృత పచ్చుకుంది.

పరీక్షలు ప్రారంభమైనాయి. ఉమాశశి రోజూ పరీ క్షలు వ్రాస్తూన్నదిగానీ - ఏం వ్రాస్తున్నదో, ఏమిటో తెలి యని పరిస్థితుల్లో వ్రాయసాగింది. బి. ఏ. ప్యాసు కాగలననే

ధైర్యం ఆమెకు లేకుండాపోయింది. ఆ విషయాన్ని గురించి ఆలోచించడమే మానివేసింది. ఇంటిదగ్గరవాళ్ళ ఆత్మ సంతృప్తికోసమే పెద్దగా శ్రమపడి చదవకుండా పరీక్షలన్నీ వ్రాసింది

అప్పటికీ డాక్టరునుంచి ఉమాశశికి లేఖ రాలేదు.

శీతారామయ్య పెళ్ళి రాయబారాలు జోరుగా జరుపుతున్నాడు. కట్నం కానుకలు ఖరారు చేసుకున్నారు ఒక రోజు పిల్లవాని తల్లిదండ్రులు గుంటూరువచ్చి ఉమాశశిని చూశారు అందచందాలు బాగా నచ్చాయి. పిల్లను పిల్లవాడు చూడాలా? అన్న ప్రసక్తిని శీతారామయ్య తీసికొని రాగా "పిల్లకేం బంగారుబొమ్మ మేం చూశాంగా. ఇక వాడు ప్రత్యేకంగా చూసేదేమిటి?" అన్నాడు పిల్లవాని తండ్రి ధనంజయరావు త్వరలో ముహూర్తం పెట్టుకొందామనుకున్నారు.

ఒకరోజు రాత్రంతా ఉమాశశి నిద్రలేకుండా ఆలోచించి, ఆలోచించి, తెగింపుతో కూడుకున్న ఓ నిర్ణయాని కొచ్చి, ఇంట్లో ఎవ్వరితోను చెప్పకుండా ఉదయం ఎనిమిది గంటల బస్సులో నాగార్జునసాగర్ వెళ్ళింది. చెల్లెలి రాకకు అమరేశ్వరి ఆశ్చర్యపడింది.

"ఏమిటీవిశేషం?" అన్నది అమరేశ్వరి ఆశ్చర్యాన్ని దాచుకోకుండా.

"దాదాపు నా పెళ్ళి ఖాయమైనట్లే. ముహూర్తం ఒక్కటే మిగిలిపోయింది.

"మామయ్య కుదిర్చే సంబంధమేనా? నిన్న నాన్న ఉత్తరం వ్రాశాడులే - బహుశా వొచ్చే నెలలో పెళ్ళి జరగ వచ్చని."

"ఈ పెళ్ళి నేను చేసుకోనక్కా" అన్నది ఉమాశశి స్థిర గంభీర స్వరంతో.

అమరేశ్వరి ఏం మాట్లాడలేకపోయింది. చెల్లెలి నిర్ణయంలోని గట్టిదనాన్ని గ్రహించింది.

"డాక్టరు కరుణానిధిగారు నా ఉత్తరానికి సమాధానం వ్రాయలేదు. ఆయన మనోభిప్రాయమేమిటో ఖచ్చితంగా తెల్సుకుందామని వొచ్చాను. అప్పటివరకూ నా మనస్సుకు శాంతిలేదు మార్గమంటూ ఒకటి ఉన్నదని తెల్సుకున్నాక, కష్టనష్టాలకోర్చి, ధైర్యంతో ఎంత దూరమైనా ప్రయాణం చేయవచ్చు. గమ్యస్థానం చేరుకోవచ్చు.

"నువ్వు అంటూన్నది సబబే ఉమా! దారులు తెలియని ఎడారిలో ఎంతదూరం ప్రయాణిస్తేమటుకు ఫలితం యేముంది? నాలుగు దారులు కల్సిన కూడలిలో భగవంతుడు మనల్ని విడిచి నప్పుడు - మూసివేయబడన దారినే మనం కని పెట్టి ప్రయాణం చేయాలి. కొంత దూరం ప్రయాణించాక 'ఈ రహదారి మూసివేయబడినది' అని తెల్సికొని మళ్ళీ ఇంకో దారిన ప్రయాణం చేయాలంటే ముఖ్యంగా స్త్రీలకు సులభ సాధ్యంకాదు."

"ఈ సాయంత్రమే డాక్టరుగారి దగ్గరకు వెళతాను" అన్నది ఉమాశశి. అలాగే అన్నట్టు తల ఆడించింది. అమరేశ్వరి.

మోహన్‌కుమార్ ఊళ్ళోలేడు. రెండు రోజులక్రితం కంట్రాక్టరు సూర్యనారాయణతో కలిసి హైదరాబాద్ వెళ్ళాడట రాలేదు.

ఆ సాయంత్రం ఉమాశశి మునుపంతా ఆశలదీపాలంతో వెలుగుతూండగా హాస్పటల్‌కు వెళ్ళింది డాక్టరు కరుణానిధి కోసం నేరుగా. కన్సల్టింగ్ రూమ్‌లోకి వెళ్ళింది. ఆ గదిలో డాక్టరు కరుణానిధి కూర్చుండే కుర్చీలో మరొకవ్యక్తి కూర్చొని వుండడాన్ని చూచి నిర్ఘాంత పోయింది ఉమాశశి

'ఏమండీ! ఏం కావాలి? అన్నట్టు చూశాడు కొత్తగా హాస్పటల్‌కు వచ్చిన డాక్టర్ రఘురామ్;

ఆ సమయంలో ఆ గదిలోకి వచ్చిన కాంపౌండరు జగన్నాథరావు, "డాక్టరు కరుణానిధిగారు నెలరోజుల క్రితం మచిలీపట్నాం ట్రాన్స్‌ఫర్ అయినారండీ" అన్నాడు ఉమాశశితో.

ఆమె క్షణంకూడా అక్కడ నిలబడలేక పోయింది. దుఃఖాక్రాంత హృదయినియై గబగబా ఇంటికి వొచ్చింది. విషాదం గూడుకట్టిన చెల్లెలి వదనాన్ని గమనించి అమరేశ్వరి విచలితయై "డాక్టరుగారు ఏమన్నారు ఉమా?" అన్నది.

అమరేశ్వరి వొచ్చింది. మోహన్‌కుమార్ పనుల వొత్తిడివల్ల పెళ్ళిరోజు ఉదయం వస్తానన్నాడట.

ఉమాశశి ముభావంగా, గంభీరంగా, మూర్తీభవించిన విషాదంతో వుంటూన్నది. ఇంట్లో తల్లీదండ్రీ, మామయ్యా ఎవరు పలుకరించినా ముక్తసరిగా మాట్లాడటం తప్ప మనస్సు విప్పి మాట్లాడటంలేదు. పెళ్ళికి కొత్తచీరలుకొనే సందర్భంలో ఆమెను బజారుకురమ్మంటే 'రాను' అన్నది. 'రాళ్ళనక్లెసు చేయించుకుంటావా!' అని తల్లి అడిగితే 'అక్కర్లేదు' అన్నది 'కొత్తగాజులు తొడిగించుకో పెళ్ళికూతురా! అని మేనమామ భార్య అంటే నిర్లక్ష్యంగా చిరునవ్వు' నవ్వింది. ఆమెను చూస్తూంటే-ఇంట్లో వారందరికీ ఓ విధమైన భయంగ కలుగుతూన్నది. వేళకు భోజనం చేయదు. ప్రొద్దస్తమానమూ ఆ మేడమీది గదిలో ఆకులు రాల్చుకున్న చెట్టులా దీర్ఘంగా ఆలోచిస్తూ వుంటోంది.

అమరేశ్వరి పలుకరించినా సరిగ్గా సమాధానం చెప్ప లేదు ఉమాశశి

"ఫలితాలనూ, పరిస్థితులనూ దృష్టిలో పెట్టుకోకుండా మనం అనేకపనులు చేస్తూవుంటాము. అందులో ప్రేమించటం కూడా ఒకటే. ఒక స్త్రీ ఒక పురుషుడ్నిగానీ, ఒక పురుషుడు ఒక స్త్రీనిగానీ ప్రేమించటానికి ఆటంకాలుండవు. ఎటొచ్చీ ఆ స్త్రీగానీ, పురుషుడుగాని తమకుతాము 'ఇది ప్రేమ' అని తెల్సుకొని, ఆమోద ముద్రకోసం సమాజానికి విజ్ఞాపన పత్రం సమర్పించినప్పుడే వొచ్చే చిక్కులూ, సంఘర్షణలూ

కడుపులో పడదోసుకొస్తూన్న దుఃఖాన్ని గొంతులో బిగించి - "డాక్టరుగారు ఇక్కడలేరట అక్కా. బందరు ట్రాన్సఫర్ అయినారట" అన్నది ఉమాశశి.

బరువుగా నిట్టూర్చింది అమరేశ్వరి. జీవితంలో దురదృష్టం కళ్ళు తెరిచినప్పుడు - కసితీర్చుకుంటూన్నట్టూ పరిస్థితులు కాపలాకాస్తూంటాయి.

ఆ మరునాటి ఉదయం బస్సులో ఉమాశశి గుంటూరు వెళ్ళింది.

## ౧౦

ఉమాశశి వివాహానికి శుభముహూర్తం నిశ్చయించబడింది. పెండ్లి ప్రయత్నాలు జోరుగా సాగుతూన్నవి. సీతారామయ్యగారు లాయరుగారింట్లోనే వుండిపోయారు. పెళ్ళి అయిపోయి, వధూవరులిద్దరూ మూడు నిద్రలు చేసి వచ్చేవరకూ తనకి ఊపిరాడదని చెప్పుకుంటున్నాడు. ముఖ్యమైన కేసులకు తప్ప సుందరరామయ్యగారు కోర్టుకు వెళ్ళటంలేదు. సరస్వతమ్మ పిండివంటల హడావుడిలోవుంది. పెళ్ళి వారంరోజుల వున్నదనగా అమరేశ్వరిని రమ్మని ఆవిడ భర్తచేత ఉత్తరం వ్రాయించిందిగానీ, పెళ్ళి మూడురోజులు వుందనగా

విషాద సంఘటనలూ, ప్రేమించడం నేరకాదు. సౌందర్యాన్ని సంగీతాన్నీ, సాహిత్యాన్నీ ఎట్లా ప్రేమిస్తామో - వాటి కలిత మైన విలువల్నీ, అనుభూతుల్నీ మరొక వ్యక్తి సాన్ని హిత్యంలో సాహచర్యం ద్వారా జీవితంలో ప్రతిష్ట చేసికొనేందుకు పాటుబడటం తప్పుకాదు. కాని ఒక ప్రాథమిక సత్యమేమిటంటే; మనం అనుకున్నట్లు ఏదీ జరుగదు విధిని వశపర్చుకొనే బలం మనకులేదు. మన ఆజ్ఞానువర్తినియై విధి మన నీడలలో నడిచిరాదు. అడ్డదిడ్డంగా నడిచే దాని నడకల లోనే మనం నడువాలి. అలాంటి శక్తి దానికి వుండబట్టే - జీవితాల్లో యింత కల్లోలమూ, అస్పష్టతా, అనివార్య పరిస్థితులూ విధినీ, అది కల్పించే అజ్ఞాత పరిణామ వికల్పాలనూ లక్ష్యపర్చకుండా మొండి ధైర్యంతో, ఆత్మ బలసంపన్నతతో - ఫలితాలపట్ల దృష్టిలేకుండా పరిస్థితులకు ఎదురు నడిచేవాళ్ళువుంటారు. తమ కృషిలో, దృక్పథంలో చివరకు విజయాన్నికూడా సాధిస్తారు. జీవితంలో దృఢమైన నిర్ణయాన్ని తీసికొని, వాటి ముందుచూపుతో బ్రతుకు బాటలో ప్రయాణించాల్సిన అవసరాలు తటస్థిస్తాయి. అట్లాంటప్పుడు పటుతరమైన మనోనిబ్బరాన్నీ, విచక్షణా జ్ఞానాన్ని ఆత్మవిశ్వాసపు గట్టితనాన్నీ ఉపయోగించుకోవాలి. ఈ పెళ్ళి నీకిష్టంలేదు అయినప్పటికీ అమ్మా, నాన్నా వాళ్ళు అధికార దార్ఢ్యాన్ని వినియోగించి, నీకీ పెళ్ళి చేయబూనారు. ప్రయత్నాలన్నీ వడిగా జరుగుతున్నాయ్. నిన్ను పెద్ద సుడిగుండంలోకి అయినవాళ్ళంతా బలవంతాన నెట్టుతూన్నట్టు

భావిస్తున్నావు. అవును నిజమే! పరాధీనచిత్తంతో భర్తతో కాపురం చేయడం సుడిగుండంలో ఊపిరాడకుండా గిరున తిరగడంలాంటిదే! అలాంటి స్త్రీ సుఖశాంతుల్ని పొందలేదు కాని డాక్టరు కరుణానిధిగారి మీద నీకు గల ప్రేమాభిమానాలు భిన్నమైనవి. నీ మనస్సులో ఆయన రూపానికి గుడి కట్టావుగానీ, ఆయన హృదయంలో నీకుగలస్థానాన్ని తెల్సికోలేకపోయావు ఒకవేళ ఈ పెళ్ళినికాదని, డాక్టరుగార్ని అర్థిస్తే-ఆయన తిరస్కరిస్తే, అప్పుడు నీపరిస్థితేమిటి? మళ్ళీ మొదటికి రావాల్సిందేగా? ఎవరినో ఒకళ్ళను వివాహమాడవల్సిందేగా! నీ పరిస్థితిని నువ్వు సమీక్షించుకుంటే యింతగా దుఃఖపడక్కర్లేదు ఉమా!" అన్నది అమరేశ్వరి.

నీళ్ళు నిండిన కళ్ళతో అక్కయ్యకేసి దీనాతి దీనంగా చూస్తూ కూర్చుంది ఉమాశశి.

తల్లి పిలవగా అమరేశ్వరి మేడమెట్లు దిగి క్రిందకు వెళ్ళింది.

* * *

బందర్లో బస్సు దిగేప్పటికి రాత్రి ఎనిమిదిన్నర అయింది. ఉమాశశి వెంటనే రిక్షా ఎక్కి గవర్నమెంటు హాస్పటల్‌కు పోనివ్వమన్నది. రిక్షా వడిగా వెళుతోంది. వీధుల్లో విద్యుద్దీపాలు "ఎందుకొచ్చిన ఈ బ్రతుకు!" అన్నట్టు నిర్జీవంగా వెలుగుతున్నాయి. వీధుల్లో సందడి ఇంకా సద్దుమణగలేదు.

'ఇది జీవితంలో గొప్ప సాహసమే! కనిపెంచిన తల్లిదండ్రుల ప్రేమ వాత్సల్యాన్ని విడనాడి, ఆత్మీయ బంధనాల్ని తెంచుకొని, వాళ్ళ పరువు ప్రతిష్టల్ని, గౌరవ మర్యాదల్ని బజారు కెక్కించి - పెళ్లి రేపనగా నేను ఇలా తప్పించుకురావడం అక్కయ్యనుకూడా దిగ్భ్రమపర్చి వుంటుంది. కాని ఇంతకంటె నాకు మరో మార్గమేముంది? తల్లిదండ్రులు నిర్ణయించిన సంబంధాన్ని చేసికోవాలి. అది ఇష్టంలేదు. మనస్సు ఇంకొకరికై లగ్నంచేసి, హృదయాన్ని ఇంకొకరికి అప్పజెప్పి, ఆత్మలో ఇంకొకర్ని ఆరాధించుతూ - తల్లిదండ్రులు నిర్ణయించిన వ్యక్తిని ఎలా వివాహమాడటం? నా ఇష్టంలేకుండా వాళ్ళు పట్టుదలతో, దౌర్జన్యంతో, మూర్ఖంగా పెళ్ళి చేయాలనుకున్నారు. అక్కయ్య పెళ్ళికూడా అలానే చేశారు. అక్కయ్య త్యాగజీవి కనుక ఒప్పుకుంది. ఇప్పుడు తెగిన గాలిపటంలాంటి భర్తతో జీవితంలో దుఃఖానుభూతుల్నే పొందుతూన్నది. అలా నేను కూడా జీవితాన్ని ఎందుకు నరకం చేసికోవాలి? డాక్టరు కరుణానిధిగారు కరుణార్ద్ర హృదయులు. శిష్టస్వభావులు. సత్ప్రవర్తనగల వారు. ఆయనగారు తప్పకుండా నా సాహసాన్ని మన్నించి తన హృదయంలో చోటునిచ్చి నా జీవితాన్ని రక్షిస్తారు. ఆ ఆత్మవిశ్వాసమే లేకపోతే ఈ సాహసం ఎందుకు చేస్తాను?' అనుకున్నది ఉమాశశి రిక్షాలో.

గవర్నమెంటు హాస్పటల్ దగ్గర రిక్షా దిగి నైట్ వాచర్‌తో డాక్టరుగార్ని గురించి వాకబు చేసింది ఉమాశశి.

'పగలు డ్యూటీ అనీ, ఇంటిదగ్గర వుంటారనీ' చెప్పాడు నైట్ వాచర్. 'ఇల్లు ఎక్కడ?' అని ఆమె అడగ్గా, స్వయంగా అతనే రామానాయుడుపేటలో ఉన్న ఒక చిన్న మేడ దగ్గరకు తీసికెళ్ళాడు. మేడ క్రింది భాగమంతా చీకటిగా వుంది - అస్పష్టంగాపడే వీధి విద్యుద్దీపపు కాంతి మినహాయించి. మేడ పైన లైటు వెలుగుతూంది నైట్‌వాచర్ గేటు తెరచి లోపలికి తీసికెళ్ళి అమ్మగార్ని పిలిచాడు అన్నపూర్ణమ్మ తలుపు తెరిచింది మేడ వరండాలో నిలబడ్డ ఓ పద్దెనిమిదేళ్ళ యువతిని చూసి ఆవిడ ఆశ్చర్య చకితమైంది.

"ఈమెగారు గుంటూరునుంచి వచ్చారు. అయ్యగార్ని చూడాలట" అన్నాడు నైట్‌వాచర్.

ఆవిడ ఆశ్చర్యాన్నుంచి కొంచెం ఆలస్యంగా తేరుకొని మేడపైకి చూపెట్టింది - పైన ఉన్నాడు అన్నట్టు

మేడమెట్లెక్కి నెమ్మదిగా పైకి వెళ్ళింది ఉమాశశి. ఆమె చేతిలో చిన్న సూటుకేసు వుంది. అందులో కొంత డబ్బూ, నగలూ, చీరెలూ ఉన్నాయి

మెల్లగా తలుపు తట్టింది ఉమాశశి. చుట్టూ వాతావరణంలో నిశ్శబ్దం రాజ్యం చేస్తూండడంవల్ల - ఆ చిన్న చప్పుడు పెద్దదిగానే వినవచ్చింది.

"ఎవరూ?" అన్న కేక లోపల్నుంచి వినబడింది. డాక్టరు స్వరాన్ని ఆమె గుర్తుపట్టింది ప్రాణంపై చల్లనిగాలి వీచినట్లయింది.

మళ్ళీ తలుపు తట్టింది ఉమాశశి.

డాక్టరుగారు తలుపు తెరిచాడు.

ఎదురుగ్గా నిలబడ్డ ఉమాశశిని చూచి సంభ్రమాశ్చర్య చకితుడైనాడు డాక్టరు. అంతలోనే తేరుకొని "లోపలికిరండి" అన్నాడు. ఆమె లోపలికి భారంగా నడిచింది. కుర్చీలో కూర్చుంది

రెండు నిముషాలపాటు ఇద్దరిమధ్య మౌనం ప్రయాణం చేసింది డాక్టరు నైట్ డ్రెస్‌లో ఉన్నాడు. పైజామా, లాల్చీ వేసుకున్నాడు ఏదో ఇంగ్లీషు నవల చదువుతూన్నట్టు న్నాడు - తెరచి టేబుల్ లైటు పక్కన పెట్టబడివుంది.

ఉమాశశి ఆ గదినంతా కలయజూసింది. రెండు బీరువాలనిండా పుస్తకాలున్నాయి. కిటికీ ప్రక్కని డెస్క్. ఆ చెంతనే అందమైన టేబుల్ ల్యాంప్. కొంచెం దూరంలో సోఫాసెట్. గోడలకు 'పార్కు-డేవిస్' 'ఐ. సి. ఐ.' వారి క్యాలెండర్లు రెండు మెడిసిన్‌తో వొచ్చిన అభివృద్ధిని చిత్రిస్తూన్న బొమ్మలతో ఉన్నాయి. డాక్టరు రెండుమూడు సార్లు పరిశీలనగా ఉమాశశికేసి చూశాడు — సంభాషణ ఎట్లా ప్రారంభించాలో తెలియక.

మౌనాన్ని భరింలేక ఉమాశశియే ముందుగా మాట్లాడింది. "నేను వ్రాసిన లేఖ మీకు అందినదను కుంటాను."

"ఊఁ!" అన్నాడు డాక్టరు ముక్తసరిగా.

"మీ నుంచి సమాధానాన్ని ఇంత కాలంనుంచీ నిరీక్షించాను"

డాక్టరు ముఖాన్ని గోడ ప్రక్కకు తిప్పుకున్నాడు. ఉమారాణి గుండె పళ్ళ చక్రం మధ్య నలిగినట్లయింది.

"నేనిప్పుడు నిర్జీవ ప్రతిమను. ఈ ప్రతిమకు ప్రాణాన్ని పోసే బాధ్యత మీదే. లేక ఈ ప్రతిమనట్లే నిరాదరణ చూపి శిథిలావస్థకు గురిచేస్తే 'ఈ జన్మకీ బ్రతుకింతేను' అనుకుంటూ కళ్ళు మూస్తాను మీ యందుగల అచంచలమైన విశ్వాసంతో, ఆత్మబలంతో, మనోనిబ్బరంతో - రేపు జరుగబోయే నా పెళ్ళిని కాదని సాహసంతో ఇట్లావొచ్చాను. నా జీవితానికి రెండే రెండు పరిష్కారమార్గాలున్నాయి. ఒకటి వెలుగుకు మార్గంచూపుతుంది, రెండోది శాశ్వతమైన చీకటికి దారి చూపుతుంది నన్ను కరుణించి మీ హృదయంలో స్థానాన్ని కల్పించి, వివాహం చేసికుంటే నా జీవితం తేనె సోనల మధురిమతో వెలుగు వెన్నెల్ని పరుచుకుంటుంది. నన్ను నిర్దయగా తృణీకరించితే - ఆత్మహత్యే శరణ్యం. నా బ్రతుకూ, భవిష్యత్తూ మీ చేతుల్లోనే ఉన్నాయి. నా హృదయం పూర్తిగా మీకు అర్పించబడింది. మనస్సులో మీకు పవిత్రంగా దేవాలయాన్ని నిర్మించుకొని, మీ విగ్రహాన్ని అహర్నిశమూ ఆరాధిస్తూన్న నేను మరొక వ్యక్తిని ఎలా వివాహం చేసుకొనేది? పరిస్థితుల ప్రాబల్యతవల్ల అలా వివాహం చేసుకొని మనసులేని మనువుతో, ఆత్మవంచనతో

బ్రతుకును దుఃఖభాజనం చేసికొనేకంటె-మీవల్ల తిరస్కృతిని పొంది మరణించడం మేలని వొచ్చాను." ఉమాశశి గొంతులో తీవ్రమయిన దుఃఖం వొణికింది.

డాక్టరు స్తబ్ధ గంభీరతతో నిరుత్తరుడైనాడు కొన్ని నిముషాలపాటు. తన నిర్లక్ష్యం, మౌనం తిరస్కారాన్ని తెలియబరుస్తుందన్న భావం - ఆమెను ఎలాంటి దారుణ పరిస్థితులకు దారితీసింది! తన గొంతుమీదకు తనే యీ ఉపద్రవాన్ని తెచ్చుకున్నాడు ఇప్పుడేం చేయాలి? ఈ సమస్యకు పరిష్కారమేమిటి? తను మొదట్లోనే తన అభిప్రాయాన్ని లేఖ ద్వారా వ్యక్తపరిస్తే - ఉమాశశి యింత సాహసానికి పాల్పడేది కాదేమో! ఇలా ఉమాశశి తనపై ప్రేమను గట్టిపర్చుకొని, తన రూపాన్ని ఆరాధిస్తూ, తనని పెళ్ళి చేసికొనమని ధైర్యంగా, నిస్సహాయంగా అర్థిస్తుందనీ - తను సమాధానం చెప్పవల్సి వుంటుందనీ ఆలోచించలేదు. డాక్టరు ఉక్కిరి బిక్కిరైనాడు జవాబు చెప్పేందుకు.

"మీరిట్లు ఇంత నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తూ, మీ ఉత్తరాలకు సమాధానాలు వ్రాయకుండా, మీలో అపోహల్ని కలిగించి - మిమ్మల్ని యీ దుస్థితికి గురిచేసినందుకు క్షమించండి ఉమాశశిగారూ. నా మౌనాన్ని తిరస్కారంక్రింద భావించి మీరు మనస్సు మార్చుకుంటారని అనుకున్నాను. మీరు నన్ను గాఢంగా ప్రేమించవచ్చు; హృదయంలో అపూర్వమైన స్థానాన్ని కల్పించి, అహర్నిశమూ ఆరాధించవచ్చు. మీరు వివేకరహితంగా, ఎండమావుల్ని చూసి

మోహపడ్డట్టు నిందించను. కాని నా పరిస్థితి వేరు నా హృదయ గతస్థితిని గూర్చి మీకు సంపూర్ణంగా తెలియదు ఇప్పుడు చెబుతున్నాను, వినండి నేను ప్రేమలో పరాజయాన్ని పొంది ఆ దెబ్బతో యింకిపోని వైరాగ్యంతో, మనస్సుతో రాజీ పడలేక బ్రతకలేక బతుకుతున్నాను. ప్రాపంచిక విషయాలపై అంత నిర్లప్త్యానికి అదే కారణం. ప్రేమలో విరిగిన మనస్సుకు శాంతిని వృత్త్యగ ధర్మంలో అన్వేషిస్తున్నాను. కాని మధుమేహం వున్నవానికి గాయంమానన ట్టు నా మనస్సుకు తగిలిన ఆ గాయం మానుటలేదు. మీమీద నాకు సానుభూతివుంది, దయార్ద్రత వుంది. నిర్మలమైన మీ ప్రేమాభిమానాలపట్ల విశ్వాసముంది కాని ఏం ప్రయోజనం? చెట్టునుండి కొమ్మను వేరుచేస్తే-మళ్ళీ ఆ కొమ్మ చెట్టుకు అతుకుతుందా? అలాగే ఒకసారి ప్రేమలో విఫలమైన తర్వాత మళ్ళీ ఆ ప్రమాదంలో మనస్సు చిక్కుకుంటుందా?"

హతాశురాలైంది ఉమాశశి.

"మీరు ఎవర్నయినా ప్రేమించారా? ఎవరామె?" అన్నది ఉమాశశి వ్యగ్ర చిత్తయై.

మాట్లాడే ముందు డాక్టరు ఆమె నేత్రాంచలాల్లోకి నిశితంగా చూశాడు.

"అవును మీ అక్కయ్య అమరేశ్వరిని."

విద్యుద్ఘాతానికి గురైనట్టు నిశ్చేష్ట ప్రతిమ యైంది ఉమాశశి.

"మెడికల్ కాలేజీలో మేమిద్దరమూ ప్రేమించు కున్నాం. వివాహం చేసుకుని నిర్మలానందమయ వీచికల్లో తేలిపోదామని కలలుగన్నాం. కాని మాతల్లిదండ్రుల మొండి పట్టుదలవల్ల మా వివాహం జరగలేదు. భగ్నప్రేమికులమై నాము. ఆమె మోహన్‌కుమార్ గారిని వివాహం చేసికొంది. భర్త సాన్నిధ్యంలో నన్ను మర్చిపోవడానికి ప్రయత్నిస్తూంది. కాని నా మనస్సులో ఇంకా అమరేశ్వరి మెదలుతూనే వుంది. ఆమెనింకా అదేపనిగా తల్చుకోవడం ధర్మంకాదనీ పూర్తిగా మర్చిపోదామనీ ఎంత ప్రయత్నించినా వీలుపడటంలేదు" అన్నాడు డాక్టరు.

"మీరు వివాహం చేసుకోండి. భార్యను ప్రేమించడం ద్వారా ఆమెను మర్చిపోవచ్చు" అన్నది ఉమాశశి 'షాక్' నుంచి తెప్పరిల్లి.

"అంత తేలికకాదు"

"కాకపోవచ్చు. కానీ చేసుకుతీరాలి. ఒక పని కి విధి అనుకూలించనప్పుడు - మరో పనిద్వారా ధర్మాన్ని తీర్చుకోవడం సమంజసం గదా! మీరు మరో వ్యాపకం ద్వారా మనస్సు మార్చుకోక, వివాహం చేసికోక ఆమెకోసం జీవితం కొసవరకూ దుఃఖిస్తూ కూర్చోవడంవల్ల ప్రయోజనమేముంది? మార్పు కొత్తపంథా మళ్ళీ జీవితంమీద మమతల్ని కలిగిస్తాయి."

బలహీనంగా నవ్వాడు డాక్టరు కరుణానిధి.

"ఏమైనా మీరు ముందు ఆలోచన లేకుండా పెద్ద సాహసమే చేశారు. ఇప్పుడైనా మించిపోయిందేమీ లేదు ఇంటికి వెళ్ళండి. తల్లిదండ్రులు నిర్ణయించిన వరుడ్నే పెళ్ళి చేసుకోండి. ఆయనగారిమీద ప్రేమానురాగాల్ని పెంచుకొంటూ జీవిత సుఖాన్ని పొందండి. అదే వుత్తమమైన మార్గం. నా మానసికస్థితి బావుండలేదు. మరో స్త్రీని ప్రేమించలేను. మిమ్మల్ని నిరాకరిస్తూన్నందుకు, మీకు ఆశాభంగం కలిగిస్తూన్నందుకు క్షమించండి నన్ను మర్చిపోండి. భగవంతుడు మీకు మేలుచేస్తాడు. ఇంటికివెళ్ళి ఆ సంబంధాన్నే చేసుకోండి. మీరిట్లా రావడంవల్ల మీ తల్లిదండ్రులెంత క్షోభపడుతున్నారో! అన్ని ప్రయత్నాలు చేసికున్న వివాహం మీ వల్ల ఆగిపోవడం - మీ తల్లిదండ్రుల పరువు ప్రతిష్ఠలకెంతటి గొడ్డలిపెట్టు! ఇదేమైనా మీరు ఆలోచించారా? నా మాటవిని వెంటనే వెళ్ళండి. కారు పంపిస్తాను, వెళ్ళండి" అన్నాడు డాక్టర్ కరుణానిధి ఆవేశపూరితుడై కుర్చీలోంచి లేస్తూ.

కళ్ళల్లో నీళ్ళు గిరున తిరగ్గా పైటచెంగు ముఖానికి అడ్డుపెట్టుకుంది ఉమాశశి.

"మాయీ సలహా మీకు కఠినంగా, దయార్ద్ర రహితంగా వుండొచ్చు. కాని మీ శ్రేయస్సును కాంక్షించి నేను ఇంతకంటె మంచి సలహా యివ్వలేను. నా మాటలపై విశ్వాసముంచండి. జీవితంలో తప్పకుండా సామరస్యాన్ని

కుదుర్చుకొని కోరిన సుఖశాంతుల్ని పొందగలుగుతారు"
అన్నారు కరుణానిధి అనునయంగా.

ఆపైన పెద్దులోవున్న డ్రైవర్ను కేకవేసి, కారుసిద్ధం చేయమన్నాడు డాక్టరు కరుణానిధి.

ఉమాశశి గుండె కన్నీటి కాలువలై స్రవించగా దుఃఖిస్తూ కుర్చీలో కూలబడివుంది.

## ౧౧.

అకస్మాత్తుగా ఉమాశశి అదృశ్యమయ్యేసరికి ఇంట్లో వాళ్ళంతా విపరీతంగా గాబరాపడ్డారు. తెల్లవారితే పెండ్లి అనగా ఆ రాత్రి యెవ్వరూ భోజనాలు చెయ్యలేదు_పెండ్లికి వొచ్చిన కొంతమంది బంధువులు మినహా. సరస్వతమ్మ గుండె బాదుకొంది. "అయ్యో! నా తల్లికి ఈ పెళ్ళి మొదట్నుంచీ ఇష్టంలేదు ఏ అఘాయిత్యానికి పాల్పడిందో, ఏమిటో? నాకు భయంగావుంది. ఎక్కడికి వెళ్ళిందో" లాయరు సుందర్రామయ్యగారు కోపోద్రేకాలతో పళ్ళుపటపట కొరకడం తప్ప సూటిగా ఏ వ్యాఖ్యానమూ విసరలేదు. శీతారామయ్య శివాలెత్తుతూ తిరుగసాగాడు. "ఎంతపని

చేసింది వుమాశశి? విద్యావతీ, గుణవంతురాలూ, విచక్షణా జ్ఞానంగలదీ అని మెచ్చుకుంటూన్న ఆపిల్ల యింత పాడుపని చేసి, తల్లిదండ్రులకు తలవంపులు తెస్తుందా? ఎంతఘోరం! ఈ ఇంటి గౌరవమర్యాదల్ని నిలువునా మంటగలుపుతుందా? యెంత సాహసం!" అన్నాడు సీతారామయ్య. అమరేశ్వరి లోలోపల చాల బాధపడిందిగానీ, బయటకు ఏమీ అనలేదు. బందరు డాక్టరుగారివద్దకు వెళ్ళిందేమో చెల్లెలు అనుకుంది. వొచ్చిన బంధువులు తలా ఒకవిధంగా మనస్సులో అనుకున్నారు. ఎవ్వరూ పెదివి విప్పి మాటాడలేదు.

నిద్రాహారాలు లేకుండా ఆ రాత్రంతా ఉమాశశికోసం ఎదురు చూశారు. ఆమెరాలేదు. పెండ్లి ఇంట్లో విషాదవాతావరణం ఆవరించింది. ఉదయం తొమ్మిది గంటలకుకూడా వుమాశశి ఇంటికి రాకపోయేప్పటికి లాయరుగారి సలహా తీసికొని శీతారామయ్య మగ పెండ్లివారికి కబురు చేశాడు — పెండ్లికి తరలి రావొద్దని.

శుభలేఖలు అందిన బంధువులూ, స్నేహితులూ, శ్రేయోభిలాషులూ అంతా వొచ్చారు. పెండ్లి ఇల్లు కళావిహీనంగా వుండేప్పటికి సంగతీ సందర్భాలు కనుక్కొని ముఖాలు బరువు చేసికొన్నారు. లాయరు సుందరరామయ్యగారు అవజ్ఞాభారంతో మేడమెట్లుదిగి క్రిందికి రాలేదు. పరస్వతమ్మ దేవునిగదిలో కన్నీరుమున్నీరుగా ఏడ్వసాగింది. ఆవిడను ఓదార్చటానికి అమరేశ్వరి ప్రయత్నించి విఫలు

రావలైంది. పురోహితులూ, ఊళ్ళో కొంతమంది పెద్దలూ కూడా వచ్చి వెనక్కి తిరిగి వెళ్ళారు.

శుభముహూర్తంవేళకుకూడా ఉమాశశి ఇంటికి రాలేదు. మరునాటి ఉదయంనుంచీ బంధువు లొక్కొక్కరే ఎవళ్ళ ఊళ్ళకు వాళ్ళు వెళ్ళసాగారు.

ఉమాశశి పెళ్ళి అట్లా అభాసుపాలైనందుకు లాయరు సుందరరామయ్యగారూ, సరస్వతమ్మ దిగులుతో మంచాలు పట్టారు. మోహన్‌కుమార్ వెంటనే నాగార్జునసాగర్ వెళ్ళాడు గాని, అమరేశ్వరి తల్లిదండ్రుల దుఃఖోపశమనంకోసం ఉండి పోయింది. ఓ వారంరోజుల తర్వాత ఆమెకూడా నాగార్జున సాగర్ వెళ్ళింది.

చెల్లెలు ఏమైందో, ఎక్కడుందో, డాక్టరుగారు తిరస్కరిస్తే ఏమైనా అఘాయిత్యానికి పాల్పడిందో - అమరేశ్వరికి భయం భయంగా ఉంది.

ఒకరోజు మధ్యాహ్నం అమరేశ్వరి నిద్రబోతూంటే బయట తలుపు తట్టబడింది. నిద్రనుంచి బద్ధకంగా మేల్కొ గానే "అక్కా! అక్కా! తలుపు తీయ్" అన్న కేకలు వినబడ్డాయి. ఉమాశశి గొంతును గుర్తుపట్టి చివుక్కున లేచి వచ్చి తలుపు తీసింది అమరేశ్వరి.

ఎదురుగా ఉమాశశిని చూసి ఆశ్చర్య మిళితమైన ఆనందాన్ని పొందింది అమరేశ్వరి. కాని అంతలోనే బాధా పూర్ణమైన భావం ముఖంలో అల్లుకొనగా వెనక్కి తిరిగి గదిలోకి నడిచింది.

"అక్కయ్యా! నన్ను క్షమించు" అంటూ ఉమాశశి కన్నీటి ముద్దయై అమరేశ్వరి కాళ్ళకు చుట్టవేసింది.

అమరేశ్వరి హృదయం ప్రేమవాత్సల్యంతో ఎండ వేసిమికి మంచుగడ్డయైంది. చెల్లెలి భుజాల్ని పట్టుకొని, పైకి లేవనెత్తి హృదయానికి గట్టిగా హత్తుకుంది. ఆమె కళ్ళు జల జల వర్షించాయి.

"కనిపెంచిన తల్లిదండ్రులకు తీరని ద్రోహం చేశానక్కయ్యా! నా ఆత్మవిశ్వాసం నన్ను మోసగించింది. నా మనోబలం నన్ను పెడత్రోవ పట్టించింది. నా హృదయం నా భవిష్యత్తును పాడుజేసింది. ఆశలతో మలయమారుతంలా ఆకాశంలో విహరించే నేను నేలపై నిస్సహాయంగా నిలబడ్డాను. నేనేం తప్పు చేశానని విధి నాకీ శిక్ష విధించిందక్కయ్యా!" అన్నది ఉమాశశి శోకోద్విగ్న చేతస్కురాలై.

"ఇంతకాలమూ ఎక్కడున్నావు ఉమా! అసలేం జరిగినది? ఇంట్లోంచి ఎందుకు పారిపోయావు? డాక్టరు కరుణానిధిగార్ని కలిసికున్నావా? వారేమన్నారు?" జడి వానలాగ ప్రశ్నల్ని కురిపించింది అమరేశ్వరి ఆతుర్దా కోలదీ.

"ఆ పెళ్ళి నాకు సుతరామూ ఇష్టంలేదని నీకు తెలుసు కదక్కా! ఒకవేళ మనస్సును రాయిచేసికొని ఆ వివాహం చేసికున్నా ఎడారిలో పువ్వులాగ జీవితమంతా వృథాగా, నిస్సారంగా, నిస్పృహతో గడపాలి. ఇరువురికీ సుఖశాంతులుండవు. తల్లిదండ్రుల పరువు మర్యాదల్ని దృష్టిలో పెట్టు

కొని నాజీవితాన్ని నాశనం చేసుకొనేది కాకుండా, ఆయన బ్రతుకులోకూడా నరకాన్ని సృష్టించటం దేనికని - ఎంతో ఆలోచించుకొని, మానసిక బలంతో, ఆత్మప్రేరేపణతో ఆరోజు రాత్రి బందరు వెళ్ళాను డాక్టరు కరుణానిధిగారి దగ్గరకు. ఆయనగారితో నా పరిస్థితినీ, నేను చేసిన సాహసాన్ని సవిస్తారంగా చెప్పాను. "మీరు తిరస్కరిస్తే ఆత్మహత్యే శరణ్య"మని అన్నాను. కాని నేను అన్ని విధాలా దురదృష్టవంతురాల్ని అక్కా. నాప్రేమను గుర్తించి; సానుభూతి కనబర్చారు గానీ - హృదయంలో చోటును ప్రసాదించి, వివాహానికి సుముఖులు కాలేదు. 'మీ అక్కయ్యా, నేనూ కాలేజీలో అత్యంత గాఢంగా ప్రేమించుకున్నాం. వివాహం చేసికొని మధురమైన జీవితాల్ని గడిపేందుకు కలలుగన్నాం. కాని మీ తల్లిదండ్రుల మొండి పట్టుదలవల్ల మా వివాహం జరగలేదు. ఆమె మోహన్ కుమార్‌ని వివాహం చేసికొని, భర్త సాన్నిధ్యంలో నన్ను మర్చిపోవడానికి ప్రయత్నిస్తుంది. కాని నా మనస్సులో ఇంకా అమరేశ్వరి మెదులుతూనేవుంది.... అన్నారక్కా. నేను నిర్విణ్ణురాలినైనాను. ఈ విషయం నాకెప్పుడూ చెప్పలేదేమక్కా" ఉమాశశి అక్కయ్య ముఖంకేసి చూసింది.

అమరేశ్వరి ముఖంలో హఠాత్తుగా నీలినీడలు కదులాడాయి. ముఖం కిందికి దించుకుంది. ఉమాశశి చెప్పుకుపోసాగింది.

"వెంటనే ఇంటికి వెళ్ళి తల్లిదండ్రులు నిర్ణయించిన

సంబంధాన్ని చేసికోమని. డ్రైవరు కారుయిచ్చి గుంటూరు పంపించారు. కాని జీవితంలో వివాహం చేసికుంటే డాక్టరు కరుణానిధిగార్నే వివాహం చేసికోవాలనే తీవ్రమైన పట్టుదలతో ఓ నిర్ణయానికొచ్చి, ఆ అర్ధరాత్రి విజయవాడలో ఓ స్నేహితురాలింట్లో దిగాను. ఇంతకాలమూ అక్కడే ఉన్నాను. నిన్ను ఓ సహాయం అర్థించటాని కొచ్చానక్కా. ఆ సహాయం నువ్వు తప్పకుండా చేస్తావనే విశ్వాసం నాకు సంపూర్ణంగా వుంది. డాక్టరు కరుణానిధిగారి విషయంలో నువ్వు జోక్యం కలిగించుకోవాలి. నిన్ను ప్రేమించి పరాజయం పొందిన దిగులుతో- నిర్వేదంతో నానాటికీ డాక్టరు మానసికంగా పతనం చెందుతున్నారు. ఆయన్ను అలాగే వదిలేస్తే చివరకు ఏమౌతారోనన్న భయం వేస్తోంది. నువ్వు ఎలాగైనా ఆయనగార్ని పెళ్ళికి ఒప్పించు అక్కా. వివాహం జరిగితే ఆయన మనస్సుకు స్థిమితం చిక్కుతుందేమో!"

వెచ్చని కిరణాలమధ్య చల్లనిగాలి వీచినట్లు నిట్టూర్పు విడిచింది అమరేశ్వరి. ఆ మరునాడే డాక్టరుగారికి ఓ లేఖ వ్రాసింది.

...డాక్టరు కరుణానిధిగారికి,

నమస్కారములు. మీ గురించి మా ఉమాశశి చెప్పగా విన్నాను. విపరీతంగా బాధపడ్డాను. మన ప్రేమ వ్యవహారాన్ని ఒక చెడ్డకలగా భావించి, నన్ను మర్చిపోతారని ఇన్నాళ్ళనించీ భావించాను. కాని మీరు నన్నే పదే పదే తల్చుకుంటూ, హృదయాన్ని కుళ్ళగించుకుంటూ

జీవితంపట్ల వైరాగ్యాన్ని పెంచుకుంటున్నారని తెల్సుకొని కలవరపడుతున్నాను. విజ్ఞానవంతులూ, వివేక సంపన్నులూ, ఆత్మ వైశాల్యంగలవారూ విశ్వజనీనతను కాంక్షించేవారూ, మనోదారుఢ్యంగలవారూనైన మీరే ఇట్లా సినిసిజానికి గురై మానసిక వ్యథతో మగ్గిపోతూ, బ్రతుకును గురించి నిర్లక్ష్యంగా వుంటే ఎట్లా?

"మనకు జీవితంలో ఎన్నో ఎదురు దెబ్బలు తగులుతూ వుంటాయి వాటిని గురించి ఆలోచిస్తూ, కృంగి కృశించిపోతే జీవితంలో ముందుకు పోలేము. ఎప్పటికప్పుడు పరిసరాల సహకారంతో భవిష్యత్తులో వెలుగును చూసేందుకే ప్రయత్నించాలి. మన వాంఛల ప్రకారం జీవితం మలుపు తిరక్కపోతే, 'ఎందుకిట్లా జరిగింది?' అనే తార్కికమైన దుఃఖంతో కాలాన్ని వ్యర్థపుచ్చేకుంటే-మలుపు తిరిగిన బాటలోనే జీవితానికి సార్థకత చేకూర్చుకోవటం విజ్ఞుల లక్షణం. మిమ్మల్ని ఉమాశశి అత్యంత గాఢంగా ప్రేమించింది. సంఘటనాపూర్వకమైన ఆ ప్రేమను ఆమె అంతవరకూ పటుతరం చేసికొని, 'మిమల్ని తప్ప జీవితంలో వివాహం చేసికోను' అన్న ప్రతిజ్ఞ తీసికొనే వరకూ వచ్చింది. ఆ ఉద్దేశ్యంతోనే, అన్ని ఏర్పాట్లూ చేయబడిన పెళ్ళినుంచి తప్పించుకొని - ఇంతకాలమూ అజ్ఞాతంగా ఓ స్నేహితురాలి ఇంట్లో కాలం గడిపింది ఆ పెళ్ళి తప్పిపోవడంతో పరువు ప్రతిష్ఠల కేర్పడిన భంగపాటుతో మా అమ్మా, నాన్న నిన్న మొన్నటివరకూ దిగులుతో మంచాలుపట్టారు. తన సాహసంలో ఆవిషయాన్ని

గురించికూడా ఆలోచించలేదు ఉమాశశి. ఆమె ప్రస్తుతం నా దగ్గరే వుంటూన్నది. ఆమెను మీరు పెళ్ళి చేసికొని, బ్రతుకుపై మమకారాన్ని పెంచుకొని, జీవిత మాధుర్యాన్ని చవిచూడాలని నా అభిలాష. మీరు పెళ్ళి చేసికొంటే, కొత్త బాధ్యతలమధ్య, గాఢమైన మమతలమధ్య, ఎడతెగని అనురాగాలమధ్య - పాత జ్ఞాపకాల్ని, పరిచయాన్ని, ప్రేమల్ని, అనుభూతుల్ని మర్చిపోవచ్చు. నా అభిలాషను తప్పక నెరవేరుస్తారని నిండైన విశ్వాసంతో. —అమరేశ్వరి

ఆరోజే తండ్రికికూడా లేఖ వ్రాసింది అమరేశ్వరి- ఉమాశశి తన దగ్గరకు వచ్చినట్టూ, క్షేమంగా వున్నట్టూ.

## ౧౨

కొత్త డాక్టరు రఘురామ్‌తో అసిస్టెంటు ఇంజనీర్ మోహన్‌కుమార్ చాల సులభంగా పరిచయం చేసికున్నాడు. ఆ పరిచయాన్ని వారంరోజుల్లో స్నేహంగా మార్చుకున్నాడు. ఇరువురూ అంత సన్నిహితంగా దగ్గరకు రావడానికి కారణం ఇరువురిఅలవాట్లలో సామ్యం కుదరడమే. డాక్టరు రఘురామ్‌కి క్లబ్బులంటే అమితమైన మోజు. పేకాట ఆడతాడు; టెన్నిస్ ఆడతాడు. ఉద్యోగ ధర్మాన్ని గురించి పట్టుదలలేదు. 'తన

సుఖం తర్వాతే ఏ కర్మమైనా' అనే స్వభావం కలవాడు. సామాజిక విధానాలపట్ల ద్వేషంలేదు, గౌరవంలేదు అహర్ని శనూ కులాసాగా వుండడమే అతని తత్వంలోని ప్రత్యేకత. మనిషికూడా అలాగే స్వేచ్ఛారంగా, ఎల్లప్పుడూ నవ్వుతూ, కొత్త చిగుళ్ళలాంటి ఉత్సాహంతో వుంటాడు.

ఓరోజు మాటలమధ్యలో వారిద్దరికీ డాక్టరు కరుణానిధి ప్రస్తావన వొచ్చింది. "అతను నా క్లాసుమేటే! అదో తరహామనిషి అందరితో కలిసిమెలిసి తిరిగే రకంకాదు తనకోసమే తను బ్రతుకుతూన్నట్టుండేవాడు. ఓ లవ్ ఎఫై యిర్‌లో చిక్కుకున్నాడు చివరకు ఆశాభంగమే పొందినట్టు న్నాడు. గుంటూరులో ఓ లాయరుగారి కూతురుంది అమరే శ్వరని. ఆమెకూడా మా క్లాస్‌మేటే! ఆమే కరుణానిధి గాఢంగా ప్రేమించుకున్నారు. పెళ్ళికూడా అవుతుందని అందరూ అను న్నారు. కాని ఆమెకు ఎవరో ఇంజనీరుతో వివాహం జరిగిందట. భగ్నమైన ప్రేమతో కరుణానిధి ఇంకా పెండ్లిచేసికోకుండా బ్రహ్మచారిగానే ఉన్నాడట" అన్నాడు డాక్టరు రఘురామ్

మోహన్‌కుమార్ ముఖం వివర్ణమైంది. ఒక్కసారిగా ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు. తన భార్యను గురించివున్న ఈ ప్రేమ వ్యవహారం తనకు తెలియదు. ఆమె తనకు స్వచ్ఛం దంగా అర్థంగాకపోవడానికి - అదే కారణమేమో? ఆరోజు కరుణానిధి తన యింటికి భోజనానికి వచ్చి అమరేశ్వరి కనబడ డంతో దిగ్భ్రమ చెందాడు. తర్వాత యింట్లో వుండేందుకు

చాల యిబ్బంది పడుతున్నట్టు కనబర్చాడు. అమరేశ్వరి అతని యెదుట నిలబడలేక తలనొప్పివంకతో గదిలో వెళ్ళిపడుకుంది. వారిద్దరూ ఒకప్పుడు గాఢంగా ప్రేమించుకున్నారన్నమాట !

తనభార్య ప్రేమగాథ విన్నమీదట మోహన్‌కుమార్ మనస్సు వికలమైంది. తలనొప్పిగా వుందనిచెప్పి వెంటనే ఇంటికొచ్చాడు.

అక్కా-చెల్లెళ్ళు వంటగదిలో వున్నారు.

మోహన్‌కుమార్ హాలులో కుర్చీలో కూర్చుని, కుడి చేతి మునివ్రేళ్ళతో నుదురు రుద్దుకుంటూ వుండగా పోస్టు మేన్ వచ్చి రెండు వుత్తరాలిచ్చి వెళ్ళాడు. ఒకటి మోహన్ కుమార్ మిత్రుడు వ్రాసింది. మరొకటి అమరేశ్వరి చిరునామాకు వొచ్చింది. పైదస్తూరిచూసి, ఆ లేఖ కరుణానిధి దగ్గరనుంచి వచ్చిందని అతడు గ్రహించాడు. వెంటనే జేబులో పెట్టుకున్నాడు.

వంటగదిలోంచి హాలులోకి వస్తూ "బావగారూ ! అక్కయ్యకు ఏమయినా వుత్తరాలొచ్చాయా ?" అన్నది వుమాశశి.

పెదాలు చప్పరించాడు మోహన్‌కుమార్ ఏమీ రాలేదన్నట్టు.

ఉమాశశి ముఖంలో నిరుత్సాహపు నీడలు కదులాడాయి. బరువుగా అడుగులు వేసుకుంటూ మళ్లీ వంట గదిలోకి వెళ్ళింది.

అక్కా చెల్లెళ్లిద్దరూ డాక్టరు కరుణానిధి దగ్గరనుంచి ఉత్తరంకోసం ఎదురు చూస్తూన్నారన్న మాట. ఇద్దరూ కల్సి ఆయనతో ఏదో రహస్యంగా గూడుపుఠాణీ జరుపుతున్నారన్న మాట. ఏమిటో అది! ఆ ఉత్తరం విప్పి చదివితే తనకు అర్థమౌతుందిగా! అనుకున్నాడు మోహన్‌కుమార్.

ఆ తర్వాత స్నానంచేసి, భోజనం చేశాడు మోహన్ కుమార్. అతని ముఖం చాల గంభీరంగావుంది కొంచెంసేపు కూడా విశ్రమించకుండా, వెంటనే కారు వేసికొని హాస్పటల్‌కు వచ్చాడు. - అక్కడ స్లాబ్ వర్కు జరుగుతూండగా, హాస్పటల్ ఆవరణలో కారు ఆపి, ప్రక్క జేబులో చేయి పెట్టాడు - ఆ వుత్తరంకోసం ఆశ్చర్యపోయాడు జేబులో ఆ వుత్తరం లేదు. కసిగా పెదాలు నొక్కిపట్టి 'ఇది ఉమాశశి పనియై వుంటుంది. నేను స్నానం చేస్తూండగా జేబులు వెతికి ఆ వుత్తరం కాజేసి వుంటుంది' అనుకున్నాడు మోహన్ కుమార్.

*　　　*　　　*

మోహన్‌కుమార్ కారువేసికొని వర్కుస్పమీదకు వెళ్లగానే, ఉమాశశి బావగారి ప్యాంటు జేబులోంచి తీసిన వుత్తరాన్ని అక్కయ్యకు చూపెట్టింది.

"అక్కా! బావగారెంత నీచపుపని చేశారనుకుంటున్నావ్? నీకు వొచ్చిన ఉత్తరాన్ని తను తీసికొని, 'ఏమీ రాలేదు' అని నాతో అబద్ధాలాడి, జేబులో భద్రంగా దాచుకున్నారు. ఎందుకో నీకొచ్చిన ఉత్తరాల్ని చూడాలని ఆయన

గారికంత అభిలాష? ఇదేమైన సభ్యతేనా!" అన్నది ఉమాశశి బావగారి ప్రవర్తనను అసహ్యించుకుంటూ.

అమరేశ్వరి ఆ ఉత్తరాన్ని విప్పి చూసింది.

"...ఇప్పుడు నాకు పెళ్ళి చేసుకొనే అభిప్రాయం లేదు. నా జీవితానికి వివాహం ముఖ్యంగా భావించుట లేదు. ఉద్యోగ ధర్మానికి బ్రతుకు అంకితంచేసి, శక్తివంచన లేకుండా వైద్య సేవద్వారా ప్రజలకు ఉపయోగపడటమే నా జీవిత లక్ష్యం. అందులోనే నాకు సుఖమూ, శాంతీ, సంతృప్తి ఉమాశశిగారికి వేరే మంచి వరుణ్ని చూడటం సమంజసం నీ మనసుల్ని నొప్పించితే క్షమార్హుణ్ని-

— కరుణానిధి

ఆ లేఖ చదివి తన ప్రయత్నం నిష్ఫలంకాగా నిశ్చేష్టురాలై చెల్లెలి కిచ్చింది అమరేశ్వరి.

అక్కయ్య ముఖకవళికల్లోని నిరాశా మేఘాల్ని గమనించి ప్రాన్పడిపోయింది ఉమాశశి ఆ లేఖను చదువుకుంది. కళ్ళల్లో నీళ్ళుకదలగా, పెదాలు బిగబట్టి కొన్ని నిముషాల పాటు నిశ్చలంగా నిలబడింది. ఆపైన హృదయంలో దుఃఖం వేగంగా పొర్లి ప్రవహించగా,నిలబడలేక, మంచంపై బోర్లా పడుకొని కన్నీరు కార్చింది.

అమరేశ్వరి చెల్లెల్ని ఓదార్చటానికి ప్రయత్నించింది.

ఆరోజు రాత్రి మోహన్‌కుమార్ కారు చప్పుడు వినవచ్చేసరికి పదిగంటలు దాటింది అప్పటివరకూ అక్కచెల్లెండ్రిద్దరూ నిశ్శబ్దంగా మేల్కొనే ఉన్నారు. అమరేశ్వరి

వరండాలో లైటువేసి, భర్తకు ఎదురు వెళ్ళింది. మోహన్ కుమార్ కారు తాళం చెవుల్ని చేతిలో తిప్పుకుంటూ, గాలిలో తేలిపోతూన్నట్టు తూలుతూ వరండాలోకి వచ్చాడు, అమరేశ్వరి భర్తస్థితికి భయపడింది. బాగా తాగిఉన్నాడు. విస్కీవాసన జమాయించి కొడుతూవుంది భర్త అలాంటి ఒళ్ళు తెలీని స్థితిలో ఇంటికి రావటం ఆమెకు కొత్తకాదు. కాని ఉమాశశి మేల్కొనేవుంది ఇప్పటికే బావగారి ప్రవర్తనపట్ల చెల్లెలికి జుగుప్స ఎక్కువైంది. ఈ దిక్కులు తెలీని నిషాలో ఉమాశశిచూస్తే ఇంకేమైనా వుందా?

"రాణీగారింకా నిద్రబోలేదా! నా కోసం ఎదురు చూస్తున్నావా? లేకపోతే పాత ప్రియుడు డాక్టరు కరుణానిధిని గూర్చి తలపోస్తూ కూర్చున్నావా?" అన్నాడు మోహన్ కుమార్ వెటకారంగా నవ్వుతూ.

అమరేశ్వరి నిర్విణ్ణురాలైంది - భర్త కొత్తధోరణికి అదివరకెన్నడూ ఆయనగారు కరుణానిధి పేరెత్తలేదు. పెళ్ళికి ముందు తను కరుణానిధిని ప్రేమించినట్టు ఎలా తెల్సిందో!

"డాక్టరు కరుణానిధి నీకు పాత ప్రియుడన్న సంగతి ఎట్లా తెల్సిందని ఆశ్చర్యపోతున్నావా!" చీకట్లో ఫిరంగి పేల్చినట్లు పెద్దనవ్వు. "తెలియకుండా వుంటుందా! తెల్సుకోకుండా వుంటానా! నువ్వు ప్రేమించి ప్రేమించి పెళ్ళి చేసుకోలేక వాదిలేసి - ఇప్పుడు నీ చెల్లెల్ని తరుముతున్నా వన్నమాట? నంగనాచిలాగ వుండి, ఎంత గ్రంథం నడుపుతున్నావే!" అంటూ హాల్లోకి వచ్చాడు మోహన్‌కుమార్.

తూలి ఓసారి క్రింద పడబోయాడు. అమరేశ్వరి పట్టుకుంది. భర్తమాటలు ఆమె గుండెల్లో పదునైన ఈటెల్లా గుచ్చు కున్నాయి. కాని అంతలోనే సంబాళించుకుంది విస్కీ మత్తులో ఏం మాట్లాడుతున్నదీ తెల్సుకోలేని పరిస్థితిలో మాట్లాడుతున్నారని.

• హాలులో ఉమాశశి లేదు. తన గదిలోకి వెళ్ళి పడు కొంది. ఆమె మనస్సు బాహ్యజగత్తులో ఏం జరుగుతున్నదీ గ్రహించే వునికిలో లేకపోయినప్పటికీ బావగారు నిషాలో వేస్తూన్న కేకల్ని అలవోకగా వినసాగింది.

కుర్చీలో ఏటవాలుగా కూర్చుని బూటుకాళ్ళను టేబుల్ పైనపెట్టి తల విదిలించసాగాడు మోహన్‌కుమార్. విస్కీ కైపు తలలో కైవారాలు చుట్టుతూవుండగా నుదురు సాగదీసి, కళ్ళు ఆర్పుతూ భార్యకేసి చూశాడు. తనమాట లకు ఆమె ముఖంలో కలిగిన సంచలనాన్ని పరిశీలిద్దామని అతని కోర్కె. కాని నరనరాల్లో మధురపానీయం తాలూకు మత్తు ఉవ్వెత్తుగా ఎక్కి, భార్యముఖాన్నే స్పష్టంగా గుర్తించలేని దశకొచ్చాడు. తను పన్నెండు ఔన్సులు 'బ్లాక్ నైట్' విస్కీ తాగినప్పటికీ మానసిక చేతనావస్థను కోల్పో లేదనీ, పంచేంద్రియాలు తనకి సరిగ్గానే పనిచేస్తుండగా తను యదార్థాన్ని మాట్లాడుతున్నాననీ, ఆ విషయం ఆమె తెల్సి కోవాలనీ - అతని ఆరాటం.

"డాక్టరు కరుణానిధితో సీక్రెట్ కరస్పాండెన్సు నడుపుతున్నావన్నమాట! ఇవాళ ఓ ఉత్తరం వచ్చిందిగదూ

ఆయన దగ్గర్నుంచి ఏం వ్రాశాడు? 'నీభర్త వొట్టి దుర్మార్గుడూ, త్రాగుబోతూ, జూదరీ, వ్యభిచారీ, లంచగొండీ, — నన్ను వివాహం చేసికోని నీ బ్రతుకు బూడిదపాలేను' అని వ్రాశాడా! చెప్పు ఏం వ్రాశాడు ఇంకా మీ ఇద్దరిమధ్యా ఉత్తరాలు నడవాల్సిన అగత్యమేమిటి?" అన్నాడు మోహన్‌కుమార్ కఠోరమైన ఎద్దేవతో.

కొన్నిక్షణాలపాటు దుఃఖ స్తంభితురాలై నిలబడింది అమరేశ్వరి. తనని భర్త అనుమానిస్తున్నాడన్న భావం మెరుపు మబ్బుల్ని చీల్చినట్టు ఆమె హృదయాన్ని చీల్చింది. గబగబా అల్‌మరా దగ్గరకు వెళ్ళి డాక్టరు కరుణానిధి వ్రాసిన లేఖను తీసికొచ్చి భర్తచేతికిచ్చింది.

ఆ లేఖను చదివేందుకు మోహన్ కుమార్ ప్రయత్నించాడుగానీ - చూపు అనుమతించలేదు. అక్షరాలు దాగుడుమూతలాడుతున్నట్టుగా జరుగుతున్నాయి. నిషా ఖాగా తలకెక్కింది బిగ్గరగా నవ్వుతూ కుర్చీలోంచి లేచి, పడకగదిలోకి వెళ్లి పడుకున్నాడు అమరేశ్వరి భర్తబూట్లు విప్పింది.

"భోజనం చేయరూ?" అన్నది అమరేశ్వరి.

మోహన్‌కుమార్ మాటాడలేదు. కళ్ళు మూసికున్నాడు. ఆ మత్తులో నిద్రబోయాడు. అమరేశ్వరికూడా ఆ రాత్రి భోజనం చేయలేదు. అర్ధరాత్రి దాటేవరకూ మేల్కొనేవుంది.

# ౧౩

మోహన్‌కుమార్ ప్రవర్తన రోజురోజుకీ శ్రుతిమించి రాగాన పడజొచ్చింది. ఉద్యోగాన్ని సక్రమంగా నిర్వహించుటలేదు. వర్క్సుమీదకు విధిగా వెళ్ళటంలేదు తన బాధ్యతల్ని క్రింది ఉద్యోగస్తులకు అప్పగించి - కంట్రాక్టర్లతో, స్నేహితులతో గెస్టుహౌసులో తరచు ఖుషీగా గడుపుతున్నాడు. మూడుసార్లు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు వర్క్ సూపర్‌విజన్‌కొస్తే మోహన్‌కుమార్ అక్కడలేదు సూపరింటెండింగ్ ఇంజనీరు వర్క్ చూడటానికి వచ్చినా - మోహన్‌కుమార్ డ్యూటీలో లేడు. సెలవు పెట్టలేదు ఆపైన ఇ. ఇ. తన దగ్గరకు పిలిపించుకొని అతని బాధ్యతారహిత ప్రవర్తనకు తీవ్రమైన అసంతృప్తిని వెలిబుచ్చి గట్టిగా హెచ్చరించాడు- ఇకముందు అలాంటి లోట్లు జరుగరాదని. కాని మోహన్‌కుమార్ లక్ష్యపెట్టలేదు. ఒకరోజు ఒక బిల్డింగు గదిపైకి స్లాబ్ వేస్తూంటే సూపర్‌వైజర్ను చూడమని మెక్కడికో వెళ్లాడు మోహన్‌కుమార్. ఆ కంట్రాక్టరు సూపర్‌వైజర్ను మచ్చిక చేసికొని సిమెంటూ, ఇసుకా మిక్చర్‌లో సిమెంటు

తక్కువ, ఇసుక ఎక్కువ పాళ్ళల్లో వేయించి స్లాబ్ పోయించాడు. మూడోనాటికే ఆస్లాబ్ నెర్రలువిచ్చి, విరిగి క్రిందపడింది. దానిపై పైఅధికారులు ఆగ్రహించి, విచారణ జరిపించగా – అసిస్టెంట్ ఇంజనీరు మోహన్‌కుమార్ ఆరోజు స్లాబ్ వేశేటప్పుడు అక్కడలేడనీ, తన ధర్మాన్ని నిర్లక్ష్యపర్చి అక్రమంగా ప్రవర్తించాడనీ నిరూపించబడింది.

అయినప్పటికీ మోహన్‌కుమార్ భయపడలేదు. ఏం జరిగితే అదే జరుగుతుంది—అన్న ధీమాతో ఉన్నాడు. తన ప్రవర్తనలో ఏమీ మార్పును కనబర్చలేదు. రోజూ రాత్రుళ్ళు పదిగంటలు దాటాక వాళ్లు తెలీని నిషాలో, మత్తుతో ఇంటికి వస్తున్నాడు. ఆరోజుకూడా అదే స్థితిలో రాత్రి పదకొండు గంటలకు ఇంటికి వచ్చాడు. భోజనం చేయలేదు ఏమీ మాట్లాడకుండా పడుకున్నాడు రోజూ అమరేశ్వరిని వ్యంగ్యాత్మకంగా నిందిస్తూ వుండేవాడు. ఆరోజు భర్త నిశ్శబ్దంగా పడుకోవడంలో ఏదో విశేషముండి వుంటుందనుకున్నది, అమరేశ్వరి. ఓగ్లాసు పాలుత్రాగి ఆమెకూడా నిద్రకొరిగింది లైటు ఆర్పివేసి. ఆలోచనలతో చాలసేపటివరకూ మేల్కొనేవుంది. చివరకు ఏ అర్థరాత్రో నిద్రబోయింది.

ఉమాశశి గదిలోంచి కెవ్వున కేకవినిపించింది. అమరేశ్వరి ఉలిక్కిపడిలేచింది. ప్రక్కన మంచంపై భర్త లేడు. లైటు వేసివుంది. ఉమాశశి గదినుండి మోహన్ కుమార్ ముఖం అవజ్ఞా భారంతో వ్రేళ్ళాడ వేసికొని వస్తున్నాడు.

అమరేశ్వరి నిశ్చేష్టప్రతిమయైంది. టేబుల్ పైన గడి యారం రెండు గంటలకాలాన్ని చూపుతోంది.

ఉమాశశి భయభ్రాంత చేతస్కురాలై వణికిపోతూ గది బయటికొచ్చింది. "అక్కా!" అంటూ బావురుమన్నది. పరిస్థితిని అర్థం చేసికొంది అమరేశ్వరి. ఛీ, చివరకు ఎంత దుర్మార్గంలోనికి దిగారాయన?

"అక్కా! బావగారు చీకట్లో నాగదిలోకి వచ్చి నా మంచంపై కూర్చుని మీద చేయివేశారు! ఏమిటి ఆయన వుద్దేశం? ఏం పాడుబుద్ధి? ఎంత చదువుకున్నా, ఏం ఉద్యోగం చేస్తున్నా, ఎంత హోదాల్లో ఉన్నా, - సభ్యతా, సంస్కారాలు, నీతి నిజాయితీలు లేకపోయింతర్వాత మనిషికి విలువ ఏముంటుంది? అక్కా! నువ్వు యింట్లో వుండగానే ఈ అవినీతికి సాహసంచేస్తే-ఇంకా బయట ఎన్ని అత్యాచారాలు చేస్తున్నాడో బావగారు" అన్నది ఉమా శశి క్రోధోద్వేగపూరిత చిత్తంతో.

మోహన్‌కుమార్ ముసుగు తన్ని పెట్టి పడుకున్నాడు. మొదలు నరికిన అరటిచెట్టులా కూలిపోయింది అమరేశ్వరి. మిగతా రాత్రి అక్కచెల్లెండ్రిద్దరూ నిద్రబోలేదు. మోహన్ కుమార్ మామూలుగానే నిద్రబోయాడు.

ఆ మరునాడు మోహన్‌కుమార్ ఆలస్యంగా నిద్రలేచి ముఖంకడుక్కొని కాఫీ తాగి స్నానం చేయకుండానే వరండా మీదకు వెళ్ళాడు. భార్య ముఖంకేసి చూడలేకపోయాడు.

ఉమాశశి నీడనుచూసే భయపడసాగాడు. రాత్రి ఆమె అన్న మాటల్ని విన్నాడు.

ఆ రోజు మధ్యాహ్నం ఒంటిగంటకు గుంటూరునుంచి లాయరు సుందరరామయ్యగారు వచ్చారు. ఉమాశశిని ఇంటికి తీసుకెళ్దామనే వుద్దేశ్యంతోనే ఆయన రావటం జరిగింది తండ్రి వొచ్చాడని తెలియగానే ఉమాశశి గుండెలో భయం దట్టమైంది. రాత్రి బావగారు తన గదిలోకి వొచ్చిన సంఘటనతోనే మనస్సంతా చీకాగ్గావుంది. ఆ చీకాకుకు భయం జతకూడింది. ఆమె ఎంత సేపటికి తండ్రికి ఎదురుపడలేదు. తన గదిలోనే కూర్చున్నది. ఆయనగారే గదిలో కొచ్చి ఉమాశశిని చూసి, సౌమ్యంగా పలుకరించారు. "పరీక్ష ప్యాసైనావు తెలుసా? మొన్న పేపర్లో పడ్డాయిగా రిజల్ట్సు! ఆర్డనరీగా ప్యాసైనావు. క్లాసు వొస్తుందని అనుకున్నాం"

ఆశ్చర్యపోయింది ఉమాశశి - తండ్రి అంత సరళంగా మాట్లాడటానికి, పరీక్ష ఫలితాన్ని గురించి యింతకాలమూ తను మర్చిపోయినందుకూ.

"అమరేశ్వరి! ఇక్కడికి న్యూస్ పేపరు రాదా?" అన్నారు లాయరు సుందరరామయ్యగారు.

"ఎందుకు రాదు నాన్నగారూ!"

"మరి ఆంధ్రా యూనివర్శిటీ బి. ఏ. రిజల్ట్సు మీరు చూడలేదా?"

"రెండు మూడు రోజుల్నుంచీ పేపరు చూడడంలేదు" అన్నది అమరేశ్వరి తప్పును ఒప్పుకుంటూ.

"ఎందుకని ?" లాయరుగారి ప్రశ్న.

సమాధానానికి తడబాటు చెందింది అమరేశ్వరి

"రేపు ఉదయం బస్సుకు ఉమాశశిని తీసికెడతా నమ్మాయీ !"

"ఊఁ!" అన్నది అమరేశ్వరి. ఆమె తండ్రికి ఉత్తరం వ్రాసింది - ఉమాశశి ఇక్కడ ఉంటూన్నట్టూ, ఓసారి రమ్మనమనిన్నూ ఉమాశశి మనస్సు వికలమైవున్నదనీ, ఆమెను ఏమీ ఆగ్రహించవద్దనీ కూడా ఆ ఉత్తరంలో తండ్రిని హెచ్చరించింది. అందువల్లనే లాయరుగారు మనస్సులో చిన్న కూతురిపై ఎంత ఆగ్రహం వున్నప్పటికీ తప్పనిసరై సౌమ్యతను నటించాడు. క్రితం రోజువరకూ అమరేశ్వరి చెల్లెల్ని కొన్నాళ్ళపాటు అక్కడే వుంచుదామని అనుకున్నదిగానీ, రాత్రి సంఘటనతో ఆమె మనస్సు మార్చుకుంది. ఆయనగారి చంచల స్వభావానికి ఏం ప్రమాదాలు వాటిల్లుతాయో, పరిస్థితులెట్లా పరిణమించుతాయోనన్న భయంతో ఉమాశశిని గుంటూరు పంపించడమే శ్రేయస్కరమనుకుంది.

మధ్యాహ్నం వేళకే భోజనానికి వొచ్చాడు మోహన్ కుమార్. మామగార్ని చూడగానే గుండెల్లో బరువు బయలుదేరింది. "ఎప్పుడొచ్చారు?" అని పలుకరించాడు. అంతే. త్వరత్వరగా భోజనం ముగించి మళ్ళీ వర్క్సుమీదకు వెళ్లాడు. ఇంట్లో వుండడమంటే ముళ్ళకంపమీద కూర్చున్నట్టుగా

వుంటూన్నది అతనికి రాత్రి నుంచీ. ఆలోచించుకున్నకొద్దీ మోహన్‌కుమార్ మరీ క్రుంగిపోతున్నాడు. తను ఎంత సాహసం చేశాడు? ఎంత మూర్ఖంగా ప్రవర్తించాడు! ఉమాశశి నిప్పులాంటిదని తెలుసు. ఆమె సుస్వభావమూ, వ్యక్తిత్వపు పదునూ, నీతీ నిజాయితీ, సాంఘిక విలువలపట్ల ఆమె అభిప్రాయాలూ తనకు తెలుసు. మరి తను ఎందుకంత ప్రమాదభూయిష్టమైన సాహసం చేసినట్టు? ఎన్నాళ్ళుగానో ఆమెనుంచి అనుభవాల్ని పొందాలనే వాంఛ అజ్ఞాతంగా వుండడవల్లనైతేనేమి, విస్కీ మత్తువల్ల ఆ ప్రేరేపణ హఠాత్తుగా తనని పిచ్చివాడిగా మార్చటంవల్లనైతేనేమి, బలాత్కారంచేస్తే లొంగకపోతుందా అన్న భావం కలగడంవల్లనైతేనేమి, — ఆ సాహసం చేశాడు తను. అనూహ్యమైన దుర్ఘటన! తనభార్యా ఆమె ఏమనుకున్నారో! మామగారితో చెప్పారేమో! ఏం చెబితే! ఎవరనుకున్నా తను భయపడాల్సిన పనేముంది. పెద్దపెద్ద అధికారులకు ఇంతకంటే ఘోరమైనన పనులు చేస్తూ భయపడటంలేదు. వెధవది ఈ ఆడవాళ్ళకు తను భయపడటమేమిటి? తనని గురించీ, తన పోకడలను గురించీ, నీతీ నిజాయితీలపట్ల తన నిర్లక్ష్యాన్ని గురించి-అమరేశ్వరికీ, ఉమాశశికీ ఈ పాటికే పూర్తిగా తెలిసే వుంటుంది. కొత్తగా తనపై వాళ్ళు చెడ్డ అభిప్రాయాల్ని ఏర్పర్చుకొనే దేముంటుంది? ఏర్పర్చుకున్నా తనకి వొచ్చిపడే ఇబ్బందులేమీ వుండవోవు అనుకొని తనను తాను సంబాళించుకుచున్నాడు

మోహన్‌కుమార్. తను చేసే పనుల్ని ఎప్పటి కప్పుడు తెగింపుతో, అలక్ష్యంగా సమర్థించుకోవటానికి అతను అల వాటు పడ్డాడు. ఆ అలవాటుతో జీవితాన్ని గురించి మొండి ధైర్యాన్ని పెంచుకోసాగాడు

ఆ రాత్రి ఎనిమిది గంటలకు మోహన్‌కుమార్ ఇంటికి ప్రశాంతంగా వచ్చాడు ఎప్పటిలాగే ఆ రాత్రికూడా భర్త విస్కీ పుచ్చుకొనివచ్చి, నాన్నగారి ఎదుట అపసవ్యంగా ప్రవర్తిస్తాడేమోనని అమరేశ్వరి భయపడిందిగానీ, అలా జరగ నందుకు లోలోపల ఎంతో సంతోషించింది.

మరునాడు ఉదయం బస్సుకు లాయరు సుబ్రా మయ్యగారూ, ఉమాశశీ బస్సులో గుంటూరు వెళ్లారు. వెళ్ళేముందు అమరేశ్వరి తండ్రిని ప్రక్కకుపిల్చి ప్రత్యేకంగా చెప్పింది: "నాన్నా! ఉమాశశికి దాని ఇష్టంలేకుండా పెళ్ళి ప్రయత్నాలు చేయవద్దు దాని మనస్సు బాగా దెబ్బతిన్నది దాని అభిప్రాయాలకు వ్యతిరేకంగా ఏం తలపెట్టినా, దాని మనస్సును పూర్తిగా పాడుచేసినవాళ్ళమే అవుతాము. ఆపైన పరిణామాల్ని ఊహించలేము"

'సరేలే' అన్నట్టు తల ఆడించాడు లాయరుగారు.

తర్వాత వారంరోజులకే మోహన్‌కుమార్‌కి విజయ వాడ ట్రాన్స్ఫర్ వచ్చింది,

# ౧౪

మానవునిలోని సుఖలాలస నీటిప్రవాహం లాంటిది. ప్రవాహ వేగానికి ఇసుక తిన్నెలు ఎలా కరిగిపోతాయో, మనోనిగ్రహం లేనివాళ్ళు సుఖలాలసతో అలా కరిగిపోతారు. విజయవాడ వచ్చాక మోహన్‌కుమార్‌కి సుఖలాలసత తీవ్రతరమైంది. విజయవాడ వాతావరణం అతని కోర్కెల గుర్రపు స్వారీకి అనువుగావుంది.

గవర్నరుపేటలో ఓడాబా అద్దెకు తీసికుని వుంటున్నారు. ఒకసారి సరస్వతమ్మా, లాయరుగారూ వచ్చి, రెండు రోజులుండిపోయారు, ఉమాశశి రాలేదు. అమరేశ్వరి ఉత్తరాలద్వారా ఆమెకు మనోధైర్యాన్నీ, జీవితంపట్ల ఆశా దృక్పథాలనూ బోధిస్తోంది. కాని తన విషయంలో మటుకు డానోధైర్యాన్ని, జీవితంపట్ల మమకారాలనూ, ఆశాదృష్టినీ కోల్పోతోంది. విజయవాడ వచ్చిన దగ్గర్నుంచీ ఆమె మానసికస్థితి మరీ అధ్వాన్నంగా తయారైంది.

మోహన్‌కుమార్‌కి తాడూ బొంగరం లేని ఒక మిత్రుడు తటస్థపడ్డాడు. ఆయన సూర్యారావుపేటలో ఓ

క్లబ్బును నడుపుతున్నాడు. ఆ క్లబ్బులో పగలు పేకాట, రాత్రిళ్ళు తాగితందనాలాడడం, అందమైన బొమ్మలుకూడా సుఖసోపానాల నిమిత్తం ఆ క్లబ్బులోకి దిగుమతి అవుతూ వుంటాయి. రోజు మొత్తంమీద మోహన్‌కుమార్ మకాం ఎక్కువ ఆ క్లబ్బులోనే. అక్కడికి రకరకాలైన తరహాలుగల వ్యక్తులు చేరుతూవుంటారు. ఉద్యోగస్తులూ, వ్యాపారస్తులూ, కాలుమీద కాలు వేసుకొని కడుపులో నీళ్ళు కదలకుండా కాలాన్ని వెళ్ళబుచ్చే వాళ్ళూ, జీవిత సంగ్రామంలో ఓడి పోయి నిరాశా నిస్పృహలతో (బతకలేక కాలక్షేపం కోసం ఆరాటపడేవాళ్ళూ, జూదం జీవితంలో ఒక భాగంగాభావించి ఆరాధించేవాళ్ళూ, తిండికి జరగక పై)వేట్లుచేస్తూ క్లబ్బులో కాపురముండేవాళ్ళూ... లక్షాధికార్ల దగ్గరనుంచీ రిక్షాలు తొక్కేవాళ్ళవరకూ ఆ క్లబ్బులో వుంటూ వుంటారు. ఈ రోజుల్లో నాగరికతకూ సంస్కృతికీ పొత్తు కుదరటం లేదేమో? నాగరికత అత్యున్నత శిఖరాలకు అభివృద్ధి చెందిందని గర్వించే ఆధునిక మానవునిలో వ్యక్తిగత సంస్కృతి సభ్యతపై చూపే మోజుకొద్దీ దెబ్బతింటూన్నది. వ్యక్తి సమాజంలో భాగస్వామిగనుక తద్వారా సమాజగత సంస్కృతే కుంటుబడుతూన్నది. ఆత్మ సంస్కారపు స్థాయిని గురించి ఆలోచించకుండా, మానవుడు భౌతిక సుఖాపేక్షాపరుడై ఆ స్థాయిలో సభ్యతను సూచించే రంగుల చొక్కాను ధరిస్తున్నాడు. మోహన్‌కుమార్ ఆ తరగతికి చెందిన మనిషే. ఉన్నతవిద్యా, ఉద్యోగపు హోదా—అతని

ఆత్మ సంస్కృతిని అభివృద్ధి పర్చలేదు. మనస్సు కల్పించే సుఖాలకు బలహీనుడైనాడు. నవభారత నిర్మాణంలో ఉపయోగపడే సాంకేతిక విద్యలో డిగ్రీ సంపాదించి, ఉద్యోగంలో ప్రవేశించి — ఆ ఉద్యోగములో అవినీతి సంపాదనకు ప్రాధాన్యతనిచ్చి, మరీచికలాంటి సౌఖ్యాలకోసం నైతికపతనం చెందాడు. ఆ నైతిక పతనం అతనిలో సంఘం పట్ల నిర్లక్ష్యతనూ, బ్రతుకులో తెగింపునూ, ఆత్మీయులను గురించి నిర్లిప్తతనూ పెంపొందించింది.

విజయవాడ వచ్చిన మూడుమాసాల్లో అమరేశ్వరి హృదయగతస్థితి ఊహకు అందనంతగా నీరసించింది. శారీరకంగా కూడా ఆమెలో భీతిగొల్పే మార్పులొచ్చాయి. పెళ్ళికి ముందు ఆమె శరీర సౌందర్యానికీ, లావణ్యానికీ, ఆకర్షణకూ - మూడు నాలుగేళ్ళ సంసార జీవితానుభవాన్ని పొందిన ఆమె శరీర సౌందర్యానికీ, లావణ్యానికీ, ఆకర్షణకూ ఎక్కడా పోలికలు లేవు. చెట్లనుంచి వేరుచేసినపువ్వు వాడిపోయి అందాన్ని, పేశలత్వాన్నీ, ఆకర్షణ గుణాన్ని కోల్పోయినట్టు-ఆమె సౌందర్యం వాడిపోయింది. ఆకర్షణ క్షీణించింది. ఆమెను బ్రతుకుపై విరక్తి హెచ్చింది. వర్తమాన జీవితపు నీడలు భవిష్యత్తులోని చీకటిలోకి జరుగుతూన్నట్టు కనిపించ సాగాయి.

...ఇంకా అను బ్రతికిమటుకు ప్రయోజనమేమిటి? ఎందుకు? ఏం సాధించటానికి? కాలేజీలో చదువుకొనే

రోజుల్లో కొన్ని ఆశయాలూ, ఆదర్శాలూ, అభిలాషలూ వుండేవి. వాటిని ఆచరణలో పెట్టి, ప్రశాంతంగా జీవన మాధుర్యాన్ని అనుభవించాలనే జిజ్ఞాస బలంగా వుండేది. కాని తన బ్రతుకులో ఆ అదృష్టం తటస్థపడలేదు. విధి యెదురు తిరిగింది. ప్రచండంగా వీచే 'ఎదురుగాలిలో' తను ప్రయాణిస్తోంది. ఈ ప్రయాణానికి గమ్యస్థానం మరణమే తెరచాప యెత్తినపడవ ఎదురుగాలిలో ప్రయాణం చేసినట్టు పరిస్థితుల ప్రాబల్యతవల్ల విధి ప్రేరేపణవల్ల జీవితంలో వీచే ఎదురుగాలిని ఆత్మ స్థయిర్యంతో యెదుర్కొని, ఆ పైన ప్రశాంతంగా స్థిరపడేవాళ్ళు వుంటారు అలాంటి ఆత్మస్థయిర్యం తనకు లేదు. తన బ్రతుకులో వీస్తూన్న ఎదురుగాలి త్వరలో సమసిపోయేదికాదు. తను మంచికాలం కోసం ఎదురు చూడడం వృథాయే! ఏదో శాపఫలంగా జీవితంలో. చీకట్లు నడుస్తున్నాయి. ఆనీడల్లో తను వెలుగుకోసం వేచి వుండటం నిష్ఫలమే!... ఆయనగారి అలవాట్లలో మార్పు రాదు. క్షణక్షణమూ తనని చిత్రహింసలాంటి మానసిక వ్యధకు గురిచేయడం ఆయనకు సరదాలా వుంది. తను ఏం తప్పు చేసింది? ఏం పాపం చేసికుంది? భగవంతుడు తనకెందుకీ శిక్ష విధించాలి? —— అట్లాంటి ఆలోచనలతో రోజురోజుకీ చిక్కి శల్యమైతూంది అమరేశ్వరి.

ఒకరోజు రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో మోహన్‌కుమార్ కారులో పద్ధెనిమిదేళ్ళ ఓ యువతిని వెంటబెట్టుకొచ్చాడు ఇంటికి.

ఆశ్చర్యపోలేదు అమరేశ్వరి. ఆ స్థితిలో లేదు. ఎప్పుడో ఒకప్పుడు భర్త తను బ్రతికుండగానే అంతటి నీచమైన అఘాయిత్యానికి పాల్పడతాడని ఆమె ఊహించింది

చిరునవ్వు నవ్వుతూ మోహన్‌కుమార్ ఆ యువతిని అమరేశ్వరికి పరిచయం జేశాడు. ఆ చిరునవ్వే ప్రకటిస్తోంది-అతని హృదయంలోని కల్మషత్వాన్ని.

"ఈమె పేరు నిర్మల. రాజమండ్రిలో నా స్నేహితుడు రామచంద్రమూర్తి చెల్లెలు. విజయవాడ చూడటానికి వొచ్చింది. రెండురోజులపాటు మన ఇంట్లోనే వుంటుంది"

నవ్వలేక నవ్వుతూ "మంచిది" అన్నది అమరేశ్వరి.

పని మనిషిచేత మోహన్‌కుమార్ కారులో వున్న ఆమె సామాన్లు పడమటి పక్క గదిలో పెట్టించాడు.

"ఇప్పుడు ఆమెకోసం వంట ప్రయత్న మేమీ పెట్టుకోకు, హోటలునుంచి క్యారియర్ తెప్పించి మేమిద్దరం భోజనంచేస్తాం. రోజూ నాన్ వెజిటేరియన్ లేనిదే భోజనం చేయదు" అన్నాడు మోహన్‌కుమార్ భార్యతో.

అమరేశ్వరి 'మంచిది' అనుకుంది మనస్సులో.

నిర్మల నవయౌవన విలాసంతో మెరిసిపోతోంది. అందరికంటె ఆమెలో ఆకర్షణ ఎక్కువ. పైపై మెరుగుల ఆకర్షణకంటె ఆమె కళ్ళలో మగవాడి హృదయంలో సూటిగా గిలిగింతలు పెట్టే సమ్మోహనశక్తివుంది. ఆ శక్తితో

ఆమె ఆ వయస్సుకే ఎంతోమంది మగవాళ్ళని తనచుట్టూ ప్రదక్షిణాలు చేయిస్తోంది. మగవాళ్ళని పిచ్చివాళ్లుగా చేసి అట్లా తనచుట్టూ తిప్పుకోవటం ఆమెకు సరదా. ఆమె హోటళ్ళలో వుండదు. తనని కోరిన ప్రియుని ఇంటికే రావటం; ఆ ఇంట్లో కల్లోలం పుట్టించడం, తనకోర్కె నెరవేరినట్టు సంతోషపడడం ఆమె మనస్తత్వంలోని ప్రత్యేకత.

ఆమెమనస్సు ఎక్కడనొచ్చుకుంటుందోనన్న భయంతో మోహన్‌కుమార్ ప్రతివిషయంలోనూ జాగ్రత్త తీసుకుంటు న్నాడు. ఆమె గదిలోని ఫర్నిచర్ బావుండలేదంటే సోఫా సెట్టు వేయించాడు. గోడలకున్న దేవుళ్ళపటాలు బావుండ లేదంటే తీయించాడు. బెడ్‌పైన పక్కగుడ్డలూ, దిండ్లూ నచ్చలేదంటే- సిల్కుదుప్పట్లూ, డన్‌లప్ పిల్లోలూ వేయిం చాడు.

హోటలునుంచి భోజనం వచ్చేప్పటికి రాత్రి పదిగంట లైంది. ఆ లోపల నిర్మల స్నానం చేసింది. డ్రస్సు మార్చు కొని, నీటుగా టాయిలెట్ అయింది ఉల్లిపొరలాంటి తెల్లని నైలాన్‌చీర; బెర్లిన్ కట్‌బ్లౌజు వేసికొంది మెడలోలాకెట్, ఆ ఆకారంలో ఆమెనుచూసి అసహ్యించుకుంది అమరేశ్వరి. ఆమె గుండె గాడిపొయ్యిలాగా గనగనమండుతూంది. ఏమీ చేయలేని అసమర్థతతో పిచ్చెత్తిపోతోంది.

భోజనానికి డైనింగ్ హాలుకు రాకుండా, తనగదిలోనే ఏర్పాటు చేయమంది నిర్మల. 'ఆల్‌రైట్. అక్కడే బావుంటుంది' అన్నాడు మోహన్‌కుమార్.

ఆ గదిలోకి అమరేశ్వరి వెళ్ళలేదు వంటగది గడపలో కూర్చుని వినసాగింది. పనిమనిషిని కూడా వాళ్ళు గదిలోకి రానివ్వలేదు.

వాళ్ళ భోజనానికి ముందు సీసాల మ్రోతలు వినబడ్డాయి. విస్కీ త్రాగుతున్నారేమో అనుకుంది అమరేశ్వరి. ఆమె గుండెలో క్షణక్షణానికీ ఆవేదనా, జుగుప్సా, భర్త బరితెగిన ప్రవర్తనపై కోపోద్రేకాలూ అధికమౌతున్నాయి ఆ గదిలోంచి జంటగా వినిపించే నవ్వులు ఆమె హృదయంలో పదునైన బాకుల్లా గుచ్చుకుంటున్నాయి. మద్యపానంతో మత్తెక్కి వీళ్లు మాట్లాడుకునే మాటలు ఆమెకు తగని రోతను కలిగిస్తున్నాయి.

భోజనాలైనాక మోహన్‌కుమార్ కేక వేయగా పనిమనిషి గదిలోకి వెళ్ళింది టేబుల్‌ను శుభ్రపర్చి, యివతలకొచ్చింది ఎంగిళ్లు తీసికొని.

అమరేశ్వరి వంటగది గడపమీదే కూర్చుంది.

పడమటి ప్రక్క గదిలో నవ్వులూ, సంభాషణలూ ఆగిపోయాయి. తలుపులు మూసికున్న చప్పుడు వినిపించింది.

ఏడుస్తూ అమరేశ్వరి తనగదిలోకి వెళ్ళిపడుకుంది. ఆ రాత్రి తెల్లవార్లూ కంటిమీద రెప్పవాల్చకుండా దుఃఖిస్తూనేవుంది.

* * *

అరుణోదయమైంది.

అమరేశ్వరి నిద్రమంచంమీదనుంచి లేచింది. ఆరాత్రి ఆమె నిద్రబోయిందిలేదు. తెల్లవారఝామున ఒక దృఢనిశ్చయానికొచ్చింది. ఆ నిశ్చయం తాలూకు స్థిర గంభీరత్వం ఆమె ముఖంలో స్పష్టంగా ముద్రితమైవుంది.

పడమటి ప్రక్క గదితలుపులింకా తెరుచుకోబడలేదు.

ఇంట్లో హాలుమధ్యన నిలబడి అమరేశ్వరి రెండు నిముషాలపాటు నిశ్శబ్దంగా చుట్టూ కలియజూసింది. పని మనిషి పెరట్లో అంట్లు తోముతోంది. ప్రక్క ఇంటివాళ్ళ రేడియోలోంచి శ్రీ వెంకటేశ్వర సుప్రభాతం వినవస్తోంది. అల్మరాలోంచి హ్యాండ్ బ్యాగ్ తీసికొని, ఇంటి బయటి కొచ్చింది అమరేశ్వరి. ఆమెను చూసి రిక్షావాడు దగ్గర కొచ్చాడు. ఆ రిక్షాలో ఎక్కికూర్చుని "బస్సు స్టాండుకు పోనివ్వు" అన్నది అమరేశ్వరి.

...తను ఎవ్వరితోనూ చెప్పలేదు ఎక్కడికి వెళ్ళేది! ఆయనగారు నిద్రలేచారో, లేదో! ఇంకా ఆ వస్నేలాడి

కౌగిలిలో సోలి తేలుతున్నారేమో! ఛీ ఛీ అలాంటి అవినీతి కార్యాన్ని చూడటానికేనా తను బ్రతికి ఉన్నది! స్త్రీ హృదయాన్ని నిలువునా చీల్చే దుర్ఘటన అంతకంటె వేరే ఏముంటుంది? తనపై కసిదీర్చుకోవటానికే ఆయనగారు ఇంత హీనస్థితికి దిగజారారా? లేక ఆయనగారి అవినీతి పోకడలు చరమస్థాయికి అందుకున్నాయా? సమాజమూ, పరిసరాలూ, ఉద్యోగపుహోదా, వ్యక్తిత్వపు విలువలూ, మానవత్వపు ఛాయలూ, సభ్యతా సంస్కృతీ–వీటికి దృష్టి పథంలోంచి తొలగించుకొని, భార్య ఇంట్లో వుండగా పరాయి స్త్రీతో కులుకుతారా? అంతకంటె దారుణం మరొకటి వుంటుందా? ఆ ఘోరకృత్యంకంటె – భార్యను చంపివేయడం సబబు. ఏమైనా తను యింకా భర్తను గురించీ, ఆయనగారు చేసే దుర్మార్గపు నడతల్ని గురించీ, దుర్విధిని గురించీ, ఆలోచించి కొని బాధపడటం అనవసరం, తను ఒక నిశ్చయానికి వొచ్చింది. ఆ నిశ్చయాన్ని అమలుపర్చడమే తన కర్తవ్యం. అదే తనకు ఆత్మశాంతి. అంతకంటె ఈ జీవితంలో తను సాధించేదేమీ వుండబోదు!

రిక్షా బస్సుస్టాండుకు వొచ్చింది. వాడికి డబ్బులిచ్చి, రిక్షాదిగింది అమరేశ్వరి.

సూర్యుడు రెండు బార్లపైకి ఎక్కాడు. అంతటా తెల్లని ఎండపర్చుకుంది.

అమరేశ్వరి బందరు వెళ్ళే బస్సులో ఎక్కి కూర్చుంది. ఆమె మనస్సు మబ్బులు దట్టంగా పట్టిన చీకటి రాత్రివలె ఉన్నది. తను గాఢంగా ఏర్పరుచుకొన్న నిశ్చయాన్ని గురించి సందేహాలు తలలెత్తసాగాయి. తన జీవితానికి మరేదైనా పరిష్కార మార్గంలేదా? జీవితంలో ఎదురుగాలికి తట్టుకోలేక, పరిస్థితులతో రాజీ కుదుర్చుకోలేక పిరికిగా ఆ నిశ్చయానికి తను వొచ్చిందా? తన భర్తను సన్మార్గానికి మళ్ళించే శక్తి సామర్థ్యమూ తనకు లేదా? కాలం ఆమనగారిలో ఊహించని మార్పు తీసికొని రావచ్చు. అప్పటివరకూ తనెందుకు ఓపిక పట్టరాదు!—ఆ సందేహాలకు అమరేశ్వరి సమాధానం చెప్పుకొని, తన నిశ్చయాన్ని గురించి సంతృప్తి పడింది.

ఉదయం ఏడున్నరకు బయలుదేరిన బస్సు బందరు చేరేప్పటికి పదకొండు గంటలైంది

రిక్షాలో గవర్నమెంటు హాస్పటల్‌కు వెళ్ళింది అమరేశ్వరి.

డాక్టరు కరుణానిధి హాస్పటల్‌లో లేడు ఆరోజు సెలవు పెట్టాడట. ఇంటికి వెళ్ళింది అమరేశ్వరి.

మేడపైన గదిలో ఉన్నాడు డాక్టరు కరుణానిధి ఏకాంతంగా పడకకుర్చీలో కూర్చున్నాడు కిటికీలోంచి కొబ్బరి చెట్ల ఆకులపై బడే తెల్లని ఎండను చూస్తున్నాడు.

చప్పుడులేకుండా ఆగదిలోకి ప్రవేశించిన అమరేశ్వరిని చూసి ఆశ్చర్యస్తబ్ధుడైనాడు డాక్టరు కరుణానిధి. గబుక్కున కుర్చీలోంచి లేచాడు. ఆమె మాట్లాడకుండా స్టీలు కుర్చీలో కూర్చుంది. డాక్టరు కరుణానిధి కొంచెం తమాయించుకొని మళ్ళీ కుర్చీలో కూర్చున్నాడు.

"ఇట్లా హఠాత్తుగా రావటం నీకు ఆశ్చర్యాన్ని కలిగిస్తోందికదూ" అన్నది అమరేశ్వరి పలుచని చిరునవ్వుతో.

అవునన్నట్లు తల ఆడించాడు, డాక్టరు కరుణానిధి. ఆమె కేసి కొన్ని నిముషాలపాటు తేరిపారజూశాడు. తనతో పాటు కాలేజీలో చదువుకున్న అమరేశ్వరికీ, ఈ అమరేశ్వరికీ రూపురేఖల్లో ఎంతో వ్యత్యాసం గోచరించింది. చావు బ్రతుకుల సంధ్యా నీడలలో వూగులాడుతున్నట్లుంది, జీవితం జీర్ణవస్త్రమైనప్పుడు, ఆశల మడుగులు ఎండిపోయి భవిష్యత్తు ఎడారిలో చీకటి మైనప్పుడు—మనిషి ఓ రకమైన నిర్లిప్తతను అలవర్చుకుంటాడు. అట్లాంటి నిర్లిప్తతే ఆమెలో స్పష్టంగా కనబడుతోంది. ఆమెను చూడగానే డాక్టరు కరుణానిధి హృదయం తల్లడిల్లింది,

"ఈ జన్మలో మనం శాపగ్రస్తులుగా మిగిలిపోయాం కేవలం నాదురదృష్టమే! నాదురదృష్టం నావరకే పరిమితమై వుంటే బావుండేది. కానీ అది మరికొందరి జీవితాలపైన కూడా దాని ప్రభావాన్ని చూపెట్టింది. అందుకే నేను మరీ

బాధపడుతున్నాను. నాదురదృష్టం నా జీవితంలో కలిగించే దుష్ఫలితాన్ని నేను అనుభవించక తప్పదు. కాని ఇతర్లు కూడా ఎందుకు గురికావాలి? అదే నా మనస్సును క్షోభ పెడుతూన్న వ్యధ! మీరు మా ఉమాశశిని తప్పకుండా వివాహం చేసికోవాలి. మీ ఇరువురి జీవితాల శ్రేయస్సు దృష్ట్యా ఈ వివాహం జరగాలి. మిమ్మల్ని ఎల్లాగయినా సరే వివాహానికి సుముఖుల్ని చేద్దామనేవచ్చాను" అన్నది అమరేశ్వరి పట్టుదలని సూచిస్తోన్న కంఠస్వరంతో.

డాక్టరు కరుణానిధి నిర్మలంగా చిరునవ్వు నవ్వాడు. "ఉమాశశిని తప్పకుండా వివాహం చేసికుంటాను."

అమరేశ్వరి హృదయం సంతోష ప్రపూర్ణమైంది. పేలవంగావున్న ఆమె ముఖం వికసించింది. తను యెంతో భయపడుతూ వచ్చినపని అతిసులభంగా అయింది. తన బ్రతుకు ఇదొక్కటె పరిపూర్ణమైన తృప్తి!

"నేను ఈ నిర్ణయానికి రావడానికి బలమైన కారణం ఉంది. మా అమ్మ చనిపోతూ చనిపోతూ ఆఖరు కోరికగా నా చేత ప్రమాణ చేయించుకుంది; తప్పకుండా వివాహం చేసికొనమని."

"మీ అమ్మగారు చనిపోయారా!"

"అవును. దాదాపు మూడు మాసాలైంది గుండె జబ్బుతో హఠాత్తుగా చనిపోయింది. కంటికి రెప్పగా, ప్రాణా

నికి ప్రాణంగా పెంచి, ఇంతవాడ్ని చేసిన మాతృమూర్తిని నా వైద్యవిజ్ఞానంతో, శక్తిసామర్థ్యాలతో దక్కించుకో లేకపోయాను. చచ్చేరోజువరకూ ఆవిడ నా పెళ్ళిని గురించి పోరాడుతూనేవుంది. చివరకు నా పెళ్ళిని చూడలేకపోయింది. ఇప్పుడు విచారిస్తూ వుంటాను.—యెంత అవివేకంగా, మూర్ఖంగా ప్రవర్తించానని తల్లికోర్కెను దీర్చని పుత్రుడు యెంత కఠినాత్ముడు?—ఆవిడ చనిపోయాక ఆత్మకోసమైనా వివాహం చేసికోక తప్పదని ఆ నిర్ణయాని కొచ్చాను" అన్నాడు డాక్టరు కరుణానిధి.

మనస్సులో డాక్టరుగారికి రెండు చేతులెత్తి నమస్కరించింది అమరేశ్వరి.

ఆ మధ్యాహ్నమే బందర్లో బయలుదేరి బస్సులో సాయంత్రానికి విజయవాడ వచ్చింది అమరేశ్వరి ఇంటిదగ్గర మోహన్‌కుమార్ లేడు, నిర్మలా లేదు. ఇద్దరూ నది వడ్డున షికారుకో. సినిమాకో, షాపింగుకో వెళ్ళివుంటారు అనుకొంది అమరేశ్వరి.

ఆ సాయంత్రమే చెల్లెలికి ఉత్తరం వ్రాసింది అమరేశ్వరి.

౧౫

ఆ రోజు పదిగంటలకు ఉమాశశికి అక్కయ్య దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. అక్కయ్య ఉత్తరాలే ఆమెకు ఆశారేఖలు. ఆ ఉత్తరాలకోసం ఎదురుచూస్తూ వుండటం ఆమె దినచర్యలలో ముఖ్యమైనది.

ప్రియమైన ఉమకు

బ్రహ్మాండమైన సంతోషవార్త తెలుపడానికి, అంతకంటె బ్రహ్మాండంగా సంతోషపడుతున్నాను. నిన్నఉదయం బందరు వెళ్ళాను డాక్టరు కరుణానిధిగారిని కల్సుకున్నాను. అసలు అందుకోసమే వెళ్ళింది. ఆయనగారు నిన్ను పెళ్ళి చేసికోవటానికి మనస్ఫూర్తిగా అంగీకరించారు. మీ ఇరువురి వివాహం నా జీవితంలో ఒకగొప్ప సంతృప్తి. మీ ఇరువురూ త్వరలోనే భార్యాభర్తలై పరిపూర్ణమైన సుఖశాంతులతో, ఆదర్శంగా, హాయిగా సంసార యాత్ర సాగించాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను.

—అక్కయ్య అమరేశ్వరి

ఆనందోత్ఫుల్ల హృదయినియై ఉమాశశి ఆ ఉత్తరాన్ని పట్టుకొని ఇల్లంతా గంతులేసింది, తల్లికి చూపెట్టింది. ఆవిడ కళ్ళల్లో ఆనందబాష్పాలు కదులాడినయ్. కోర్టుకు వెళ్ళబోతున్న తండ్రికి చూపెట్టింది. లాయరు సుందరామయ్యగారు తన సంతోషాన్ని నిండైన చిరునవ్వుద్వారా ప్రకటించారు,

"అక్కయ్య దగ్గరకు వెళ్ళొస్తాను నాన్నా!" అన్నది ఉమాశశి.

"సాయంత్రం చల్లబడ్డాక వెళుదువుగానిలే. ఎండ మండిపోతోంది." అన్నారు లాయరు సుందరామయ్యగారు కోర్టుకు వెళ్ళేందుకు కారు ఎక్కబోతూ.

ఎదురు చెప్పలేదు ఉమాశశి. తల్లిదగ్గర తన ఉత్సాహపు పొంగును వ్యక్తపర్చింది.

"ఇప్పుడే వెళతానమ్మా! అక్కయ్యను చూడనిదే నా మనస్సు పూరుకోదు"

"అదేమిటే! లేడికి లేచిందే ప్రయాణమన్నట్టు నాన్నగారు సాయంత్రం చల్లబడ్డాక వెళ్ళమన్నారుగా! ఈఎండలో వడగాడ్పులో ఎలా వెళతావు? ఇప్పుడొద్దులే. ఆనక వీలా

నాన్నగారొచ్చి 'ఎండలో యెందుకు పంపించావు ?' అని నన్ను కోప్పడతారు" అన్నది సరస్వతమ్మ చిరుకోపాన్ని ప్రదర్శిస్తూ.

ఏమీ మాట్లాడలేక తాత్కాలికంగా మెదలకుండా వూరుకుంది ఉమాశశి భోజనం చేసి డాక్టరు కరుణానిధిని గురించీ, అమరేశ్వరిని గురించీ ఆలోచిస్తూ కొంచెంసేపు మేను వాల్చింది. మరికొంతసేపు రేడియో పెట్టుకుంది; ఇంకాకొంత సేపు 'ఎదగనిపువ్వు' నవల తీసి పేజీలు తిరగవేసింది. ఎంతకీ కాలం ముందుకు జరగదు. యెండవేడిమి తగ్గదు. సాయంత్రం దగ్గరకు రాదు.

మూడుగంటలు కాగానే, త్వరగా ముస్తాబై హ్యాండ్ బ్యాగ్ తీసికొని, తల్లితో చెప్పి బయలు దేరింది ఉమాశశి విజయవాడ వెళ్లేందుకు. లాయరు సుందరరామయ్య గారింకా కోర్టునుంచి ఇంటికి రాలేదు.

మధురమైన ఆలోచనలతో బస్సులో గంటంబావు కాలం ఇట్టేజరిగిపోయింది.

విజయవాడ బస్సుస్టాండులో సాయంత్రం నాలుగూ ముప్పావుకు ఉమాశశి దిగింది.

ఇంకా సాయంత్రం సాంతం చల్లబడలేదు. వెచ్చ దనపుగాలులు వీస్తూనే ఉన్నాయి.

ఉమాశశి రిక్షా ఎక్కి, అడ్రస్ చెప్పి త్వరగా పోనివ్వ మన్నది. పదినిముషాల్లో రిక్షా గాంధీనగరంలో మోహన్ కుమార్ వుండే డాబాముందు ఆగింది. ఆమె అట్లా రిక్షా దిగి, డబ్బు లిస్తూండగా—వర్క్ మేస్త్రీ రామస్వామి సైకిలుమీద నురుగులు కక్కుకుంటూ వచ్చాడు.

"ఏమిటోయ్! అంత హడావుడీ!" అన్నది ఉమాశశి అతని ముఖంపై వ్రేళ్ళాడే ఆదుర్దానీ, భయభ్రాంతతనూ గమనించి. అతను రెండుమూడుసార్లు అమరేశ్వరి పంపించగా గుంటూరు వచ్చాడు. అక్కయ్యగారింట్లో వున్నారా?" అతనిగొంతు వణికింది.

"ఏం? ఏం జరిగింది!"

"అయ్యగార్ని యాంటి కరపన్ డిపార్టుమెంటు సి.ఐ. డీలు పట్టుకున్నారు- ఒక కంట్రాక్టరు దగ్గర్నుంచి వెయ్యి రూపాయలు లంచం తీసికొంటూ వుండగా."

"ఆఁ!" ఉమాశశికి మూర్ఛవచ్చినంతపనైంది.

"అక్కా! అక్కా!" అంటూ ఇంట్లోకి వెళ్ళింది

ఉమాశశి, వర్కు మేస్త్రీ రామస్వామికూడా ఇంట్లోకి వచ్చారు.

అక్కయ్యను కేకవేస్తూ ఇల్లంతా తిరిగింది ఉమాశశి శాళ్ళు తశబడే ఆదుర్దాతో, గొంతు పూడిపోయే తొట్రు పాటుతో. అమరేశ్వరి పలుకలేదు. ఆమె ఇంట్లో వున్న జాడే లేదు. పెరటి దొడ్లో కసువూడుస్తున్న పనిమనిషి వచ్చింది.

"అమ్మగారు యెక్కడ?" ఉమాశశి గుండెల్లో దడ అధికమైంది.

"మధ్యాహ్నం ఆగదిలో తలుపులు బిగించుకొని పడుకున్నారమ్మా! యెన్నిసార్లు పిలిచినా పలుకలేదు. నిద్ర బోతున్నారేమో!" అన్నది పనిమనిషి ఉత్తరపు ప్రక్కగది చూపిస్తూ.

అక్కయ్యను పిలుస్తూ ఆ గదితలుపుల్ని సత్తువకొద్దీ బాదింది ఉమాశశి. లోపలనుంచి సమాధానం లేదు వర్కు మేస్త్రీ రామస్వామికూడా గొంతు చించుకున్నాడు. లాభం లేకపోయింది. ఆ గది కిటికీలుకూడా మూసివున్నాయి.

ఉమాశశి భయకంపితురాలైంది.

ఇరుగూ పొరుగూ వాళ్ళని పిల్చి వర్కు మేస్త్రీ ఆ గది తలుపుల్ని పగులగొట్టించాడు.

కుర్చీలో మెడ వ్రేళ్ళాడ వేసికొని అచేతనంగా పడి వున్న అమరేశ్వరి. ప్రక్కన టీపాయ్ మీద చిన్న పాయిజన్ బాటిల్.

"అక్కా!" ఉమాశశి గొంతులోంచి ప్రాణం వూడి బయట పడ్డట్టుగా కెవ్వున కేక వేసింది.

సాయంత్రం నెమ్మదిగా నిష్క్రమించగా, మెత్తగా ప్రవేశించిన మునిమాపు చీకటి నీడల్ని ఆహ్వానించిది.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B113 |
| పుస్తకం పేరు | ఎదురుగాలి |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 201 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | S.Lakshmi |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |